Scholar's Edition 

శ్రీ ర స్తు

## వాత్స్యాయనుని

# కామసూత్రములు

రచయిత:

శ్రీ వడ్డాది వీర్రాజగారు



For Private Circulation only



వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్
26, రామానుజ అయ్యర్ వీధి, మద్రాసు - 600 021.
వారిచే ప్రకటితము

 [Rs. 40-00

Scholar's Edition

శ్రీరస్తు

# వాత్స్యాయనుని

# కామసూత్రములు

రచయిత:

శ్రీ వడ్డాది వీర్రాజుగారు



For Private Circulation only

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

# విషయసూచిక

# తొలి పలుకు

వాత్స్యాయనుని కామసూత్రములు లోకప్రసిద్ధము లైనవి. ఈగ్రంథము లోకప్రసిద్ధ మగుటయేగాక, నిరుపమానమై విరాజిల్లుచున్నది. ఈ కామశాస్త్రగ్రంథమునకు నిట్టి లోకోత్తరఖ్యాతి లభించుటకు గల కారణము, ఈగ్రంథమును ఒకసారి ఆమూలాగ్రముగ చదివినంతనే బోధపడగలదు.

తినబోవుచు రూరుచి యడుగ నెందుకన్నట్లు, గ్రంథవిషయములగురించి యిక్కడ అధికముగ వివరింప దలచుకొనలేదు.

సర్వాంగ సుశోభితం బగు సుందరి లభించినప్పుడు ఏమి చేయవలయునో, ఏరీతిగ సంచరింపవలయునో—ఆ లతాంగిని బట్టి ఆనందమయడోలికల నాలించి, యూగించి, ఆనందపూరితం బగు ఆకాశంబున తేలించి, ఉబ్బించి, కామోద్రేకమును రేకెత్తింప జేసి, తాను ఆ ఆనందరసమునుగ్రోలు విధానములను తెలుపునదే "కామశాస్త్రము."

స్త్రీపురుష సంబంధములనుగూర్చి "శాస్త్రము"ను ఏర్పరచుటలో వాత్స్యాయనుడే మొదటివాడు. ఈ కామశాస్త్రగ్రంథమును వాత్స్యాయనుడు సంస్కృతభాషలో 'సూత్రముల' రూపమున వ్రాసియుండుటవలన, ఈగ్రంథమునకు 'వాత్స్యాయనుని' కామసూత్రము లని పేరువచ్చినది.

ఈ గ్రంథవిశేషములనుబట్టి ప్రపంచమున సమస్త దేశములవారును, "వాత్స్యాయనుని కామసూత్రములను"

తమతమ భాషలలోనికి మార్చుకొని యున్నారు. ఆ రీతిగ ఈ గ్రంథము హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, జర్మనీ మొదలగు అనేక భాషలలోనికి పరివర్తింపబడి, లోకవ్యాప్తంబై అత్యంత యుక్తమై విరాజిల్లుచున్నది.

భారతీయుడు దాంపత్యజీవితములో నేరీతిగ సంచరింపవలయునో యీ గ్రంథమున విపులముగ వివరింపబడి యున్నది. ఈగ్రంథములో కామసూత్రములు పదునేడువందలకుపైగా నున్నవి. సూత్రరూపములో శాస్త్రపద్ధతిగ రచియింపబడుటచే ఈగ్రంథము సూత్రవాఙ్మయమునకు చెందియున్నది.

తెలుగువారికి తేటతెల్లముగ దెలియవలయు నన్న అభిలాషతో సంగ్రహరీతిని తెలుగున వచనరూపములో వ్రాసి యుంటిని. మూలమునలేని విశేషము లేవియు నీగ్రంథమున ప్రస్తాపించియుండలేదు. మహర్షి సూత్రించిన భావములందలి విశేషములను ముఖ్యమగు నంతవరకు తెలుగున వ్రాసియుంటిని. గ్రంథ విస్తరభీతిచే మహర్షిచే వ్రాయబడిన సూత్రములను మాత్రమువదలి, వాటి తాత్పర్యములను మాత్రము ఇందు విశదీకరించి యున్నాడను.

మనపూర్వులచే వ్రాయబడిన కామశాస్త్రగ్రంథములు ఆఱువందలకుపైగా కల వనియు, అవి అన్నియు పాశ్చాత్య దేశము (జర్మనీ)న సురక్షితములై యున్నవనియు మన ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి వచనము. మన కామ శాస్త్ర గ్రంథములను మనము చదువ నోచుకొనలేదా!

కొందరు ఈశాస్త్రమునెడల ఏహ్యభావమును కనబరచుచుండుట చూచుచున్నాము. అట్టిభావము సరియైనది

కానేర దని గ్రహించవలసియున్నది. ఈ శాస్త్రరచనలో ఆ కాలముననే వాత్స్యాయనునకు అనేక ఆటంకములు సంభవించెను. కాని అట్టి ఆటంకములను సరకుచేయక, ఈ శాస్త్ర రచనకు వాత్స్యాయనుడు వెనుకంజవేయక విజయమును సాధింపగలిగెను.

ఈశాస్త్రము కామోద్రేకమును రేకెత్తించి, ధర్మార్థమోక్ష సాధనకు అంతరాయమును కలిగించునేమో యను భావముతో దీనిని చాలగోప్యముగ నుంచసాగిరి. అట్టిభావము కేవలము పొరపాటు. కలుషితమైన కామమును శోధించి కలుషితరహితం బుగ యొనర్చుటే యీ శాస్త్రకారకుడైన ముఖ్యాభిప్రాయము. అంతియేగాని కామమును రేకెత్తించి, జీవితమును కలుష దాయకముగ నొనరించు నుద్దేశ్యముతో నీగ్రంథము వ్రాయ బడియుండలేదని మనము గ్రహించవలసియున్నది. అట్టి సదభి ప్రాయముతో తిలకించినచో యీ కామశాస్త్రము ఆరోగ్య శాస్త్రముగ నిర్ణయింపబడిన దని తోచుచున్నది.

ఈ శాస్త్రవిషయములను పాశ్చాత్యులు బాగుగ పరి శోధించి, ఎన్నియో గ్రంథములను రచియించి యితోధికముగ అభివృద్ధిపరచియున్నారు. కాని మనదేశీయు లింకను ఈగ్రంథ మును ఏహ్యభావముతో చూచుచుండుట విచారించవలసిన విషయము. ఈశాస్త్రము మానవశరీరములోని అనేక సూక్ష్మాంశ ముల విషయములను వెల్లడిచేయుచున్నది. అందుచే నీ గ్రంథము మానవజీవితమునకు అత్యంతోపయుక్తమైనదని చెప్పుట కెట్టిసందేహమును లేదు. అందువలన కామజీవితమునకు

కావలసిన విజ్ఞానమును బడయుటకు ప్రతిభారతీయుడును ఈ గ్రంథమును ముఖ్యముగ చదువవలసి యున్నది.

సంతానములేనివారికి గతిలేదు. స్వర్గసౌఖ్యమును లేదు. "అపుత్రస్య గతిర్నాస్తి, స్వర్గో నైవచ నైవచ" యను విషయమును ఆలోచింపవలసియున్నది.

పైవాక్యమునను సరించి సంతానముపడయుట ముఖ్యమని తోచుచున్నది. లౌకికముగ నాలోచించినను వార్ధకమున జీవితయాత్రను సౌఖ్యముగ గడపుటకు సంతానము ముఖ్యావసరముగ గన్పట్టుచున్నయది. అట్టిసంతానము సత్సంతానముగ నుండవలయునుగదా. అట్టి ఉద్దేశ్యముతోనే మనమహర్షులు కామజీవితమున అనేక కట్టుదిట్టములు గావించియున్నారు. ఆచారవ్యవహారములను నిరూపించియున్నారు. వివాహము, దాంపత్యజీవితము వీనినిగురించి విపులముగ బోధించియున్నారు. శ్రుతి, స్మృతిపురాణములను జూచినను, ధర్మశాస్త్రముల పరికించినను మానవజీవితమునకు ఒకవిధమైనకట్టుబాటు ముఖ్యావసరమైనట్లు తోచుచున్నది. ఇట్టికట్టుబాటు శరీరక్షేమమునకే యని గుర్తించవలసినది. కామజీవితమున మానవు డవలంబింపవలసిన కట్టుబాటులను నిరూపించునదే "కామశాస్త్రము" అంతియేగాని వేరుగాదు. ఇతరశాస్త్రములవలననే యీ శాస్త్రముకూడ మానవులకు అత్యంతోపయుక్తమైనది. కామకళాజీవితమున విజ్ఞానాభివృద్ధిని గలిగించి, యిహలోకభోగములను సక్రమముగ పొందింపజేయుటయే యీ శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము.

సంభోగాదులయందు నేవిధముగ నుండుట ఆరోగ్యదాయకమో తెలుపునదే కామశాస్త్రము.

నేడు మన భారతదేశమున శిశుమరణసంఖ్య దినదినాభి వృద్ధిని పొందుచున్నది. అందులకు కారణము సంభోగమున సక్రమమార్గములు అనుసరింపకుండుటయే నని యెఱుంగ వలయును. అట్టి సక్రమమార్గములను బోధించు గ్రంథములు కూడ తెలుఁగుభాషలో చాల తక్కువగ నున్నవి.

మైథునవిషయములో జాగ్రత్తగ నుండవలయును. మైథునము అతిగ సలుపుటవలన అనేకవిధములగు రోగములు సంభవించును.

విచిత్రవీర్యు డనువాడు అతిమైథునమువలన క్షయ రోగమును పొందె నని పురాణములలో చెప్పబడియుండెను. అగ్నివర్ణుడు అతిమైథునమువలననే క్షయరోగమునకు గురి యయ్యెను. సాధారణముగ క్షయరోగము అతిసంభోగము వలననే కలుగుచున్నది.

కామశాస్త్రనియమములను పాటింపక స్త్రీలతో తరచుగ మైథునక్రియ సలుపువారు శుక్లనష్టమునకు గురియై, చివరకు మరణించుచున్నారు. ఒకవేళ జీవించినను నిర్వీర్యులుగ నున్నారు. రతిసౌఖ్యమును గోరి అతిగ మైథునము సలిపి వీర్యమును నష్ట పరచినచో తప్పక అనారోగ్యము సంభవించును.

క్రమము తప్పి సంభోగము చేసినచో కలుగు శిశువు బాల్యమునందే మరణించును. ఒకవేళ జీవించినను, జీవితకాల మంతయు దౌర్బల్యముగనే యుండును. దానంజేసి దేశసౌష్ఠ వము నిర్మూలంబగు. సకలవిషయములకు అనర్థము వాటిల్లి అధోగతికి దారితీయును.

అట్టి "ఉచితకాలములను" నియమములను, క్రమవిధానములను నెరుంగుటకు "కామశాస్త్రము"లు ముఖ్యముగ చదువవలసియున్నది.

కామమనునది ఒక అద్భుతకళ. కామమునందు విశేషమైన చైతన్యశక్తి కలదు. క్రీగంటిచూపులతో, మిరుమిట్లు గొలుపు చేష్టలతో, కామోద్రేకమును కలిగించుమాటలలో కామినీ కాముకులు ఒకరియందొకరు అనురాగమును కలిగించు విధానముల సూచించునదే కామశాస్త్రము.

స్త్రీకి కామోద్రేకమును కలిగించుటలో పురుషుడే అధికముగ నేర్పరితనమును చూపవలయునని కామకళాశాస్త్రకారులు బోధించుచున్నారు.

వాత్స్యాయనుని కామసూత్రములు సంస్కృతభాషలో నుండుటవలన జనసామాన్యమునకు అందలివిశేషములు గ్రహింపవలనుపడకపోవుటవలననే నీగ్రంథమును తెలుగుభాషలో తెలుగువారలెల్లరకు సులభముగ తెలియునట్లు వ్రాసియుంటిని.

ఈగ్రంథమునందు అసాధ్యపుస్త్రీలను వశీకరణ చేసుకొను విధానములు—స్త్రీలకు కామోద్రేకము కలిగించురీతులు — సంభోగమునకు ముందు చేయవలసిన కృత్యములు—రతివిధానములు — సంపర్కరీతులు — వివిధరకముల బంధనములు — సంభోగ సమయమున స్త్రీల మెప్పించి ఆనందపరవశములుగ చేయుమార్గములు—ఆలింగన — చుంబన—నఖక్షత — దంతక్షతముల చేయువిధానములు — చిత్రరతులు — పురుషాయితములు—ఉపరతివిధానములు—ఔపరిష్టకవిధానములు — రతి

అనంతరము అవలంబింపవలసిన విషయములు—వశ్యౌషధ ములు—గర్భనిరోధవిధానములు మొదలగు పెక్కువిషయ ములు ఇందు వివరింపబడియుండెను.

దాంపత్యజీవితమునకు కావలసిన కామశాస్త్రగ్రంథరచ నకు పూనుకొనినవారిలో వాత్స్యాయనుడే మొదటివాడని తెలుచున్నది. ఇట్టి కామశాస్త్రరచనలకు ఆకాలములో గూడ వాత్స్యాయనుని యంతటివానికే పెక్కు ఆటంకములు సంభ వించెను. కాని ఆయన వాటినన్నిటిని లెక్కచేయక తనసంకల్పము నెరవేర్చుకొనెను.

ఆంధ్రకవులలో పెక్కుమంది కామకళాశాస్త్రమును గూర్చి పెక్కుగ్రంథములు పద్యరూపమునను, గద్యరూపము నను వ్రాసిరి. అట్టిగ్రంథములకన్నిటికిని వాత్స్యాయనుని కామ సూత్రములే మూలాధారము లని తెలియుచున్నది. దానంజేసి కామశాస్త్రగ్రంథములకు వాత్స్యాయనుడే ప్రథముడని చెప్పు టకు ఎట్టిసందేహమును లేదు. మొత్తముమీద ఈగ్రంథరచనకు వాత్స్యాయనుడు విశేషపరిశ్రమ చేసినటుల గ్రంథవిషయము లనుబట్టి బోధపడుచున్నది.

నూతనదంపతులు ఈగ్రంథమును చదువుటవలన కామ కళారంగమున నేవిధముగ నటించవలయునో తెలుసుకొని సౌఖ్యమును, ఆరోగ్యమును పొందగలరు.

మద్రాసు
12-12-56

ఇట్లు, బుధజనవిధేయుడు,
వడ్డాది వీర్రాజు.

# వాత్స్యాయనుని జీవితచరిత్ర

వాత్స్యాయనుని నిజనామము 'మల్లినాగుడు'. 'వాత్స్యాయన' మనునది వారి కుటుంబనామము. వాత్స్యాయనుడు ఒక మహర్షి. బ్రహ్మచర్యము నవలంబించినసన్యాసి యిట్టికామశాస్త్ర గ్రంథము ఏల వ్రాయవలసివచ్చినదని ప్రతివారికిని ఆశ్చర్యము కలుగకమానదు. ప్రపంచమునందలి మానవకోటియొక్క క్షేమ మును కాంక్షించి వేదములలో తెలుపబడినవిషయములనే బ్రహ్మ చర్యవ్రతావలంబి యగు వాత్స్యాయనుడు రచించెనేగాని వేరు కాదు.

కామమువలననే యీమానవకోటి సృష్టింపబడుచున్నది. అట్టి పవిత్రమైనకామము కలుషితమైనప్పుడు అరికట్టి, శోధించి, శుద్ధిచేయుటకును, పరిష్కరణముచేయుటకును, ప్రజలకు యుక్త మార్గములను తెలుపుటకును కామశాస్త్రగ్రంథములు బయలు దేరినవి.

వాత్స్యాయనుడు జీవించియుండినకాలము ఏదియో నిర్ధారణగ చెప్పుటకు వీలులేకపోవుచున్నది. పెక్కురు పెక్కు విధములుగ వ్రాయుచున్నారు.

మహాకవి యగు కాళిదాసుడు వాత్స్యాయనుని కామ సూత్రములనుగురించి యొకచో ప్రస్తావించియుండెను. ఆయన మహామేధావంతు డనియు, గోప్యశాస్త్రవేత్త అనియు తెలిపెను. అనేక జ్యోతిషశాస్త్రగ్రంథములు రచించిన వరాహమిహిరా

చార్యుడు వాత్స్యాయనునిచే వ్రాయబడిన కామసూత్రముల నుండి అనేకవిషయములను గ్రహించి తనగ్రంథములలో వ్రాసి యుండెను. కాళిదాసుడును, వరహామిహిరాచార్యుడును, విక్రమార్కుడనుబిరుదు వహించిన చంద్రగుప్తుని ఆస్థానములోని విద్వాంసులు. చంద్రగుప్తుడు క్రీస్తునకు పూర్వము మొదటి శతాబ్దములోనివా డని చరిత్రకారులు నిర్ణయించిరి. అందువలన వాత్స్యాయనుడు అంతకుపూర్వమువా డనియే బోధపడు చున్నది. క్రీస్తుకు పూర్వము మూడుశతాబ్దములకు పూర్వము వాడని కొందరును, నాలుగుశతాబ్దములకు పూర్వమువా డని కొందరును ఎవరికితోచినట్లు వారు వ్రాయుచున్నారు. మొత్తము మీాద నీవిషయముల నన్నిటిని సమన్వయించి చూడగా వాత్స్యాయనుడు క్రీ. పూ. మొదటిశతాబ్దమునకు రెండు మూడుశతాబ్దములపూర్వమువా డని చెప్పవచ్చును. వాత్స్యాయనుని జీవితచరిత్రనుగురించి మన కెట్టివిషయములును తెలియు చుండుటలేదు.

కామశబ్దమును విన్నంతమాత్రముననే చిత్తమును అన్యథా చెలరేగనీయక శాంతముగ చదివి సారమును గ్రహించ వలయును. అటనట చదువుటకంటె పీఠికలగాయితు చివరవరకు చదివి నిగ్గుతేల్చుట మంచిది.

## కామము అనగా నేమి?

కామసూత్రములను, రాజశేఖర కావ్యమీామాంసనుచవి వినచో కామశాస్త్రగ్రంథములను వ్రాసినవారు అనేకులు గల రనియు, వారిలో చాలమంది ఋషులే యనియు, పూజనీయు లనియు తెలుచున్నది. అందువలన కామమును ధర్మానుబంధిగా

చేయదలచినమహర్షులు కామశాస్త్రగ్రంథముల నేర్పఱచినట్లు తోఁచుచున్నది. కామసేవనములో పవిత్రమైన సంసారసుఖజీవనము కలదని వారి అభిప్రాయము. పవిత్ర కామసేవనముచే సత్సంతానమును బడయవచ్చును. సౌఖ్యజీవితము లభించును. "అపుత్రస్య గతి ర్నాస్తి, స్వర్గో నైవ చ నైవ చ" అని చెప్పఁబడి యున్నది. అనగా సంతానము లేనివారికి గతి లేదు. స్వర్గ సౌఖ్యముకూడ లేదు. అందుచే కామము పురుషార్థమే యగుచున్నది. అందువలన సంతానము పడయుటవలన మానవజన్మ సార్థక మగును. ఈశ్వరసంకల్పము నెఱవేరును.

యువతి యువకునితో కలసి సౌఖ్యమును పొందగోరుట, యువకుడు యువతితో కలసి సౌఖ్యమును పొందగోరుట అను రెండుకోరికలు కలసి, ఏకమై అఖండసౌఖ్యమును కలుగజేయుచున్నవి. అట్టి చిదానందమె కామము. అదియె పురుషార్థము. ప్రపంచసృష్టికి ఈకామమే ప్రధానముగదా! కనుక కామము పవిత్రమైన దనియే చెప్పఁదలసియున్నది.

ఆయాయింద్రియములతో ఆయావిషయములను అనుభవించునప్పుడు ఒక అపూర్వ మగుసౌఖ్యము ఉదయించును. దానివలన మనస్సునందు ఒకవిధమైన ఆనందము కలుగును. అట్టి ఆనందము అనుభవమువలన తెలుసుకొనవలసినదే కాని చెప్పుటకు వీలులేనిది. పురుషుడు స్త్రీ అంగముల ఆనందమును అనుభవించునప్పుడు పొందు ఆనందము మనస్సునకును, శరీరమునకును కూడ సంబంధించినదిగ యుండును.

కామ మన్న సుఖము. సంభోగాభిలాషయే కామము. ఇది కలుగుటకు బహిర్హేతువు లేదు. ఏదో ఒక అంతర్హేతువు

దానిని కలుగజేయుచున్న దని గ్రహించవలసియున్నది. కోరిక, రతి-యివి కామమునకు చెందినవే. కామము ఒకమహాసంకల్పము. సర్వప్రాణులకును రతితో హృదయానందము కలుగుచుండును. తుదకు యతికిని రతిచమత్కారము కల దనిన సత్యదూరము కానేరదు. మానసవిజ్ఞానము ననుసరించి స్వభావాన్వేషణము చేసినచో మనోవృత్తులు నిష్కల్మషమైనకామమునందే విశ్రాంతము లగుచుండుట మనము అనుభవమువలన గ్రహించవచ్చును. కామము సర్వభావములకు మూలము.

## మానవశరీరములు అసంపూర్ణము లైనవి

స్త్రీపురుషులు విసర్గల (ః) వంటివారు. అనగా పూర్ణబిందువునందు అర్ధభాగములవంటివారు. అరసున్నలు రెండును కలసినప్పుడుగదా పూర్ణత ఏర్పడుచున్నది. ఆవిధముగనే స్త్రీ, పురుషు లిరువురును కలసినప్పుడే పూర్ణత కలుగుచున్నది. అందువలననే భార్య భర్తకు అర్ధాంగి యగుచున్నది.

శివశక్తుల సముల్లాసమే మహాకామసంవిధానము. అట్టి సముల్లాసము ప్రపంచవస్తువులయం దన్నిటను వ్యాపించి యున్నది. కావుననే ప్రపంచవిలాసమంతయు కామానందభరితమై యున్నది.

పురుషవిభుడైన ఆనందమయాత్మ ఒంటరిపాటు సహించలేక స్త్రీవ్యక్తి నభిలషించెనట. అతని మధురసంకల్పము సగము పురుషుడు, సగము స్త్రీ గలశరీరము ఉద్భవించినది. దానివలన స్త్రీపురుషులు పతిపత్నిభావమున అభివ్యక్తమగుట శ్రుతిసమ్మతమైన అర్థము.

### ధర్మార్థకామమోక్షములు

ధర్మము, అర్థము, కామము, మోక్షము అని పురుషార్థములు నాలుగు. పురుషుడు ఈనాలుగింటిని సాధింపవలయు నని వేదములలో చెప్పబడియున్నది. కాని కామమును సాధించుటలో ధర్మమార్గమును వీడరాదు. ధర్మమార్గమును వీడినప్పుడే కామము కలుషితమగుచున్నది. అట్టి కలుషితమైనకామమును శోధించుటకే కామశాస్త్రములు ముఖ్య అవసరములు.

### కామి గాని మోక్షకామి కాదు

'కామిగాని మోక్షకామి కాదు'అను మధురమైన తెలుగు వచనము కలదు. ఈమాటను అనేకులు అనేక అర్థములను కల్పించుచున్నారు. 'కామిత మున్నప్పుడే మోక్షము కలుగు'నని ఆవచనమునకు అర్థము. కామములో మోక్ష మున్నదా యను సంశితి కలుగవచ్చును. కామము ధర్మయుక్తముగా నున్నప్పుడు మోక్షానుకూలత ఏల యుండదు! కామము ధర్మానుబంధముగ నున్నప్పుడు మోక్షదాయక మగుట వింతకాదు. అట్లు కాక పోవుటయే వింత యగును. ధర్మయుక్తమైన కామసేవనము మోక్షదాయకమే యగును. అప్పుడే కామము కామ మగును. ఆవిధముగ ధర్మము, అర్థము, కామము, మోక్షము అని చెప్పబడుపురుషార్థములలో కామమును మానవుడు సాధించవలయు ననియే శాస్త్రములు తెలుపుచున్నవి.

వాత్స్యాయనునికి పూర్వము దత్తక, చారాయణ, సువర్ణనాభ, ఘోటకముఖ, గోనర్దీయ, గొణికాపుత్ర, కుచుమారులనువా రనేకులు కామశాస్త్రగ్రంథములను వ్రాసిరి. కాని వారు ఒక్కొక్కరు ఒక్కొక్కభాగమునుమాత్రమే వ్రాసిరి.

అనగా సువర్ణనాభుడు సాంప్రయోగాధికరణమును, ఘోటక ముఖుడు కన్యాసంప్రయుక్తకాధికరణమును, గోనర్దనీయుడు భార్యాధికారికాధికరణమును, గొణికాపుత్రుడు పారదారికాధి కరణమును, కుచుమారుడు ఔపనిషధికాధికరణమును విభ జించి యీవిధముగ ఒక్కొక్కరు ఒక్కొక్కవిషయమును గురించిమాత్రమే వ్రాసిరి. వాత్స్యాయనుడు అట్టిలోపమును దీర్చుటకు సమస్తవిషయములను జతపఱచి యీశాస్త్ర మును లోకోపకారబుద్ధితో వ్రాసి లోకోత్తరకీర్తిని పొందెను.

కామతత్వమును ఇంత విపులముచేసి వ్రాసినవాత్స్యా యనుడు ధర్మానుసరణమును, వర్ణాశ్రమవివక్షతను విడనాడక కామమును సాధించవలయు నను విషయమును బోధించుటకే యీగ్రంథమును వ్రాసినట్లు తోచుచున్నది.

## ఈగ్రంథమును చదువతగినవారు

ఈగ్రంథమును చదువుటకును ఇందు చెప్పఁబడినవిషయ ములు ఆచరణలో పెట్టుటకును అందరును అర్హులు కారు. కొందఱుమాత్రమే అర్హులు. అభిలాషగలవారందరును అధి కారుల మనుకొనుట అపచారము. కలహము లేనివారును, అధర్మరీతి లేనివారును, మంచి ఆరోగ్యముకలవారును అర్హులు. ఈవిషయమును వాత్స్యాయనుడు అచ్చటచ్చట సూచించెను. సకలైశ్వర్యములు కలవారును, అన్యాయప్రవర్తన లేనివారును, ధర్మమార్గములో కామమును సాధింపదలచినవారందరును దీనిని చదువవచ్చును. కామమును పురుషార్థముగ చూడదలంపు గలవారుకూడ దీనిని చదువవచ్చును.

వివాహము, దాంపత్యసౌఖ్యమును బోధించుటలో వాత్స్యాయనుని కామసూత్రములే మనకు ఆధారములు. ఇంతకు మించిన విశేషవిషయములు గలగ్రంథము వేరొకటిలేదు. వాత్స్యాయనునితరువాత ఏ ఒకరిద్దరో తప్ప కామశాస్త్రగ్రంథములు రచించినట్లు కనబడదు. తరువాత ప్రజలలో నీశాస్త్రమునందు ఒకవిధమైన నీచాభిప్రాయము కలుగుచువచ్చినది. అందువలన నీశాస్త్రమును చాల గోప్యముగ నుంచుచు వచ్చిరి.

మొత్తముమీద వాత్స్యాయనుడు మనకు ప్రసాదించిన కామశాస్త్రనిధిని మనము నేటికిని అనుభవించి సంతోషమును, సౌఖ్యమును పొందుచున్నాము.

సకలజనులకును అత్యంతోపయుక్తమగు ఈ "వాత్స్యాయనుని కామసూత్రము" లను చదివి ఆంధ్రులెల్లరును 'దాంపత్యజీవితము' నందు తమవిజ్ఞానమును అభివృద్ధిచేసుకొందు రని ఆశించుచున్నాను.



శ్రీ ర స్తు

# వాత్స్యాయన

# కామసూత్రములు

## శాస్త్రసంగ్రహము

ఆదిలో బ్రహ్మ మానవులను సృష్టించి, వారు సాధింప వలసిన ధర్మార్థకామములను పురుషార్థములకు సాధనభూత ముగానుండుటకుగాను, లక్ష అధ్యాయములతో 'స్థితినిబంధనం' అను శాస్త్రమును రచించెను.

ఆ 'స్థితినిబంధనం' అను గ్రంథమునుండి ధర్మమునకు సంబంధించినభాగమును మనువు గ్రహించి "ధర్మశాస్త్రము"ను వ్రాసెను. స్థితినిబంధనమునుండి అర్థమునకు సంబంధించిన భాగ మును విభజించి దేవగురువైన బృహస్పతి "అర్థశాస్త్రము"ను కల్పిం చెను. పరమశివుని అనుచరుడైన నందికేశ్వరుడు స్థితినిబంధనము నుండి విడదీసి పదివందల అధ్యాయములతో 'కామశాస్త్రము'ను వ్రాసెను.

నందికేశ్వరునిచే వ్రాయబడిన అట్టి 'కామశాస్త్ర' గ్రంథ మును ఆధారముగ తీసికొని ఉద్దాలకునిపుత్రుడైన శ్వేత కేతువు అయిదువందల అధ్యాయములతో ఒక కామశాస్త్ర

గ్రంథమును క్లుప్తముగ వ్రాసెను. శ్వేతకేతువు ఆకాలములో ఒక గొప్పసంస్కర్త. ఆయనకాలములో అతిథి వచ్చినప్పుడు ఆగృహాయజమాని తనస్త్రీలలో నొకస్త్రీని అతిథికి అప్పగించి తృప్తిపరచడము మొదలైనదురాచారము లుండెడివి. అట్టి దురాచారములను ప్రజలలో మాన్పించి, స్త్రీపురుషులు శీలవిషయములో ఏవిధముగ నుండవలయునో తెలుపుచు, మంచినియమములను ఏర్పఱచెను. శ్వేతకేతువు త్రేతాయుగములోనివాడగుటచే ఆయనచే వ్రాయబడిన 'కామశాస్త్రము' త్రేతాయుగములోని ప్రజలకొరకుమాత్రమే వ్రాయబడినదిగా నున్నది.

శ్వేతకేతువుచే వ్రాయబడిన 'కామశాస్త్రము'ను ఆధారముగతీసుకొని, అనవసరవిషయములు వీలైనంతవరకు తగ్గించి నూటయేబది అధ్యాయములతో బాభ్రవ్య డనే ఆయన ఒక కామశాస్త్రమును వ్రాసెను. బాభ్రవ్యుడు పాంచాలదేశీయుడు. ఈయన తనకామశాస్త్రములో సాధారణాధికరణం, సాంప్రయోగాధికరణం, కన్యాసంప్రయుక్తకాధికరణం, భార్యాధికారికాధికరణం, పారదారికాధికరణం, వైశికాధికరణం, ఔపనిషదికాధికరణం అనేపేర్లతో ఏడు అధికరణములను అనగా ఏడువిషయములను ఏడు అధ్యాయములలో వ్రాసెను. ఈ అధ్యాయములకు అధ్యాయములందలి విషయములనుబట్టియే పేర్లుపెట్టెను. ఈయన ద్వాపరయుగములోనివాడగుటచే ఈ కామశాస్త్రగ్రంథము ద్వాపరయుగమునందలి ప్రజలకొరకు వ్రాయబడిన దని తెలుసుకొనవలయును.

బాభ్రవ్యునిచే వ్రాయబడిన కామశాస్త్రగ్రంథములో 'వైశిక'మనే అధ్యాయములో చెప్పబడిన విషయములను

మాత్రమే సంగ్రహించి పాటలీపుత్రనివాసియైన దత్తకు డనే ఆయన వేశ్యలకోరికపై ఒకకామశాస్త్రగ్రంథమును వ్రాసెను.

ఈదత్తకునిగురించి కర్ణాకర్ణిగ వినబడుచున్న ఒకకథ కలదు. "పూర్వము పాటలీపుత్రములో ఒక విప్రుడు నివసించు చుండెడివాడు. ఆ బ్రాహ్మణునకు వృద్ధాప్యములో ఒకపుత్రుడు కలిగెను. శిశువు జన్మించినవెంటనే తల్లి మరణించెను. ఆవిప్రుడు బాలుని పెంచలేక ఒకస్త్రీకి పెంచుకొనుట కిచ్చి కొంతకాల మునకు పరలోకగతుడయ్యెను. ఆస్త్రీ దత్తత తీసుకొనుటచే ఆ పిల్లవానికి 'దత్తకు' డనుపేరుపెట్టెను. కాలచక్రమమున ఆదత్త కుడు పెరిగి పెద్దవాడై సకలశాస్త్రములను బాగుగ అభ్యసించిన వాడయ్యెను. సకలవిద్యాపారంగతుడగుటచే ప్రజలు ఆయనను దత్తకాచార్యు డని పిలిచెడివారు. కొంతకాలమునకు దత్తకు నకు 'లోకయాత్ర'నుగురించి తెలుసుకొనవలయు నని అభిలాష కలిగినది. ఆకాలములో 'లోకయాత్ర' అను విద్య వేశ్యలకు మాత్రమే తెలిసియుండెడిది. ఏదోవిధముగ వేశ్యల పరిచయ మును సంపాదించి దత్తకుడు ఆవిద్యను తెలుసుకొనెను. ఆ విద్యను నేర్చుకొని వేశ్యలకంటె ఆవిద్యలో అధికుడయ్యెను. చివరకు తిరిగి వేశ్యలే ఆవిద్యలో నున్నరహస్యములను తెలుప వలసినదని ఆయనను కోరుచుండెడివారు. ఆకాలములో వీరసేన యనుపేరుగలవేశ్య ఆయనదగ్గరకు వచ్చి పురుషులను రతిలో రంజింపచేయు విధానములను తెలుపవలసినదిగ ప్రార్థించెను. ఆమెకోరికమీద బాభ్రవ్యునిచే వ్రాయబడిన కామశాస్త్రములో నుంచి 'వైశిక' మనే భాగమును విడదీసి దత్తకుడు ఒక కామ శాస్త్రగ్రంథమును వ్రాసెను." 'వైశిక' మనేభాగములో బాభ్ర

వృద్ధుడు వేశ్యలు పురుషులతో ఏవిధముగ రతిసలుపవలయునో వివరముగ వ్రాసియుండెను. అట్టి 'వైశిక'మనేభాగమును దత్తకుడు ఇంకను విశేషాంశములతో విపులముగ వ్రాసెను. ఈవిధముగ కొందరు చెప్పుచుండిరి.

మరికొందరు వేశ్యాలోలుడనీ, వ్యభిచారముగ తిరుగుటలో ఒకమహానుభావుడు శాపం ఇవ్వడమువలన స్త్రీరూపము పొందెననీ, మరల ఆశాపం ఇచ్చిన మహానుభావుని వలననే తిరిగి పురుషరూపమును పొందగలిగాడనీ—అందువలన స్త్రీపురుష రతిసౌఖ్యములు రెండును పొందియుండుటవలన స్త్రీ రతికాలములో పురుషుని ఏవిధముగ రంజింపజేయవలయునో వ్రాయగలిగె ననియు ప్రతీతి గలదు. ఈ రెండవగాథ అంత నమ్మదగినదిగాలేదు. అందువలన వేశ్యలకోరికమీదనే 'వైశిక' మనే కామశాస్త్రగ్రంథమును రచించె నను విషయము సమంజసమైనదిగా కన్పట్టుచున్నది.

బాభ్రవ్యునిచే వ్రాయబడిన కామశాస్త్రగ్రంథములో నుండి 'వైశిక' మనే అధికరణభాగమును దత్తకుడు విపులముచేసి వ్రాసినట్లు, చారాయణుడు అను ఒకవిప్రుడు సాధారణాధికరణమును విపులీకరించి ఒక కామశాస్త్రగ్రంథమును వ్రాసెను. ఆవిధముగనే సువర్ణనాభుడు సాంప్రయోగికాధికరణమును, గోనర్దీయుడు భార్యాధికారికాధికరణమును, గోణికాపుత్రుడు పారదారికాధికరణమును, కుచుమారుడు ఔపనిషదికాధికరణమును విభజించి వ్రాసిరి.

బాభ్రవ్యునిచే వ్రాయబడిన కామశాస్త్రగ్రంథము ఈ

విధముగ ముక్కలుముక్కలుగ అనేకమందిచే విభజింపబడుటచే సారములేనిదిగ తయారైనది.

మనవాత్స్యాయనునికన్న పూర్వులైన దత్తక, చారాయణ, సువర్ణనాభ, ఘోటకముఖ, గోనర్దీయ, గోణికాపుత్ర కుచుమారులచే వ్రాయబడినగ్రంథములు కామశాస్త్రములో ఒక్కొక్కభాగముమాత్రమే కలిగియుండుటచేతను, బాభ్రవ్యునిచే వ్రాయబడిన కామశాస్త్రము చాల పెద్దదిగా నుండి చదువుటకు చాల కష్టముగ నుండుటవలనను, కామశాస్త్రమునకు సంబంధించిన సమస్తవిషయములు క్లుప్తముగ వివరించుచు వాత్స్యాయను డీగ్రంథమును వ్రాసెను,

## ధర్మార్థకామములు

ధర్మము, అర్థము, కామము - ఇవి త్రివర్గలు అని పిలువబడుచుండును. మానవుడు ధర్మార్థకామములను సంపాదించుటకు ఎల్లప్పుడును కృషి సలుపుచుండవలయును. ఈ త్రివర్గలు సులభముగ లభించనప్పుడు ఉపాయములచే సాధించుటకు ప్రయత్నములు సలుపవలయును.

అట్టి ఉపాయములు 1. అనుష్ఠానము 2. అవబోధము, 3. సంప్రతిపత్తి అని మూడువిధములు. అనుష్ఠానము అనగా క్రియాపూర్వకముగ చేయుట, అవబోధము అనగా తెలుసుకొనుట, సంప్రతిపత్తి అనగా ఫలితమును అనుభవించుట అని అర్థము. ఈమూటియందును అనుష్ఠానము ముఖ్యమైనది గనుక అనుష్ఠానమునుగురించి తెలుపుచున్నాను.

"శాల్యే విద్యాగ్రహణా దీనర్థాన్"—అని వాత్స్యాయనునిసూత్రము. అనగా మనుష్యుని ఆయుర్దాయము నూరు సంవత్సరములు. ఈనూరుసంవత్సరముల కాలములోను మనుష్యుడు ధర్మార్థకామములను, మూడింటిని సంపాదించుటకు ప్రయత్నము సలుపవలయును. ఈమూడింటికి నూరుసంవత్సరములను ఒకదానితో నొకటి విరుద్ధముకాకుండ, సంబంధము కలిగి యుండువిధముగ విభజించవలయును. ఆవిధముగ నూరుసంవత్సరములను భాగములుగచేసి ధర్మార్థకామములను సంపాదించుటకు ఉపయోగించుకొనవలయును. బాల్యదశలో విద్యను సంపాదించవలయును. మనుష్యునకు పదునాఱవసంవత్సరమువరకు బాల్యము అనబడును. పదునేడులగాయితు డెబ్బదియవయేడువరకు మధ్యమము. ఆటుపిమ్మట వృద్ధాప్యము చెప్పినది ఎవడు గ్రహించగలుగునో, వినిన విషయమును ఎవడు జ్ఞాపకము ఉంచుకొ గలుగునో వాడు బాలు డనబడు నని గ్రంథాంతరములలో చెప్పబడియున్నది. విద్య అనగా జ్ఞానము లేక చదువు.

"కామం చ యౌవనే"—మనుష్యుడు యువకుడుగనుండు కాలములో విద్యను. కామమునుకూడ పొందుటకు ప్రయత్నము సలుపవలయును. కామసౌఖ్యములను పొందుటకు ధనము ముఖ్యావసరము. అందుచే యౌవనకాలములో ధనమును సంపాదించుటకుకూట ప్రయత్నించుచుండవలయును.

"స్థావిరే ధర్మం మోక్షం చ"—వృద్ధాప్యములో ధర్మమును, మోక్షమును సంపాదించుటకు ప్రయత్నించవలయును.

ఏయే వయస్సులలో నేయేవిషయములను సాధించవలయునో చెప్పబడినదికాని మనుష్యుడు నూరుసంవత్సరములు

జీవించు ననునమ్మక మేది ? అందుచే బాల్యమునుండియు ధర్మా ర్థములను సంపాదించుటకు యత్నము సలుపవలయును. వృద్ధాప్యములో ధర్మమును, శక్తియున్నచో అర్థకామములనుకూడా సాధింపవలయును.

"బ్రహ్మచర్యమేవత్వా విద్యాగ్రహణాత్":— విద్య పూర్తియగువరకు బ్రహ్మచర్యమును పాటించవలయును. కామమును సాధించరాదు. కామమును సాధించుటకు ప్రయత్నము చేసినచో అధర్మప్రవర్తనయగును. విద్య నశించును. దానివలన ధర్మార్థములకు ముప్పు కలుగును. విద్యాభ్యాససమయములో భూమి మొదలైనవి సంపాదించుకొనుట ధర్మముకాదు. కొందరు నూరుసంవత్సరములను ధర్మార్థకామములు మూడింటికి మూడు సమభాగములుగ చేసి; మొదటి ముప్పదిమూడుసంవత్సరములను బాల్యముగ చెప్పి, పదునాఱవసంవత్సరము లగాయితు కామము ప్రారంభమగును గనుక బాల్యములోకూడ ధర్మార్థకామములను మూడింటిని సంపాదించవలయునని చెప్పుచున్నారు.

విద్య అనగా అరువదినాలుగువిద్యలు, అన్వీక్షికి మొదలైనవి అని భావము. అర్థము అనగా భూమి, పశువులు, బంగారము, వెండి, కంచు, గుఱ్ఱములు; ఏనుగులు, గోవులు, ధాన్యములు, కొయ్యతోను, మట్టితోను, చర్మముతోను, లోహములతోను తయారైనవస్తువులు. ఇటువంటి గృహోపకరణములను సంపాదించుకొని వృద్ధిపరచియుంచుకొనవలయును. మిత్రసంఘమునుకూడ వృద్ధిచేసుకొనవలయును. సంపాదించినధనమును వృద్ధిపరచుకునేవిధానములను 'అధ్యక్షప్రచారము' అను గ్రంథములో చెప్పబడినరీతిగను, వార్తాశాస్త్రము నెఱింగినవారివలనను,

వ్యాపారస్థులవలనను, వ్యవసాయదారులనుండియు, గోపాలకుల వల్లను తెలుసుకొనవలయును.

"కామము అనగా నేమి?":—జీవుడు అనగా ఆత్మ. అట్టి జీవునితోకూడికొనియున్న మనస్సుయొక్క ఆధీనములో యుండి చెవులు, నేత్రములు, నాలుక, నాసిక అను బుద్ధీంద్రియములు తమతమవిషయములను నెఱవేర్చుచుండుట కామ మన బడును. మనస్సు, చెవులు మొదలగునింద్రియములవలన విషయములను అనుభవించుచు పొందుసుఖము కామము అన బడును. ఇది సామాన్యకామము.

స్పర్శసుఖము అనగా సంభోగము. సంభోగసమయ ములో స్త్రీపురుషరూపముతో నున్నప్రాణులు చుంబనాదుల వలన కలుగు అభిమానపూర్వకమైన సౌఖ్యముతో కూడుకొని యుండు ఫలవంతమగు అర్థప్రతీతియే కామ మనబడును. ఇదియే నిజమైనకామము. ఏ ఇంద్రియస్థలనసమయములో సౌఖ్యమునకు కారణమైనకర్మను కలుగజేయునో ఆయింద్రియముయొక్క ఆంతరంగికస్పర్శవిశేషమును గూర్చినభావమే అర్థప్రతీతి యన బడును. 'పురుషునిచేత ఆలింగనము చేసుకొనబడుచుంటిని, చుంబనము చేసుకొనబడుచుంటిని' అని స్త్రీకిని; 'నేను ఆస్త్రీని ఆలింగనముచేసుకొనుచున్నాను, ముద్దుపెట్టుకొనుచున్నాను' అని పురుషునకును ఒకరిని ఒకరు ప్రేమించుకొనుచు పొందుసుఖము అభిమానసుఖ మనబడును.

పైనచెప్పబడిన సామాన్యకామమును, విశేషకామ మును యీకామసూత్రగ్రంథమువలనను, కామశాస్త్రముల నెఱింగిన ఆచార్యులవల్లను తెలుసుకొనవలయును.

ధర్మార్థకామములను సంపాదించుటకు అవలంబింపవలసిన రీతులు:—ధర్మార్థకామములను మూడింటిని ఒక్కపర్యాయము సాధించుట అసాధ్యము. అందువలన వానిని సాధించుటలో కష్టసుఖములను గుర్తించి మెలగుచుండవలయును. ధర్మార్థకామములు మూడును ఒకేసారి సమకూడినచో కామమును విడచి అర్థమును, అర్థమును విడచి ధర్మమును సాధించవలయును. అర్థము కామము ఒకేసారి సమకూడిన కామమును విడచి అర్థము కొరకే ప్రయత్నించవలయును. అనగా ధర్మమును, అర్థమును విడువకుండాలభించుసమయములయందే కామసౌఖ్యమును పొందుచుండవలయునని భావము. కనుక కామముకంటె అర్థమును, అర్థముకంటె ధర్మమును ముఖ్యములైనవని కామశాస్త్రవేత్తలు నిరూపించుచున్నారు.

కాని యీవిధానము అన్నివర్ణములవారును అవలంబింపవలసినదికాదు. 'అర్థశ్చ రాజ్ఞః' అని వాత్స్యాయనుడు చెప్పెను. అనగా క్షత్రియులు ధర్మార్థకామములు మూడును ఒకేపర్యాయము సమకూడి దేనినో ఒకదాని అవలంబింపవలసినప్పుడు ధర్మమును, కామమును వదలి అర్థమునకు మాత్రమే ప్రాముఖ్యత నీయవలయును.

లోకయాత్ర:—బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడువర్ణములును, మానవులు అవలంబింపవలసిన బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములును వీనికిసంబంధించిన విషయములును లోకయాత్ర యనబడును. అట్టి లోకయాత్ర సక్రమముగ జరుగుటకు రాజులు ప్రజలను సంరక్షించుచుండవలయును. అట్టి లోకయాత్ర ప్రజాపరిపాలకులమీద ఆధారపడి

యుండును. ప్రజాధిపులశక్తి అర్థబలసంపన్నతమీదను, దండబలముమీదను ఆధారపడియుండును. దండబలము అర్థబలము మీదనే ఆధారపడియుండును గనుక 'లోకయాత్రకు' అర్థబలమే మూలమని గ్రహించవలయును.

"వేశ్యాయాశ్చ":—అని వాత్స్యాయనుని సూత్రము. అనగా వేశ్యకు ధనము ముఖ్యము. కామోద్రేకముచే ఒక సుందరమైనపురుషుడును, ధనవంతుడైన కురూపియు వచ్చి నప్పుడు వేశ్య; ధర్మము, కామము వీటిని దూరముగ పెట్టి ధనము కొఱకు ధనవంతునికే ఒడంబడవలయును. ఈరీతిగ ధర్మార్థ కామములను వర్ణములనుబట్టి నిర్ణయించవలయు నని వాత్స్యాయనుని అభిప్రాయము.

"ఉపాయపూర్వకత్వాదర్థసిద్ధేః":—ధనమును సంపాదించుటకును, దానిని కాపాడుటకును విజ్ఞానము అవసరము. అందుచే అర్థశాస్త్రమును చదివి ఉపాయములను తెలుసుకొనవలయును.

"ఉపాయప్రతిపత్తిశ్శాస్త్రాత్":—ఉపాయము తెలియకుండా ప్రయత్నించేవానికి ధనలాభముకాని, వృద్ధిగాని కలుగదు. విశేషించి దరిద్రునకు బుద్ధిబలముకూడ యుండదు. బుద్ధిహీనుడు ప్రతివిషయమునందును సందేహమునే పొందుచుండును. కనుక శాస్త్రములను చదివి ముందు ఉపాయములను తెలుసుకొనవలయును.

కనుక ధర్మార్థములు సంపాదించుటకు శాస్త్రములు చదువుట ముఖ్యము. ఆవిధముగనే కామసౌఖ్యమును పొందుటకు 'కామశాస్త్రము'లు చదువుట అవసరమని తోచుచున్నది.

పశువులు, పక్షులు మొదలైనవి కామశాస్త్రజ్ఞానము లేక పోయినను కామసౌఖ్యమును పొందుచుండుటలేదా! మనుష్యుల కామస్వభావముకూడ అట్టిదేకదా. కామములో నీ ఈవిధముగ సంచరించవలయునని ఎవ్వరు ఉపదేశించగలరు! ఏశాస్త్రప్రకారము మృగములు, పక్షులు తమతమ స్త్రీజాతులను రమింపజేయుచుండెను?. ప్రతిప్రాణియందును కామము కలదు కదా! కామము ఎల్లప్పుడును శరీరముల నంటిపెట్టుకునే యుండునుగదా! అందువలన కామమునుగురించి శాస్త్రములు తయారుచేయుట అనవసరమే యగునా!

సామాన్యకామమైనను, విశేషకామమైనను స్త్రీపురుషుల సంయోగముమీద ఆధారపడియుండును. సంయోగము అంటే కలయిక అని అర్థము. అట్టి కలయిక ఉపాయములేకుండా కలుగదు గదా! అట్టి ఉపాయము కామశాస్త్రమువల్ల తెలుసుకొనవలయునని వాత్స్యాయనుని అభిప్రాయము.

మృగములు, పక్షులు మొదలైనవానివిషయములో ఉపాయములేకపోయినను, వాటివాటి ఋతుకాలములలో తృప్తిలభించువరకుమాత్రమే వాటికి సంభోగము జరుగుచున్నది. ఆఋతుకాలము దాటినచో మరల అవి సంభోగ సౌఖ్యమును కోరవు. కనుక వాటికి ఉపాయములేకపోయినను కామసౌఖ్యము లభించుచున్నది. కాని మనుష్యులు సంతానము కొఱకు ఋతుకాలములోను, స్త్రీలను రంజింపజేయుటకు యితర సమయములలోను కామకృత్యములు సలుపవలయును. మృగములు, పక్షులు మొదలైనవి ధర్మముకొరకుగాని, ధనము కొఱకుగాని, సంతానముకొఱకుగాని బుద్ధిపూర్వకముగ ప్రయ

త్నించుచుండుటలేదు. కనుక మానవులకు కామశాస్త్రము చాల ముఖ్యావసరము.

"నధర్మాంశ్చరేత్ ఏష్యత్ఫలత్వాత్":—అని వాత్స్యాయనుని వచనము. ధర్మార్థకామములు అవసరమా, అనవసరమా అను విషయమును తెలుసుకొనవలయును. యజ్ఞయాగాదిక్రతువులవలన కలుగుఫలితము యీజన్మలో లభింపదు. వాటిఫలితము తరువాత జన్మలో కనబడును. అందువలన అవి అలౌకికములగుచున్నవి. వ్యవసాయాదులవలె వెంటనే కాకుండా ఎన్నడో లభించుఫలితముకొఱకు ప్రయత్నించుట అనవసరము. అట్టి ధర్మమును అవలంబింప నవసరములేదు.

ముందు ఏమిజరుగునో ఎవ్వరు చెప్పగలరు. విశేషకష్టముతో బ్రహ్మచర్యమును అవలంబించి తపస్సుచేసినను అసలు ఫలిత మున్నదో లేదో ఎవరు నిర్ధారణగ చెప్పగలరు.

"సాంశయికత్వాశ్చ":—పరలోక మున్నదో లేదో ఎవ్వరును చూచి రాలేదుగదా. ఇట్టి సందేహముతో ధర్మమును పట్టుకుని వ్రేలాడుట అనవసరము.

తెలివిగలవాడు చేతికిచిక్కినపావురమును యితరులకు అప్పగించి చూచుచు ఊరకొనునా! ఆలీరుననే ఎన్నడో స్వర్గలోకములో సౌఖ్యములు లభించునని యీలోకములో సౌఖ్యములను బుద్ధిమంతులు విడిచిపెట్టుట కంగీకరింతురా!

"వరమద్యకపోతశ్శ్వోమయూరాత్":— రేపటిదినమున లభించునెమలికంటె యీదినమున లభించినపావురమే మంచిది కదా! పరలోకసౌఖ్యముకూడ అట్టిదేకదా!

ఇందుకు మీకు ఒక చిన్న ఉపమానమును చెప్పెదను. పూర్వము ఒక బ్రాహ్మణుడు ఒకధనవంతునిదగ్గఱకు యాచన కొఱకు వెళ్లెనట. 'ఈదినము నాదగ్గఱ ఒకకర్షాపణంమాత్రమే యున్నది, దీనిని తీసుకో, లేనిచో రేపు నాకు కొంతడబ్బు అందును, అందుచే నీవు రేపు వచ్చినచో ఒకనిష్కంబఱకు యివ్వగలను' అని చెప్పెను. అప్పుడు ఆ బ్రాహ్మణుడు బాగా ఆలోచనచేసి రేపు నిష్కంబవచ్చుట సందేహము, వెంటనే లభించుతృణమే మంచిదని మారుమాటచెప్పక ఆకర్షాపణమును చేతిలో వేయించుకొని వెడలిపోయెనట. కనుక యీవిషయము గూడ అట్టిదిగనే భావించవలయును.

చేతిలో యుండువిత్తనములను రాబోవుపంటకొఱకు వినియోగించుటలేదా? కనుక ముందుజన్మలో మంచియోగ మునుపొందుటకు యీజన్మలో కష్టపడుటే మంచిదని కొందఱు వాదనచేయుచుందురు.

పైన ధర్మాచరణ అవసరమని వాదించువారికి సమాధా నము చెప్పబడెను. ఇక అర్థశాస్త్రము అనవసరమని వాదించు వారికి సమాధానము చెప్పుచున్నాను.

ధనమును సంపాదించుటకు ప్రయత్నించుట అనవసర మని కొందఱి అభిప్రాయము. అందుచే ధనసంపాదనకు ఉపాయ ములను అన్వేషించుటకూడ అనవసరమనే వీరి అభిప్రాయము.

ఎంతప్రయత్నము సలిపినను ఒక్కొక్కప్పుడు చిల్లిగవ్వ అయినను లభించదు. ఒక్కొక్కప్పుడు ఏమీ ప్రయత్నము అవసరములేకుండగనే ధనము విశేషముగ లభ్యమగుచుండును. అనగా అర్థశాస్త్రములో చెప్పబడిన ఉపాయములనుబట్టి

ప్రయత్నించిన ఒక్కొక్కప్పుడు చిల్లిగవ్వ అయినా లభించదు గనుక యిక అర్థశాస్త్రము అనవసరమని కొందఱివాదము.

ధనము లభించడము అనేది లభించకపోవడ మనేది అదృష్టముమీదను కాలముమీదను ఆధారపడియుండునే కాని ప్రయత్నించుటవలన లభించుచుండుటలేదు గనుక మానవుడు కాలమునకును, అదృష్టమునకును లోబడవలసినవాడేకాని తన ప్రయత్నముమీద ఆధారపడుట ప్రయోజనములేదని కొందరి వాదము.

ఇదియే కాలవాద మనబడును. అనగా మానవుడు కాలముమీదను అదృష్టముమీదను ఆధారపడియుండవలసిన వాడేకాని, తన ప్రయత్నమువల్ల దేనిని సాధించలేడని చెప్పునది కాలవాదమనబడును. అనగా మానవుడు యోగములనుపొందినను, దరిద్రమును పొందినను అది అంతయు కాలముమీదనే ఆధారపడియుండునుగాని వేరొకటికాదని వీరివాదము.

కాలమే బలిని ఇంద్రుణ్ణి చేయగలిగినది. మరల ఆ కాలమే ఆయనను ఆపదవినుంచి తొలగించినది. కనుక యీ ప్రపంచమంతయు కాలమహిమయేకాని వేరుకాదు అని కాల వాదుల మతము.

ఈకాలవాదము ప్రకారము పురుష ప్రయత్నములు, ఉపాయములు అనవసరమని వారివాదముకదా! ఆవిధముగనే కామ శాస్త్రమునందు చెప్పబడిన ఉపాయములు, కామశాస్త్రము కూడా అనవసరమని వారి అభిప్రాయము. ఇట్టివాదము సరియైనది కాదని మనము గుర్తించవలయును. ప్రపంచములో జరుగుచున్న వ్యవహారకాండ అంతయు పురుషప్రయత్నములవల్లను

ఉపాయములవల్లను జరుగుచున్నది. అసగా సర్వకార్యములకు ఉపాయము ముఖ్యమైనది. ఉపాయముల నెఱుగనివాడు ధనమును సంపాదించగలుగునా? ఒకవేళ ఒకప్పుడు అప్రయత్న పూర్వకముగ ధనము లభించినను ఆలోచించకనే తాను జరిపిన ప్రయత్నమువలననే లభించినదని భావించవలయును. ఉపాయములు తెలియనిమానవునకు ధనము లభించదనియే వాత్స్యాయనులవారి అభిప్రాయము. దానివలన ధనసంపాదనకు ఉపాయము, కాలము రెండును ముఖ్యములే. అందువలన పురుష ప్రయత్నమునకు ఉపాయము అవసరము. అట్టి ఉపాయములను బోధించుటకే శాస్త్రములు ఏర్పరుపబడినవి.

ఆవిధముగనే కామమునుగుఱించి తెలుపబడిన కామశాస్త్రములు అవసరమా? అనవసరమా? అనువిషయమును మనము తెలుసుకొనవలయును. కామమును సాధించుటకు ఉపాయములను తెలుసుకొనుట మంచిదికాదని కొందఱివాదన. ఏలనన కామము ధర్మమార్గమునకును, యితరసత్కార్యములు చేయుటకును అడ్డుకలుగజేయును. కామోపాయములు కామోద్రేకమును రేకెత్తించునటుల నర్తకులు, గాయకులు మొదలగు వారితో పరిచయము కలుగజేయును. వేశ్యలకొరకు తాపత్రయము పడవలసినజీవితమును కలుగజేయును. ధర్మప్రవర్తననుంచి తప్పించును. కీర్తిని నశింపజేయును. మొత్తమువీాద ఒకదాని తరువాత ఒకటి ఆవేశించి చివరకు బ్రతుకునే తుడిచిపెట్టును. చివరకు యిట్టి కామోపాయములు మానవుని స్త్రీలోలునిగ తయారుచేయును. తరువాత శరీరారోగ్యమునే భస్మీపటలము గావించును. నలుగురిలో నగుబాటు కలుగు జీవితములోనికి

దింపును. గౌరవమనునది నాశనమగును. క్రమముగ సర్వకష్ట ములు చుట్టుకొనును. ఇందుకు మీకు ఒక చిన్న ఉపమాన మును చెప్పెదను.

పూర్వము భోజవంశములో దాండక్యుడను పేరుగల ఒక మహారాజు మిలిమీరిన కామేచ్ఛకలిగి సంచరించెడివాడు. ఒకదిన మున దాండక్యుడు వేటకైపోయి భార్గవమహర్షి ఆశ్రమము దగ్గఱకు జేరెను. ఆసమయములో భార్గవుడు ఆశ్రమములో లేడు. భార్గవునికూతురు ఒక్కతెమాత్రమే ఆశ్రమములో యున్నది, ఆమె గొప్పరూపవతి.రాజు ఆమెను చూచి మోహిం చెను. ఒంటరిగనున్న ఆమెను వెంటనే రథముమీద ఎక్కించు కొని తననగరమునకు తీసుకొనిపోయెను. పిదప కొంతసేపటికి భార్గవముని తిరిగి ఆశ్రమమునకు వచ్చిచూడగా కూతురు కను పించలేదు. జరిగినవిషయమును దివ్యదృష్టివలన తెలుసుకొని, కోపముజెంది వెంటనే రాజును బంధుమిత్రపరివారముతోసహా నాశనము జెందునట్లు శపించెను. మునులవాక్యములు నిరర్థ కములగునా! వెంటనే ఆరాజు శాపమునకు గురియై సర్వనాశ నము పొందెను. ఆప్రదేశము యిప్పటికిని దండకారణ్య మనే పేరుతో పిలువబడుచున్నది.

ఈవిధముగనే పూర్వకాలములో ఇంద్రుడు గౌతమ మహాముని భార్యయైన అహల్యను మోహించి, గౌతముముని ఆశ్రమములో లేనిసమయమును కనిపెట్టి అహల్యతో భోగిం చెను. గౌతమముని తిరిగి ఆశ్రమమునకువచ్చి జరిగినయుదంత మును యోగదృష్టితో తెలుసుకొని ఇంద్రుని సహస్ర యోనుడవుగమ్మని శపించెను. కామోద్రేకముచే ఇంద్రు

డంతటివాడే అట్టిదురవస్థకు పాలయ్యెనుగదా! ఇక సామాన్య మానవులమైన మనకు పాట్లు తప్పునా. రావణుడు సీతను అపహరించి బంధుమిత్రపరివారములతోసహా వినాశమును పొందెను. ఇట్టి విషయములు లెక్కకు మిక్కిలిగా యున్నవి. కనుక కామమును సేవించడమువలన ముప్పు తప్పదనియు, అందువలన కామశాస్త్రములను చదువుట అనర్థదాయకమేగాని ప్రయోజనములేదనియు కొందరు వాదనచేయుచుందురు.

కాని అట్టివాదములు అసందర్భములైనవి. ఆహార, నిద్రా మైథునములు ప్రాణికోటికి ముఖ్యావసరములైనవి. 'శరీరస్థితి హేతుత్వాదాహారసధర్మాణో హి కామః' అని వాత్స్యాయనుని సూత్రము. శరీరపుష్టికి ఆహారము ఎంత అవసరమో, సంభోగముకూడా ఆరోగ్యముకొఱకు అంత ముఖ్యమైనదిగనే యున్నది. సంభోగము చాలకాలము మానినయెడల పిచ్చి మొదలగురోగములు సంభవించును. కనుక ప్రతిదినము ఆహారము ఎంతముఖ్యమో మైథునముకూడ అంత ముఖ్యమైనదిగనే భావించవలయును.

"ఫలభూతాశ్చ ధర్మార్థయోః":—మఱియు కామము ధర్మమునకును, అర్థమునకును ఫలభూతమగుచున్నది. అనగా కామమువలన ధర్మము, అర్థము లభించునని భావము. ధర్మమువలన లభించునది స్వర్గమేకదా! ఆస్వర్గములోకూడ సౌఖ్యము పొందుటకు రంభోర్వశీమేనకాతిలోత్తమలేగదా యుందురు. కనుక ధర్మప్రయత్నమువలన చివరకు లభించునది కామోపభోగములే యని తేలుచున్నది.

అందువలన అట్టికామమును సాధించుటకు ఉపాయము లను బోధించు కామశాస్త్రములు అవసరమేకాని అనవసరము కాదు. కామమువలననే సంతానము కలుగుచున్నది. అట్టి సంతానమువలననే యిహపరములలో రెండింటియందును సౌఖ్యము కలుగుచున్నది. స్త్రీలు అమితానందసుధాయకమైనసౌఖ్యమును కలుగజేయుటకే సృష్టింపబడిరని గ్రహింపవలయును. ఈదృష్టితో పరిశీలించిన కామశాస్త్రములు అత్యంతావశ్యకములైనవిగ కన బడుచున్నది.

ఆహారము అధికముగ తీసుకొనినయెడల అజీర్ణాది వ్యాధులు సంభవించును. ఆవిధముగనే కామమువలన కొన్ని చిక్కులు కలుగవచ్చును. కాని వివేకియైనమానవుడు అట్టిదోష ములను నివారించుకొనుచు కామభోగములను పొందుచుండ వలయును. బెడ్డలు అధికముగ ఉన్నవని బియ్యమును పార బోసుకొందుమా!మృగములు పైరులను పాడుచేయునని వ్యవసా యముచేసుకొనుట మానుకొందురా? అతిథి వచ్చునేమో యని వంటజేయుటమానుకొందురా! భోగము లనుభవించని జీవి తము నిరర్థకముగదా! దోషములను తప్పించుకొనుచు సౌఖ్యము లనుభవించుట వివేకదాయకముగదా!

కనుక మానవుడు ధర్మార్థకామములను మూడింటిని సాధించుటకు ప్రయత్నము సలిపినయెడల యిహపరములను రెండింటిని సాధించగలిగినవా డగును.

ధర్మార్థకామములకు హాని కలుగనివిధముగ మానవుడు సంచరించుచుండవలయును. శిష్టులైనవారు ధర్మార్థకామములకు హాని కలుగనీయక ప్రవర్తించుచుందురని భావము.

ధర్మార్థకామములు మూడింటినిగాని, వీటిలో రెండింటిని గాని, కనీసము ఒకదానినిగాని పొందుటకు వీలుకలుగునో ఆ పనిని విడనాడక తప్పక శిష్టులు ఆచరించుచుందురని తెలుసుకొనవలయును.

ధర్మార్థకామములలో రెండువిషయములకు హాని కలుగ జేయుచు, ఒకదానినే కలుగజేయుపనిని చేయరాదని పెద్దల అభిప్రాయము.

---

## కామశాస్త్రాభ్యాసము

ప్రతియువకుడును కామశాస్త్రములలో తెలుపబడిన విషయములను తెలుసుకొనుట మంచిది. యువకుడు తనవిద్యాభ్యాసమునకుగాని, ఇతరవృత్తులకుగాని ఆటంకము కలుగనివిధముగ యీకామశాస్త్రమును అభ్యసింపవలయును.

కామశాస్త్ర మెరుంగని యువతీయువకులు మూలికాప్రభావమే యెరుంగని వైద్యునివలెను, మంత్రశాస్త్ర మెరుంగని మాంత్రికునివలెను మెలగవలసివచ్చునని వాత్స్యాయనుడు తెలుపుచున్నాడు. అందువలననే మానవకోటిసౌఖ్యమును తలపోసి వాత్స్యాయనుడు యీగ్రంథమును రచించెను.

అపారమగు విమర్శలకును, అసాధ్యమైన ప్రతిఘటనలకును గురియైనను తనసంకల్పమును కొనసాగించుకొనిన వాత్స్యాయనుడు సామాన్యమానవమాత్రుడు కాడనియు దైవాంశసంభూతుడనియు గ్రహించవలసియున్నది.

స్త్రీసంపర్కమును కామశాస్త్రములందు తెలుపబడినవిధముగ చేయుటవలన అమితసౌఖ్యము కలుగును. కాముకులు

కామశాస్త్రమునకు అంగభూతములైన సంగీతాదివిద్యలనుకూడ నేర్వవలయును.

"ప్రాగ్యౌవనాత్ స్త్రీ"—అని వాత్స్యాయనుడు వ్రాసెను. అనగా స్త్రీలు యౌవనము ప్రారంభింపకపూర్వమే యీకామసూత్రములను, యిందుకు అంగవిద్యలైన సంగీతము మొదలగువిద్యలను పుట్టినింటివద్ద యుండగనే నేర్చుకొనవలయును. వివాహితులైనయువతులు భర్తయొక్క అనుమతినిపొందనిదే నేర్చుకొనరాదు. భర్తయొక్క అనుమతి లేకుండా అభ్యసించినయెడల స్వేచ్ఛాచారిణిగా పరిగణింపబడును.

స్త్రీలకు శాస్త్రాభ్యాసముచేయుటకు అధికారములేదు. మరియు వారికి శాస్త్రములను గ్రహించుకొనగలుగుశక్తికూడ చాల తక్కువ. అందువలన కామశాస్త్రములో స్త్రీలు యీవిధముగ సంచరించవలయును ఆవిధముగ సంచరించవలయును అను నియమములు చెప్పబడియుండలేదు.

కాని ప్రయోగించువిధానములను తెలుసుకొనుట స్త్రీలకు చాల ముఖ్యము. ప్రయోగవిధానమును శాస్త్రము వలననే తెలుసుకొనవలయును. కనుక శాస్త్రపరిచయము స్త్రీలకు అనర్థదాయకము కాదని వాత్స్యాయనుని అభిప్రాయము.

స్త్రీలు ప్రయోగవిధానము తెలుసుకొనుట యీకామశాస్త్రమునందేగాక వ్యాకరణ, జ్యోతిషశాస్త్రములలోకూడా విధానములను తెలుసుకొనుట ఆచారమైయున్నది. ప్రపంచములో శాస్త్రములను చదివినవారు మిక్కిలి తక్కువగ మన్నారు. కాని శాస్త్రములలో తెలుపబడినపద్ధతులు అందరును

ఆచరించుచునేయుందురు. కనుక ఆచరించువిధానములను ముఖ్యముగ శాస్త్రమువలననే తెలుసుకొనవలయును.

శాస్త్రమును చదువుట అందరకు వీలుఅయినవిషయము కాకపోయినను, ఆచరించువిధానములుమాత్రము శాస్త్రములో చెప్పబడినవిగనే యుండును. అనగా ఒకవ్యక్తి శాస్త్రమును అభ్యసించు ననుకొనుడు. వానివలన ఒకడు అభ్యాసమును తెలుసుకొనును. వానివలన మరియొకరు, అతనివలన మరియొకరును యీవిధముగ పరంపరగ ఒకరివలన మరియొకరు ప్రయోగ విధానములను గ్రహించినను, మొత్తముమీద యీ ఆచరణలన్నిటికిని శాస్త్రమే ఆధారభూతమని యెరుంగవలయును.

అశ్వశాస్త్రమును, హస్తి (ఏనుగ) శాస్త్రమును అభ్యసించకపోయినను, అశ్వారోహకులును, గజారోహకులును, ఆశాస్త్రములను అభ్యసించినవారివలన ఆయారహస్యములనుమాత్రమే తెలుసుకొని వానిని ఉపయోగించుకొన గలుగుచున్నారు.

శాస్త్రము చదువకపోయినను శాస్త్రమునందు చెప్పబడిన విధానములు పరంపరగా ప్రజలు తెలుసుకొని వ్యవహారములు నడుపుకొనుచుందురు. రాజు దూరములో యున్నను, అతడు ఉన్నాడనుభయములో చట్టమునకు విరుద్ధముగ సంచరించలేరు.

ఈశాస్త్రమును అభ్యసించినవారలలో స్త్రీలుకూడ కలరు. వేశ్యలు, రాజపుత్రికలు, విశేషధనవంతులైన వారిపుత్రికలు యీశాస్త్రమును అభ్యసించినవారిలో కలరు.

తనకు బాగుగ నమ్మకమైన ఒకస్త్రీవలనగాని, యీశాస్త్రమును బాగుగ అభ్యసించిన యితరస్త్రీలవలనగాని, యువతులు

యీశాస్త్రమునుగాని, ఆచరణవిధానములనుగాని తెలుసుకొన వలయును.

అభ్యాసమువలన చేయుటకు వీలైనచతుష్షష్టి ప్రయోగ ములను యువతులు రహస్యముగ తెలుసుకొనవలయును.

పురుషులు సర్వస్వతంత్రులు గనుక వారికి యీశాస్త్రము నందలి రహస్యములు తెలుపువారు సులభముగ లభింతురు. ఇక స్త్రీలవిషయములో - పురుషునితో చాలకాలము రతిజరిపి రతి రహస్యములను బాగుగ ఎరిగినస్త్రీగాని, తనతోపాటు కలసి మెలసి తిరుగుచున్నదాసియొక్క కూతురుగాని, తనమీద విశేష అభిమానముగల చెలికత్తెగాని, తనవయస్సుకు సమాన మైన వయస్సుగలపినతల్లిగాని, తనగృహములో పనులుచేయు వృద్ధదాసి గాని, రతిసౌఖ్యము బాగుగ అనుభవించియున్న బీదస్త్రీగాని తనఅక్కగాని కన్యలకు రహస్యముగ కామశాస్త్ర ప్రయోగము లను తెలుపవలయును.

ఇక చతుష్షష్టికళలనుగురించి తెలుసుకొనవలయును. చతు అనగా నాలుగు. షష్టి అనగా అరువది. చతుష్షష్టికళలు అనగా అరువదినాలుగుకళలని భావము. ఈ అరువదినాలుగును ముఖ్యమైనకళలు. వీనియందు యిరవైనాలుగుకళలు కర్మాశ్రయము లైనవి; యిరువదికళలు జూదమునకు ఆశ్రయములైనవి; శయ నోపచారములైన కళలు పదహారు; ఉత్తరకళలు నాలుగు. ఈవిధముగ అరువదినాలుగుకళలు ప్రధానముగ తెలుసుకొన వలసినవిగ యున్నవి.

## అ రు వ ది నా లు గు క ళ లు

1. సంగీతము:—గానము చేయబడునది.

2. వాయిద్యములు:—తాళములు, మద్దెల, వీణ, పిల్లన గ్రోవి.

3. నాట్యము:—కరణాలనీ, అంగహారాలనీ, విభావాలనీ, భావాలనీ, అనుభావాలనీ, రసాలనీ ప్రత్యేకమైన అవయవాలతో కూడియున్నది నాట్య మనబడును. చేతులు, కాళ్లు, కళ్లు మొదలైన అవయవములతోను, శరీరముతోను పైనచెప్ప బడిన భావముల నన్నిటిని అనవరసం తాండవిస్తూ ఉన్నదా అన్నట్లు అభినయించుట నాట్య మనబడును.

4. చిత్రలేఖనము:—పటములు వ్రాయుట, రంగులు వేయుట.

5. అలంకారము:—తిలకముతో ముఖమును అలంకరించుట, స్తనములను అలంకరించుకొనుట, శిరోజములను అలంకరించుకొనుట, శరీరఅవయవములను అలంకరించుకొనుట.

6. పుష్పాస్తరణము:—శరీరమును, ఆసీనములను, శయ్యలను, పటములను, పడకగదిని పుష్పములతో అలంకరించుట.

7. తండులకుసుమబలివికారము:—పుష్పములతోను, బియ్యపుపిండితోను ముగ్గులు పెట్టుట.

8. దశనవసనాంగరాగము :—దంతములు, శరీరము, వ్రేళ్లగోళ్లు, వస్త్రములు ఇవి ఆకర్షణీయముగ నుండునట్లు రంగులతో అలంకరించుకొనుట.

9. మణిభూమికాకర్మ:-మణులతోటియు, మట్టితోటియు బొమ్మలు మొదలగునవి తయారుచేయుట.

10. శయనరచనము:—వసంతఋతువు మొదలగు ఋతువుల శీతోష్ణస్థితి ననుసరించి శయనముల నేర్పఱచుట.

11. జలతరంగిణి:—ఉదకవాయిద్యము.

12. ఉదకఘాతము:—పిచికార్లతో నీళ్లుకొట్టుట.

13. చిత్రయోగములు:—అనేకరూపములుగ వేషములు ధరించుట.

14. మాల్యగ్రథనవికల్పము:—పుష్పములతో చిత్ర విచిత్రముగ బంతులు, దండలు కట్టుట.

15. శేఖరకాడయోజనములు:—కిరీటమును, తలకు చుట్టును అలంకరించుకొనువిధముగను పుష్పములతో తయారు చేయుట.

16. నేపథ్యయోగము:—అలంకారము చేసుకొను రీతులు.

17. కర్ణపత్రభంగాలు:—ఏనుగుదంతములలోను, శంఖములలోను చెవులకు అలంకారములు కల్పించుకొనుట.

18. గంధయుక్తి:—సువాసనద్రవ్యములు తయారు చేయువిధానము నెఱుంగుట.

19. భూషణయోజనము:—ఆభరణములు ధరించుకొను విధానము.

20. ఇంద్రజాలము:—ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యలు చేయుట.

21. కౌచుమారము:—సుభగంకరణాదియోగములు.

22. హస్తలాఘవము:—చేతులలో నున్న వస్తువులను మాయముచేయుట మొదలగునవి.

23. విచిత్రశాకయూషభక్ష్యవికారక్రియాపానకరసరాగాసవయోజనము:—రకరకముల పిండివంటలు, భక్ష్యములు, పానకములు, షర్బతులు మొదలగునవి తయారుచేయుట. పాకకళ.

24. సూచీవానకర్మ:—రకరకములుగ గుడ్డలు కుట్టుట.

25. సూత్రక్రీడ:—దారముతో వినోదములు చూపుట. అనగా దారమును త్రెంచియు, కాల్చియు మరల ఆదారమును యథాప్రకారము చూపించుట మొదలగునవి.

26. వీణాడమరుకవాయిద్యములు:—వీణ, డమరుకములను వాయిద్యములయందు నిపుణత కలిగియుండుట.

27. ప్రహేళికములు:—రెండు అర్థములు వచ్చులాగున కవిత్వము (పద్యములు) చెప్పుట.

28. ప్రతిమాల:—చాటుపద్యములు చెప్పుట.

29. దుర్వాచకయోగములు:—సరిగ అర్థముకాని విధముగ కవిత్వము చెప్పుట.

30. పుస్తకవాచనం:—రసవత్తరముగ పురాణములను, కావ్యములను చదువుట.

31. నాటకాఖ్యాయికాదర్శనము:—నాటకములు, కావ్యములు, గద్యగ్రంథములు, చంపువులు మొదలగువానికి అర్థము తెలుసుకొనుట.

32. కావ్యసమస్యాపూరణము:—పద్యపాదములుగ ఇచ్చిన సమస్యలను పూర్తిచేయుట.

33. పట్టికావేత్రవానవికల్పములు:—పేముతో కుర్చీలు, మంచములు, బుట్టలు మొదలగునవి అల్లుట.

34. తర్కుకర్మలు:—విలాసము కొఱకు బొమ్మలు తయారుచేయుట.

35. తక్షణం:—కొయ్యలతో బొమ్మలు, ఇతరవస్తువులు అందముగ తయారుచేయుట.

36. వాస్తువిద్య:—గృహవాస్తు తెలుసుకొనుట.

37. రూప్యరత్నపరీక్ష:—రత్నపరీక్షయందు నిపుణత.

38. ధాతువాదము:—భూగర్భమునం దుండు ఖనిజములను తెలుసుకొనుట.

39. మణిరాగాకరజ్ఞానము:—భూగర్భమందు మణులుండు ప్రదేశములను తెలుసుకొనుట.

40. మేషకుక్కుటలావకవిధులు:—పొట్టేళ్లు, కోడిపుంజులు, లావకమనుపిట్టలు మొదలగువాటితో పందెములు కట్టు రీతులు తెలుసుకొనుట.

41. వృక్షాయుర్వేదయోగములు:—వృక్షవైద్యము నెఱుంగుట.

42. శుకశారికాప్రలాపములు:—చిలుకలు, గోరువంకలు వీటితో మాట్లాడు భాషలు తెలుసుకొనుట.

43. ఉత్సాదనము, సంవాహనము, కేశమర్దనములలో కౌశలము ఒళ్లుపట్టుట, పాదములుపిసుకుట, తలఅంటుట మొదలగుపనులు చేయుటయందు సమర్థత.

44. అక్షరముష్టికాకథనము:—చేతితో అక్షరములను వ్రాయుచు కవిత్వము చెప్పుట.

45. మ్లేచ్ఛితకవిత్వములు:—కవులను దూషించుట.

46. దేశభాషావిజ్ఞానము:—అనేకభాషల నెరుంగుట.

47. పుష్పశకటిక:—పువ్వులపల్లకీ, పువ్వులరథము తయారుచేయుట.

48. నిమిత్తజ్ఞానము:—శకునఫలితములు తెలుసుకొనుట.

49. యంత్రమాతృకము:—యంత్రములను తయారుచేయుట.

50. ధారణమాతృక:—ఒకమారు వినినపద్యమును తిరిగి తాను చెప్పుట.

51. మానసక్రియ:—ఆలోచనతో చేయు అష్టావధానము, శతావధానము మొదలగునవి చేయుట.

52. సంపాఠ్యము:—అనేకమంది కలసి ఒకేవిషయమును చెప్పుట లేక పాడుట.

53. కావ్యక్రియ:—గ్రంథములను రచించుట.

54. అభిధానకోశము:—వేదములను వర్ణించుట.

55. ఛందోజ్ఞానము:—ఛందస్సు అనగా పద్యములు వ్రాయుపరిజ్ఞానము కలిగియుండుట.

56. క్రియాకల్పనము:—కార్యాచరణాశక్తి.

57. భవితకయోగము:—ఒకవస్తువును వేరొకరూపములో చూపుట.

58. వస్త్రగోపనం:—పూర్వము శ్రీకృష్ణుడు గోపికాస్త్రీల వస్త్రములను మాయముచేసినట్లు వస్త్రములను మాయముచేయు విధానములను తెలుసుకొనుట.

59. ద్యూతవిశేషములు:—జూదములాడుట.

60. ఆకర్షక్రీడః—త్రాటితో ఆడు ఆటలు.

61. బాలక్రీడనకాలుః—బాలురు ఆడుకొనుటకు వింతగైన ఆటవస్తువులు తయారుచేయుట.

62. వైనయికీజ్ఞానముః—గుఱ్ఱములను, ఏనుగులను మచ్చికచేసుకొనుట.

63. వైజయికీవిద్యలుః—విజయమును పొందుటకు ఉపాయములు తెలుపుశాస్త్రము.

64. వ్యాయామికీజ్ఞానం:— శరీరవ్యాయామములకు సంబంధించినవిషయముల నెరుంగుట.

"పాంచాలికీచతుష్షష్టిరపరా":—ఈ అరువదినాలుగువిద్యలేగాక పాంచాలికీకళ లనుపేరుతో ఇంకను చతుష్షష్టికళలు కలవు. ఈచతుష్షష్టికళలుకూడ కామశాస్త్రమునకు అంగవిద్యలుగనే పరిగణింపబడుచున్నవి. ఈవిద్యలవలనగూడ కామశాస్త్రవిజ్ఞానము కలుగును. ఈకళలను ప్రయోగించువిధానములు ముందు తెలుపబడును.

ఈకళలను తెలిసినస్త్రీ విశేషశక్తిసంపన్నురాలగును. ఇట్టి విద్యలు చక్కనిరూపము, మంచిస్వభావము, సమస్తలోకవిషయపరిజ్ఞానము కలిగినవేశ్య నేర్చుకొనిన 'గణిక'యను బిరుదును పొంది, సభలలో గౌరవవింపబడి విశేషప్రఖ్యాతిని పొందును.

అట్టి సుందరాంగియగువేశ్య రాజులచే గౌరవింపబడుచు, సత్కరింపబడుచుండును. ప్రజాసమూహములచే కీర్తింపబడుచుండును. విద్వజ్జనసమూహములమన్ననలను పొందుచుండును. సకలవిద్యావంతురాలని కీర్తింపబడుచు కళలను నేర్చుకోవలయు

నని కుతూహలపడువారిచే ప్రార్థింపదగినది యగును. విశేష నాగరికతజ్ఞానమును కలిగియుండును.

సంగీతము మొదలగు ఈకళలు తెలిసిన ఎట్టిపురుషుల నైనను వశ్యముచేసుకొనగలుగుశక్తి కలిగియుండును.

భర్త గతించినను లేదా కారణాంతరములచే భర్తతో శాశ్వతవియోగము సంభవించి దుర్భరదుఃఖములు సంభవించి నను, దేశాంతరములకుపోయి యీవిద్యలసహాయముచే కాల మును సుఖముగ గడుపవచ్చును.

ఈకళలను తెలిసినపురుషుడు విశేషసమర్థత కలిగి మాట లాడుశక్తిగలవా డగును. మరియు యుక్తియుక్తముగను, సందర్భోచితముగను, సమంజసముగను, చమత్కారముగను, మృదుమధురముగను మాటలాడువా డగును. అంతఃపురములలో నున్నస్త్రీలనుకూడ మిక్కిలి సులభముగ వశ్యముచేసుకొన గలుగుశక్తిగలవా డగును.

ఈకళలను అభ్యసించినస్త్రీపురుషులు అఖండసౌఖ్య మును, ఆనందమును పొందగలుగుదురు. మరియు కష్టములు ప్రాప్తించినసమయములలో వాటినుండి తప్పించుకొనగలుగు చుందురు.

ఈకళల నెరింగినవారు కామకళారంగములో దేశకాల పాత్రానుసారములను గ్రహించి యుక్తియుక్తముగ సంచరింప గలుగుచుందురు.



# నాగరికత

సకలవిద్యలు అభ్యసించినపిదప కామసూత్రముల పార మునుకూడ గ్రహించి వివాహము చేసుకొని కాపురము చేయుచున్న కాలములో తగినధనము లేనిచో గృహకృత్యములు జరుగక నాగరికతకు భంగము కలుగును. అందువలన బ్రాహ్మణులు విద్యవల్లను, క్షత్రియులు పరాక్రమమువలనను, వైశ్యులు వ్యాపారమూలమునను, శూద్రులు వ్యవసాయ మూలమునను ధనమును సంపాదించవలయును.

వివాహితులైనవారందరును ఈకామసూత్రములను చదువవలయును. ఈశాస్త్రములో చెప్పబడినవిషయములను ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించువారందరును సౌఖ్యమును పొందగలుగుదురు. వాత్స్యాయనునిచే వ్రాయబడిన ఈ గ్రంథములో 'నాగరికత' అనబడు ఈభాగము విశేషప్రాముఖ్యమైనదిగ కనబడుచున్నది.

ఎనిమిదివందలగ్రామములకు మధ్యనుండు పెద్దగ్రామము నగర మనబడును. రాజులు నివసించు పెద్దనగరము పట్టణ మన బడును. నాలుగువందలగ్రామములకు మధ్యనుండు పెద్ద గ్రామము 'ఖర్వాటము' అనబడును. ఖర్వాటము కంటెను పెద్ద దిగనుండుగ్రామమును 'ద్రోణముఖ' మని యందురు.

వివాహితుడు, విద్వజ్జనులు అధికముగ నివసించునగ రమునందుగాని, పట్టణములోగాని, ఖర్వాటములోగాని, ద్రోణ

ముఖములోగాని నివసించవలయును. జీవితయాత్ర సౌఖ్యముగ పొగు నితరప్రదేశములలోకూడ నివసించవచ్చునని గ్రంథాంతరములలో చెప్పబడియున్నది.

నదిగాని, చెరువుగాని, బావిగాని సమీపములో ఉండు ప్రదేశములో మొదట స్వగృహమును నిర్మించుకొనవలయును. అనగా మంచినీటివసతి గలప్రదేశములో గృహమునునిర్మించుకొనవలయును. అట్టి గృహమునకు దాపులో చక్కని ఉద్యానవనము నొకదానిని నిర్మించుకొనవలయును. వంటయిల్లు ఒకటి ప్రధానగృహమునకు ప్రక్కనే నిర్మింపబడవలయును. నివసించు గృహము రెండుభాగములుగ నుండవలయును. అది ఒక భాగము రతిక్రియలకొరకును, రెండవభాగము నిద్రించుటకును తగినవిగ నుండవలయును. గృహమును వాస్తుశాస్త్రప్రకారము నిర్మించవలయును.

"పడకగది":—శయనమందిరములో ఆనందసంధాయకముగ వివిధరకములైన నగిషీలతో కన్నులపండువుగ తయారుచేయబడిన శయ్య (మంచము) ఉండవలయును. దానిపై రెండు మెత్తని దూదిపరుపులు ఒకదానిపై ఒకటి వేయవలయును. దానిపై చలువచేయబడిన తెల్లనిదుప్పటి పరచవలయును. తల క్రిందను కాళ్లక్రిందను రెండు మెత్తనిదిండ్లను అమర్చవలయును. పడకగదిలోనికి ప్రవేశించుసరికి సువాసనలు నలుమూలలను వెదజల్లుచుండవలయును. శయ్యకు మధ్యభాగములో కొంచెము పల్లముగను, మెత్తగను, రతిసలుపుటకు అనుకూలముగను, సౌఖ్యప్రదముగను నుండవలయును. శయ్యపై పరచినవస్త్రమును ప్రతిదినమును చలువచేయించుచుండవల

యును. రతి అనంతరము యువతీయువకులు వేరువేరుగ శయ నించుటకు పెద్దశయ్యకు సమీపములో పెద్దశయ్యకంటె కొంచెము ఎత్తుతక్కువగనున్న మరియొకశయ్యను అమర్చి యుంచుకొనవలయును. సంభోగానంతరము స్త్రీపురుషు లిరువు రును ఒకేశయ్యపై శయనింపరాదు.

"తస్య చ శిరోభాగే కూర్చస్థానం":—అట్టి శయ్యకు తలవైపున నేలపై దైవప్రార్థనచేసుకొనుటకు 'కూర్చాసన' మన బడు ఒక ఆసనమును జపము చేసుకొనుటకు వీలుగానుండు ఒక ఆసనమును ఏర్పాటు చేసియుంచుకొనవలయును.

"వేదికా చ":—మంచమునకు ఎదురుగాగోడకు ఆనుకొని మూరెడువెడల్పులో ఒక అరుగు ఉండవలయును. ఆ అరుగు మీద గతరాత్రి ఉపయోగింపగా మిగిలిన సుగంధద్రవ్యములు, పూలమాలలు, పరిమళద్రవ్యములు, విసనకర్రలు, నోటి దుర్వాసనను పోగొట్టు లవంగపు బెరడులును ఉంచవలయును.

"భూమే పతద్గ్రహః":—మంచము ప్రక్క ఉమ్మివేసుకొను టకు పాత్ర యొకటి యుంచవలయును. ఆపాత్రకు 'పతద్గ్రహం' అని పేరు.

ఉత్సాహము కలిగినప్పుడు వాయించుకొనుటకు బట్టతో కప్పబడిన వీణె యొకటి ఏనుగుదంతపుకొయ్యకు తగిలించియుంచు కొనవలయును. చిత్రపటములు వ్రాయుటకు కావలసినపరికర ములనుగూడ గదియందు ఉంచుకొనవలయును. కామసూత్ర గ్రంథమును శయ్యకు సమీపములో నుంచుకొనవలయును. గోరింట, పొగడ, జాజి, విరిజాజి, సంపెంగపుష్పాలను ఉంచు

కొనవలయును. ఈవస్తువుల నన్నిటిని ఉచితప్రదేశములలో నుంచవలయును.

"నాలి దూరే భూమే వృత్తాస్తరణం":—తల ఆనుకొని విశ్రమించుటకు వీలుగా నుండునటువంటి పడకకుర్చీగాని, పేము కుర్చీగాని శయ్యకు సమీపములో నుంచుకొనవలయును.

"ఆకర్షఫలకం ద్యూతఫలకం చ":—మరియు అద్దమును, కులాసాగా నున్నప్పుడు ఆడుకొనుటకు చదరంగపుబల్లయు గోడకు తగిలించియుంచుకొనవలయును. విశేషించి గదియం దుండువస్తువుల నన్నిటిని ప్రతిదినమును శుభ్రముచేయుచుండ వలయును.

"తస్య బహిః క్రీడా శకునిపంజరాణి":—నివసించుచున్న గృహమునకు బయట వినోదముకొరకు ఏనుగుదంతములతో చేయఃబడిన చిలుకపంజరములను ఏర్పాటుచేయవలయును.

ఉద్యానవనములో దట్టముఁగ వ్యాపించియున్న చెట్ల కొమ్మల క్రింద ఉయ్యాల నొకటి సమర్చియుంచుకొనవలయును. ఉద్యానవనములో విహారము సలిపినపిమ్మట ఆ ఉయ్యాలలో ప్రియురాలిని ప్రక్కకూర్చుండబెట్టుకొని ఊగవలయును. గచ్చుచేయబడిన అరుగులు, పూలమొక్కలమధ్యలో నుండ వలయును. రతి అనంతరము ఆ అరుగుమీద కూర్చుండిన పూల మొక్కలనుండి వచ్చుసువాసనలు మనస్సున కొకవిధమైన ఆనంద మును కలుగజేయుచుండును.

స్త్రీపురుషులు ప్రతిదినము సూర్యోదయమునకు పూర్వమే నిద్రలేచి కాలకృత్యములను దీర్చుకొని, స్నానసంధ్యాజపము లాచరించి, దేహమునకు సుగంధద్రవ్యములు అలదుకొని, తెల్లని

వస్త్రములు ధరించి, పెదవులకు రంగుపూసి అద్దములో ప్రతిబింబ మును వీక్షించి, తాంబూలమును వేసుకొనినపిమ్మట ధర్మార్థకామ సాధనకై ఆలోచనలు సలుపవలయును.

స్త్రీపురుషు లిరువురును ప్రతిదినమును పరిశుభ్రముగ సూర్యోదయకాలములో చన్నీటిస్నానమును, సాయంకాలము వేడినీటిస్నానమును చేయుచుండవలయును, స్నానమువలన దేహమునకు తేజస్సుకలిగి పరిశుభ్రముగ నుండును. దినమువదలి దినము శరీరము పట్టించుకొనుచుండవలయును. మూడుదినముల కొకపర్యాయము అభ్యంగస్నానమును, నాలుగుదినముల కొక పర్యాయము క్షురకర్మను చేయించుకొనుచుండవలయును. అయిదురోజుల కొకపర్యాయముగాని తప్పిన పదిదినముల కొక పర్యాయముగాని అధోరోమములను తీయుచుండవలయును.

చంకలలో చెమట విశేషముగ పట్టుచుండునుగాన అవి దుర్వాసన కొట్టకుండ తరుచు గుడ్డతో తుడుచుచు ఎల్లప్పుడును పరిశుభ్రముగ నుంచవలయును.

రాత్రిని, పగలును ఒక్కొక్కదానిని ఎనిమిదేసి సమభాగ ములుగజేసి ఉదయము లగాయితు మొదటి మూడుభాగముల లోను గృహకృత్యములు నెరవేర్చుకొనవలయును. నాల్గవభాగ ములో మరల స్నానముచేసి భోజనముచేయవలయును. పగలు ఎనిమిదవభాగములో మరల వేడినీటి స్నానముచేసి భోజనము చేయవలయును. ఈవిధముగ ప్రతిదినమును ఆచరింపవలయునని వాత్స్యాయనుడు కామసూత్రములలో వివరించియుండెను.

మధ్యాహ్నము భోజనానంతరము చిలుకలకును, గోరు వంకలకును మాటలు నేర్పుటయు, పావురముల నెగురవేయు

టయు, కోడిపందెములు, పొట్టేళ్లపందెములు ఏర్పాటుచేయు టయు, కళలకు సంబంధించిన ప్రసంగములు చేయుచుండుటయు మొదలగువానిని పీఠమర్దులు, విటులు, విదూషకులు మొద లగువారిని వెంటబెట్టుకొని చేయుచుండవలయును. మధ్యా హ్నము అనగా పగలు భోజనానంతరము పడుకొనవలయును. గ్రీష్మఋతువులో పగటినిద్ర దోషముకాదని చెప్పబడుచున్నది.

సాయంసమయములో తగినదుస్తులు ధరించి బంధు మిత్రులతో కలసి ఉద్యానవనములో విహారము సలుపవల యును. చీకటిపడినపిమ్మట సంగీతము, నాట్యము, వాయిద్యము మొదలగునవి జరుపవలయును.

నాగరికుడైనయువకుడు వివిధరూపముల నలంకరింపబడి సువాసనలు వెదజల్లుచున్న శయనమందిరమును పీఠమర్ద, విట, విదూషకాదులతో ప్రవేశించి అభిసారిక (ప్రియురాలు) కొరకు ఎదురుచూచుచుండవలయును. అభిసారిక యనగా ప్రియుని కొరకు తనయిల్లు వదలి రహస్యస్థలమునకు బోవుస్త్రీ యని భావము. అభిసారికవచ్చుట ఆలస్యమైనచో దూతికను పంప వలయును. లేదా తానే అభిసారికను తీసుకొనివచ్చుటకు పోవలయును. పైన తెలుపబడిన పీఠమర్దుడు మొదలగు సహాయ కులు నాయకుడు కూర్చుండుశయ్యకు సమీపములో వేరు ఆసనములపై కూర్చుండవలయును.

ప్రియురాలు అరుదెంచినపిదప ఆమెహృదయమునకు ఆనందము కలుగువిధముగ మనోహరముగ మాటలాడవల యును. చెదరినముంగురులను సరిచేయుచు, అలంకారముల సర్దుచు ఆమెప్రక్క కూర్చుండవలయును. శ్రమపోవుటకై

విసరవలయును. మరియు పరిచారికలచే తగినఉపచారముల నన్నిటిని చేయించవలయును. ఈపనుల నన్నిటిని ప్రతిదినము చేయుచుండవలయును. ఇక నైమిత్తికములనుగురించి తెలుసు కొనవలయును.

ఏదో ఒకకారణముచే అప్పుడప్పుడు జరుపబడుచుండు సభలు, ప్రసంగములు మొదలైనవి నైమిత్తికము లనబడును. దేవతాఉత్సవములు'ఘట' లనబడును. నాగరకులంతా ఘటలను చూచుటకు వచ్చుచుందురు. ఈఘటలు నియమపద్ధతిలో నడుప బడుచుండును. ఈఘటలసమయములలో సభలను ఏర్పాటుచేసి కళలు మొదలగువానినిగురించి చర్చలు జరుపుచు భార్యతో కలసి పానీయములు సేవించుచుండుట నాగరికుల లక్షణము.

మఱియు సభలయందును, వేశ్యాగృహములలోను, ఇతరప్రదేశములయందును; విద్యలో, బుద్ధిలో, వయస్సులో, స్వభావములో, భాగ్యములో సమానులైనవారిని తరుచు కలుసు కొనుచు ఒకరినొకరు పొగడుకొనుచు, క్రీగంటిచూపులతో ప్రేమభావములను తెలుపుచు పరిహాసము లాడుకొనుచు ఉచిత ఆసనములపై కూర్చొని వినోదించుట గోష్ఠి యనబడును. ఇట్టి గోష్ఠులలో సంగీతసభలు, నాట్యసభలు తరుచుగ జరుగుచుండును. అట్టిసమయములలో సుందరాంగులైన యువ తులకు తమప్రేమపూరితహృదయాభిప్రాయములను తెలుపుటకై తమపరిచారకులచే తెప్పించినకానుకలను సమర్పించుచుండ వలయును.

ఉద్యానవనవిహారమునకు సాయంకాలమునకు ముందే గుఱ్ఱముల నెక్కి పరిచారికలను వేశ్యలను వెంటబెట్టుకొని వెళ్ల

వలయును. ఇట్టి వివాదము మాసమునకు రెండుపర్యాయములు చేయుచుండవలయును.

నాగరికులైనవారు సలుపుక్రీడలను ఈక్రింద తెలుపు చున్నాను.—

1. యక్షరాత్రి:—ఇదియే సుఖరాత్రి యనబడును. నాగరికులు ఈపర్వరాత్రియందు జూదము మొదలగు ఆట లాడుచుందురు.

2. కౌముదీజాగరణము:— శరత్కాలములో తెల్లని పండువెన్నెలరాత్రులలో నాగరకులు పెక్కుమంది ఒకచోట జేరి సంగీతసభలు, నాట్యములు జరుపుచుందురు.

3. సువసంతకము:—మన్మథోత్సవము, ఈఉత్సవములలో నాట్యములు, సంగీతసభలు జరుపబడును.

4. సహకారభంజికా:—నటనలుసలుపుచు ఆనందముతో తియ్యమామిడిపండ్లు అందుకొనుచు కోయుట.

5. అభ్యూషఖాదికా:—పచ్చిశెనగకాయలు కాల్చు కొని గింజలను తినుట.

6. బిసఖాదికా:—తటాకములో మొలలోతువరకు దిగి లేతతామరతూండ్లను పూవులతోకూడ కోసి, పువ్వులు ధరించి తూళ్లు భక్షించుట.

7. నవపత్రికా:—తొలకరివర్షములకు చిగిర్చిన వృక్ష ములనీడలందు ఆనందముగ ఆటలాడు కొనుచు విహరించుట.

8. ఉదకక్ష్వేడికా:—పిచ్చికాన్లతో నీళ్లుచల్లుట.

9. పాంచాలానుయానము:—అయిదారుగురు యువతీ యువకులు కలసి ఆటలాడుకొనుచు కబుర్లు చెప్పుకొనుట.

10. ఏకశాల్మలి:—బాగుగపూచిన బూరుగుచెట్టుక్రింద ఆటలాడుకొనుచు దానిపువ్వులను అలంకరించుకొనుచుండుట.

11. యవచతుర్థి:—వైశాఖశుద్ధ చవితిదినమున యవధాన్యములపిండితో సువాసనద్రవ్యములు కలిపి యువతీయువకులు ఒకళ్లపైఒకళ్లు విలాసముగ చల్లుకొనుట.

12. ఆలోలచతుర్థి:—శ్రావణశుద్ధ చవితిదినమున చెట్ల కొమ్మలకు ఉయ్యాలలుకట్టి ఊగుచు ఆడుకొనుట.

13. మదనోత్సవము:—మన్మథునిపటమును పూజించుట.

14. దమనభంజికా:—యువతీయువకులు ఒకరినొకరు దమనదళములతో అలంకరించుకొనుట.

15. హోలాకా:—ఈపండుగ ఫాల్గునమాసములో పౌర్ణమిదినమున వచ్చును. ఈదినమున యువతీయువకులు ఒకరిమీద నొకరు వసంతమును చల్లుకొందురు.

16. అశోకోత్తంసికా:—అశోకచెట్టుయొక్క ఆకులను కోసి శిరస్సునిమీద ధరించుకొనుట.

17. పుష్పాపచయనము:—పుష్పములను కోయుట.

18. చూతపల్లవావతంసనము:— మామిడిచిగుళ్లుకోసి తలవెంట్రుకలలో అలంకరించుకొనుట.

19. ఇక్షుభంజికా:—చెఱకుగడను చిన్నచిన్నముక్కలుగ కోసి దండలుగ గ్రుచ్చి మెడలో ధరించుట.

20. కదంబయుద్ధము:—కడిమికాయలను కత్తులవలె చేతులలో ధరించి యుద్ధముచేయుట.

నాగరికులు ఇట్టి క్రీడలను ఆచరించుచు, జనసమూహా హాములకు నేర్పుచుండవలయును. ఇట్టి క్రీడలు అనేకమంది కలసి చేయునవేగాని ఒకరూ యిద్దరూ చేయునవి గావు. తన వైభవమును అనుసరించి నాగరికులు పరిచారికలతో కలసి యక్ష రాత్రి మొదలైన ఉత్సవములు మహోత్సవముగ జరుపుకొన వచ్చును.

దరిద్రుడైయుండి నాగరికచరిత్రను అనుసరించదలచిన వాడు కామసూత్రవిషయములను బాగుగ గ్రహించి, తదుపరి కామసూత్రవిధానములను ప్రజలకు బోధించుచు, సభలు జరుపుచు, వేశ్యలచేత నాగరకక్రీడలను జరిపించుచు 'మల్లికాదండ పీఠ' మను నాగరకపీఠమును అలంకరించి కామశాస్త్రాచార్యు డనిపించుకొనవలయును. ఇతనినే 'పీఠమర్దు' దని పిలుతురు.

యౌవనకాలములో నాగరకవృత్తిని అవలంబించి వెనుక ముందులు గమనించక తనధనము నంతను వేశ్యలపాలుచేసి, యింకను విషయవాంఛలను విడనాడలేక భార్యాసమేతముగ నుండి, సభలలో వేశ్యలవలన బహుమతులు పొందుచు వారిని అనుసరించి బ్రతుకుచుండును. ఇట్టిపురుషుడు విటు డనబడును.

సంగీతము, నాట్యము మొదలైనవిద్యలలో నిపుణుడైన వాడు యువతులచే గౌరవింపబడి సత్కరింపబడుచుండును. ఇతడు విదూషకుడనియు, వైహాసికుడనియుపిలువబడుచుండును. ఇతడు పరిహాసముగ మాట్లాడుచూ తరచు నవ్వించుచుండును.

పైనచెప్పబడినవారు కామినీకాముకులకు కామవిషయములలో మంత్రులుగానుండి దేశకాలముల ననుసరించి సాధారణముగ కామినీకాముకులను సమకూర్చడములోను, మిత్రభేదము కల్పించుటకును వినియోగింపబడుచుందురు.

మరియు ఆడభిక్షుకులును, సన్యాసినులును, దాసీలును, వృద్ధవేశ్యలును మొదలగువారినికూడ సంధానమునకును, విభేదము కల్పించుటకును వినియోగించుచుందురు. వీరు 'కుట్టెను' లని పిలువబడుచుందురు.

---

# దౌత్యము

నాలుగుజాతులపురుషులును, తమజాతికి చెందినకన్యను శాస్త్రోక్తముగ వివాహముచేసుకొని, భార్య అని పిలువబడు ఆస్త్రీయందు ప్రయోగించుకామమువంశాభివృద్ధిని, కీర్తిని, సర్వ జనసమ్మతమును కలుగ జేయును.

అందుకు విరుద్ధముగ అగ్రజాతిస్త్రీలను, తక్కువజాతి పురుషులు వివాహముచేసుకొనరాదని శాస్త్రకారులు నిర్ణ యించిరి.

కులమునుండి బహిష్కరింపబడినటువంటియు, తక్కువ కులమునకు చెందినటువంటియు స్త్రీయందును, వేశ్యయందునూ పునర్భువునందును ప్రయోగింపబడుకామము శిష్టాంగీకారమైనది కాదు. అట్టికామము కేవలము శరీరసౌఖ్యముకొరకుమాత్రమే యని గ్రహింపవలయును.

ఆవిధముగ స్త్రీలు 'కన్యక, పునర్భువు, వేశ్య' అని మూడుతరగతులుగ విభజింపబడిరి. మరల కన్యలు 'పుత్రఫల ప్రదలనీ, సుఖఫలప్రదలనీ' రెండువిధములు. సంతానము కొరకు పరిగ్రహింపబడినకన్య తనకులమునకు చెందియుండుట ఉత్తమము. కేవలము సౌఖ్యముకొఱకు ఇతరకులములనుండి పరి గ్రహింపబడినకన్య అధమము. విశేషించి అట్టికన్యక పునర్భువు అయినచో అధమాధమము.

సంతానముకొరకుగాని, సౌఖ్యముకొరకుగాని గాక కేవ

లము ఏధనాశకొరకో పరిగ్రహింపబడుస్త్రీలు నాల్గవరకమునకు చెందినవారని గోణికాపుత్రుడు తెలిపియుండెను.

పరదార, స్వేచ్ఛగ అనేకమందితో సంభోగించుచున్నదని తలచినప్పుడు, ఆమె తనకంటెను ఉత్తమకులములో జన్మించినదైనను, వేశ్యతో పరిచయముచేసినవిధముగ చేసినచో దోషము లేదని శాస్త్రకారులు తెలుపుచున్నారు.

పునర్భూనాయిక అంతకుపూర్వమే యితరపురుషునిచే గ్రహింపబడినది కనుక ఆమెతో జరుపుసంయోగము ధర్మవిరుద్ధము కానేరదని శిష్టుల వచనము.

పురుషుడు అనేకకారణములచే. అనగా ఏధనాశచేతనో లేక తనయితరవ్యవహారములు నెఱవేర్చుకొనుటకో పునర్భూగమనము చేయుచుండును. అనగా కేవలము కామేచ్ఛకొరకే పురుషుడు పునర్భువుతో సంగమము జరుపక అనేకకారణములతో స్త్రీల పరిచయముచేసుకొనుచుండును.

ఇట్టి కారణములచే మంత్రుల ఉంపుడుకత్తెలును, రాజుల ఉంపుడుకత్తెలును, అంతఃపురములలో నివసించుచుండు నితర కాంతలును, కార్యసాధనకు ఉపయోగపడు అన్యస్త్రీలును, భర్తను కోల్పోయినవారును అయిదవరకమునకుచెందిన నాయికలుగా భావించవలయునని చారాయణుడు తనకామశాస్త్ర గ్రంథములో వ్రాసెను.

భర్తను కోల్పోయినయువతిని, రాజకుటుంబమునకు గాని, మంత్రికుటుంబమునకు లేక ఒకధనవంతునికుటుంబమునకు గాని సంబంధించినస్త్రీని ఆరవనాయికగా భావింవలయునని సువర్ణనాభుడు తెలిపెను.

పురుషసంపర్కము ఎరుగని వేశ్యకన్యగాని, దాసియొక్క కుమార్తెగాని, వ్యభిచారవృత్తిని వదలి ఒకపురుషునివివాహము చేసికొనినచో, అట్టియువతిని ఏడవరకమునాయికగా పరిగణింప వలయునని ఘోటకముఖుడు తెలిపెను.

బాల్యభావమును విడచినకులయువతి ఉపచారభేదము ననుసరించి ఎనిమిదవతరగతికి చెందిననాయికగా పరిగణింపబడునని గోనర్ధీయుడు తెలిపెను.

కన్య, పునర్భువు, వేశ్య, పరదార అనబడు నాలుగు తరగతులైన నాయికాభేదములలోనే యితర కామశాస్త్రవేత్తలు తెలిపినభేదములకు చెందినస్త్రీలు చేరుదురు కనుక నాయికలు పైనతెలుపబడిన నాలుగుతెగలవారేకాని వేరుగా లేరని తేలు చున్నది. ఒకవేళ ఇతరభేదములను అంగీకరించినను ఈ నాలుగుతరగతులకు చెందిననాయికలకన్న విశేషకార్యము లేమియు సాధింపబడుచుండుట లేదని వాత్స్యాయనులవారు తెలుపుచున్నారు.

స్త్రీజాతికిగాని పురుషజాతికిగాని చెందనినపుంసకునివలన కూడ ఔపరిష్టకాదిక్రీడలవలన సౌఖ్యమును పొందవచ్చును గనుక నపుంసకుని అయిదవనాయికగా పరిగణించవలయునని కొందరిమతము.

స్త్రీలవలె పురుషులలో భేదములు లేకపోవుటవలన పురుషులలో తెగలను నిరూపించియుండలేదు.

కేవలము రతిక్రీడాసౌఖ్యముకొరకు పరాంగనలతో రహస్యముగ ప్రవర్తించువారు రెండవతరగతికి చెందినాయ

కునిగ పరిగణింపవచ్చును. ఇట్టివాడు ప్రచ్ఛన్నుడని పిలువబడు చుండును.

సర్వవిషయములందును ధర్మముగ సంచరించువానిని ఉత్తమునిగను, కొన్నిసమయములలో ధర్మముగను, కొన్ని సమయములలో అధర్మముగను సంచరించువానిని మధ్యముని గను, ధర్మమును స్వల్పముగా పాటించువానిని అధమునిగను భావించవలయును.

పొందకూడనిస్త్రీలు :—కుష్ఠురోగము కలదానిని, పిచ్చి ఎత్తినస్త్రీని, కులమునుండి బహిష్కరింపబడినదానిని, రహస్య ములను బయటపెట్టుస్త్రీలను, నమ్మకముగ మాటలు చెప్పుచు మోసముచేయుస్త్రీలను, యవ్వనము గతించినస్త్రీలను, బొల్లి రోగము గలదానిని, మిక్కిలి నలుపుశరీరము గలదానిని, శరీరము దుర్వాసనకొట్టుచున్నదానిని, దగ్గరబంధువును, భార్యస్నేహితు రాలిని, భార్యచెలికత్తెను, భర్తను కోల్పోయినదానిని, విద్యా సంస్థలలోగాని రాజకీయములలోగాని సంబంధముగలదానిని, పురోహితునిభార్యను, రాజుభార్యను కామసౌఖ్యములకు ఉపయోగించుకొనరాదని వాత్స్యాయనుడు తెలిపెను. దీనిని బట్టి ఆలోచించినచో పరాంగనాసౌఖ్యమును కోరుట ధర్మవిరుద్ధ మని వాత్స్యాయనులవారి అభిమతముగ బోధపడుచున్నది. దగ్గరచుట్టము, తనభార్యకు స్నేహితురాలు, పురోహితుని భార్య, రాజుభార్య వీరినిమాత్రము వదలి మిగలినస్త్రీలతో రతి సలుపవచ్చు నని గోణికాపుత్రులవచనము.

ఇక పురుషులకు సహాయముగా ఉండు దూతలవిషయ మును తెలుపుచున్నాను. దూతలయందు ముఖ్యముగ మూడు

విషయములను గుర్తించవలయును. 1. స్నేహము, 2. గుణము, 3. జాతి. బాల్యమునుండియు తనతో స్నేహముగానుండి, రహస్యములనుకూడ తెలిబుచ్చుచు పరోపకారబుద్ధికలవాడును, స్వభావమునందును యోగమునందును తనతో సమానమైన వాడును, తనకు, సహాధ్యాయుడుగ నుండినవాడును, నీవు నేను అను భేదము లేక సంచరించువాడును, తనతోపాటు బంధువువలె పెరిగినదాసికొడుకును, మొదలగువారినిమాత్రమే దూతకృత్యములకు ఉపయోగించవలయును. తనవంశముతో చాలకాలము నుండి స్నేహముగా నున్నవంశములోనివానిని, తనతో సమానమైన వయస్సుగలవానిని, తనయందు విశేష అభిమానము గలవానిని, వ్యభిచారమును దోషముగ పరిగణించనివానిని, తనమాటప్రకారము సంచరించువానిని, ఇతరుల వలలో పడనివానిని, రహస్యములు బయటపెట్టనివానిని దూతగా ఉపయోగించుకొనవలయును.

చాకలి, మంగలి, పువ్వులమ్మువాడు, పరిమళద్రవ్యము లమ్మువాడు, పానీయములను తయారుచేసి అమ్మువాడు, బిచ్చగాడు, సేవకుడు, తములపాకు లమ్మువాడు, కంసాలి, పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు మొదలగువారినికూడ దూతకృత్యములకు ఉపయోగింపవలయును.

పైన తెలుపబడినవారిస్త్రీలును, వారిస్నేహితులునుకూడ, దూతకార్యములకు తగినవారే యగుదురని వాత్స్యాయనుని అభిప్రాయము.

యువతీయువకులకు అత్యంతప్రీతిగ సంచరించుచు, నాయికయందు కొంచెము అధిక అభిమానము కలిగియుండి

ఇరువురి క్షేమమును ఎవరుకోరుచుందురో అట్టివారే దూతకార్య ములకు తగినవారును, కార్యసాధకులును అగుదురు. దూతలు చమత్కారముతో మాటలాడువారుగను, సమయమును తెలుసుకొని మాటలాడువారుగను, కార్యసాధనాచాతుర్యము గలవారుగను, యువతీయువకుల మనోభావములను గ్రహించ గల శక్తి గలవారుగను, తొందరపాటు లేనివారుగను, ఇతరుల మనోగతభావములను తెలుసుకొనగలుగుశక్తి గలవారుగను, చెప్పినవిధముగ సంచరించువారుగను, ఇతరులను మాయో పాయముచే వంచించగలుగు నేర్పరితనమును, ప్రదేశమును గుర్తించి అందుకు తగినవిధముగ సంచరించుకొనగలుగువారును, సమయమును గుర్తించగలుగువారును, త్వరలో కార్యసాఫల్య మునుపొందు ఉపాయములను ఆలోచింపగలవారును, సులభ ముగ కార్యమును సాధించగలుగువారును దౌత్యమునకు అర్హు లని గ్రహింపవలయును.

పైన తెలుపబడినవిషయములన్నియు బాగుగ గ్రహించి సరియైనదూతల సహాయము పొందుచు నాగరకుడు తనప్రియు రాలి అభీష్టములను గ్రహించుచు, దేశకాలపాత్రాను సార ముల ననుసరించి ప్రయత్నములు సలిపినచో ఎట్టి అసాధ్యపు స్త్రీతోనైనను సంభోగసౌఖ్యమును పొందవచ్చును.

---

# రతి రహస్యములు

స్త్రీపురుషుల లింగప్రమాణమునుబట్టియు, కామోద్రేక బలమునుబట్టియు, రతిచేయుకాలమునుబట్టియు శాస్త్రకారులు రతిని తరగతులుగ విభజించియున్నారు. ఇది స్త్రీ, యిది పురుషుడు అని దేనివలన తెలుసుకొనగలుగుచున్నామో దానికి లింగ మనిపేరు. అట్టిలింగము పురుషునకు సాగి పొడవుగను, స్త్రీకి లోపలిభాగమునను వ్యాపించి లోతుగను ఉండును. స్త్రీ పురుషుల లింగములయొక్క ప్రమాణములను కామశాస్త్రము వలనగాని, అనుభవజ్ఞానమువలనగాని తెలుసుకొనవలయును. లింగములయొక్క పొడవునుబట్టి పురుషులు శశజాతి, వృషజాతి, అశ్వజాతి అని మూడుతరగతులుగ విభజింపబడుచున్నారు.

సంభోగమునకు పూర్వము యువకునిలింగము బిర్రబిగిసి దారుఢ్యమును చెందినప్పుడు దానిప్రమాణమునుబట్టియే జాతులు యేర్పరుపబడినవి.

లింగము పొట్టిగానున్న పురుషుడు శశజాతికి చెందినవాడు. అంతపొడవు పొట్టి కాకుండా మధ్యరకముగ నున్న పురుషుడు మధ్యరకమునకు చెందిన వృషజాతికి చెందినవాడు. మిక్కిలి పొడవుగా నున్నలింగముగలవాడు అశ్వజాతికి చెందినవాడని యనబడును. ఈవిధముగ పురుషులలో మూడురకములవారు కలరని కామశాస్త్రకారులు నిర్ణయించిరి.

శశజాతిపురుషుని అంగము ఆరు అంగుళములపొడవును, వృషజాతిపురుషునిలింగము తొమ్మిది అంగుళములపొడవును,

అశ్వజాతిపురుషునిలింగము పన్నెండు అంగుళములపొడవును ఉండును. ఈ అంగములు ఈవిధముగ ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగ నుండును.

స్త్రీయొక్క మర్మాంగమునకు మన్మథగృహమని పేరు. భగము, పైనుండి ప్రారంభమై లోపలకు వ్యాపించి గర్భాశయములో పూర్తి యగుచున్నది. గర్భాశయము లింగాకారమువలె యుండును. గర్భాశయముయొక్క ముఖద్వారము భగద్వారముయొక్క ప్రక్కలనుందుకండములతో అమర్చబడి యుండును. భగరంధ్రము తిన్నగ నుండక కొంచెము వంపులు తిరిగి కోణాకారములో నుండును. సామాన్యముగ వెలుపలి భాగము మూడు అంగుళములపొడవు గలిగియుండును. ఇది అందరకును ఒకే పరిమాణములో నుండదు. యోని కొంచము ఎత్తుగయున్నయెడల భగరంధ్రము దానికి తగినటులుగ లోతుగ నుండును.

యోని స్వభావసిద్ధముగ పెద్దదిగను చిన్నదిగను అగుటకు శక్తికలిగియున్నది. అందువలననే ఎంతటిపరిమాణముగల మేఢ్రమునైనను మిక్కిలి సులభముగ లోపల నిముడ్చుకొను శక్తిని కలిగియున్నది.

పురుషులనువారి అంగప్రమాణములనుబట్టి ఏవిధముగ మూడుతరగతులుగ విభజించిరో, ఆదేవిధముగ స్త్రీలనుకూడ వారి అంగప్రమాణములనుబట్టి మూడుతరగతులుగ విభజించియున్నారు. అనగా యోనిపరిమాణమునుబట్టి స్త్రీలు మృగి, బడబ, హస్తిని అను మూడుతరగతులుగ నుందురు. యోనియొక్కలోతు హెచ్చుతగ్గులనుబట్టి యీజాతులను ఏర్పరచిరి.

మృగిజాతి స్త్రీయోని ఆరు అంగుళములలోతు కలిగి యుండును. బడబజాతిస్త్రీయోని తొమ్మిది అంగుళముల లోతును, హస్తినీజాతి యువతియొక్క యోని పన్నెండు అంగుళములలోతును యుండును. వాత్స్యాయనుడు స్త్రీపురుషు లలో జాతులను ఈవిధముగ నిర్ణయించెను.

కాని కొక్కోకుడు స్త్రీలలో పద్మిని, చిత్రిణీ, శంఖిణీ, హస్తిని అను నాలుగుజాతులు కలవని తెలిపెను. కొక్కోకుడు స్త్రీపురుషులలో జాతులను అంగప్రమాణములనుబట్టి నిర్ణయిం చక వారి రూపమునుబట్టియు, స్వభావమునుబట్టియు, భావము లనుబట్టియు, రతిసలుపుకాలమునుబట్టియు నిర్ణయించినట్లు తోచు చున్నది.

స్త్రీలలో పద్మినీజాతిస్త్రీ ఉత్తమురాలనీ, చిత్రిణీ మధ్యమ యనియు, శంఖిణీ అధమయనియు హస్తినీ, అధమాధమయనియు కొక్కోకుడు తెలిపియుండెను.

### పద్మినీజాతిస్త్రీ లక్షణములు

పూర్ణచంద్రునిబోలు ముఖమును, మనోహరమైన రూప మును, లేడివంటికన్నులును, క్రేగంటిచూపులును, శుక్లపక్ష చంద్రునివలె నుండుకనుబొమలును, సంపెగపూవుతో సమాన ముగయుండు నాశికయు, ముత్యములబోలు పలువరుసయు, తామరతూడులనుబోలు బాహుద్వయంబును, హంసనడకలను పరిహాసము జేయునడకలును, యెర్రతామరరంగుతో నొప్పారు అరచేతులును, తామరరేకువలె చూచుటకు సొంపుగనుండు మదనమందిరమును, సన్నని నడుమును, దొండపండునుబోలిన యధరమును, తామరమొగ్గవలె మృదువుగనుండు శరీరమును,

పూలబంతులవలెనుండు కుచద్వయమును, ఇసుకతిన్నెలవలె ఉన్నతములైన పిరుదులును, శంఖమునుబోలిన మెడయు, అరటి స్తంభములనుబోలిన తొడలును, కోమలములగు చేతివ్రేళ్లును, చుక్కలశృంగారమును మించు గోళ్లును, ఏనుగుతొండములవలె నుండుపిక్కలును, తాబేళ్లవంటి మీగాళ్లును, మెఱుపుతీగవంటి కాంతియు, తుమ్మెదలచందమున నొప్పు తలవెంట్రుకలును, తామరపూవువంటిసుగంధమును వెదజల్లుశరీరమును కలిగి యుండును. సంగీతమనిన అధికమగుప్రేమ కలిగియుండును. ధర్మ బుద్ధి కలిగియుండును. పలుకులు చిలుకపలుకులను జ్ఞాపకము జేయుచుండును. మణిహారముల ధరించును, నాలుగవజామునందు అనగా తెల్లవారుజామునందు రతికేళికొరకు ఉబలాటము చెందుచుండును. పాంచాలజాతిపురుషునితో రతిసలుపుటకు ఉత్సాహపడుచుండును. ఆనందసంధాయకములైన చూపులు కలిగి, అనుమానములేని హృదయముతో, నిండుప్రేమతో మహానందసంధాయకముగ రతి సలుపుచుండును. అట్టి నిరుప మానసౌఖ్యసమయమున ఆనందపారవశ్యముచే తనప్రియుని బాగుగ హత్తుకొని, సిగ్గుచే ఒకింత కనులుమూయుచు, ప్రియుని ఆనందపారవశ్యునిగ జేసి, ఆనందడోలికల నూగించి లాలించి తేలించుచుండును. ఇది పద్మినీజాతిస్త్రీలక్షణములు.

## చిత్తినీజాతిస్త్రీ లక్షణములు

సమమైన శరీరమును, సన్నని నడుమును, చక్కని నడకయు, ఆనందసంధాయకమైన చూపులును, గుండ్రనిబంతులవలె నుండు చన్నులును, ఘనమైన పిరుదులును, చిలుకముక్కువంటిముక్కును, మీనములవంటి నేత్రములును, గుండ్రని పిక్కలును కొంచెము

పెద్దవిగనుండు పెదవులును కలిగియుండును. రతిజలము కొంచెముగ దుర్వాసన కొట్టుచుండును. కంఠముమీద మూడు తిన్నని రేఖ లుండును. సాహసముకలదియు, చకోరపక్షివలె మాట్లాడునదియు, నాట్యము సంగీతము మొదలగుకళలయందు నేర్పుకలదియు, చూచుటకు గుండ్రముగనుండి మంచిలోతు గలిగి సదా స్రవించుచు రతిని నిర్విరామములేక కోరుచుండు మదనమందిరముకలదియు నగును. మరియు మదనగృహము మెత్తగ యుండి, కొంచెముగ రోమములచే కప్పబడియుండును. చంచలదృష్టియు, యౌవనము రాకముందే సంభోగమునందు ప్రీతియు, రంగువస్త్రములు ధరించుటయందు ప్రీతిగలదియు, పువ్వులు ధరించుటయందు ఆసక్తికలదియు, వయ్యారముగ నడచునదియు, ఉంగరములు తిరిగినముంగురులుకలదియు నగును. చౌశీతిబంధములతో చిత్రవిచిత్రముగ రతులు సలుప నుత్సాహపడుచుండును. మొత్తముమీద ఈలక్షణములు పద్మినీజాతిస్త్రీకి తెలుపబడినలక్షణములకు ఒకమెట్టుమాత్రమే తక్కువగ నుండును. సదా సంచారమును కోరుచుండును. చిత్తినియనగా అందగాళ్లకు తంగేడుచెట్టునందున్న జొన్నవంటిదని భావము. అనగా మిక్కిలి సులభముగా లభించునని తెలుసుకొనవలయును. రతిక్రీడాసమయములో మాటిమాటికి నడుము పైకి ఎత్తుచుండును. క్రిందుమీదు అగును. తొడలతో పురుషుని నొక్కిపట్టుచుండును. ప్రీతితో తానే ఉపరతి సలుపుటకు ప్రయత్నము సలుపుచుండును. రాత్రి తొలిజాముననే రతికేళిని కోరుచుండును. పురుషవియోగమును సహించలేకుండును. ఉద్రేకమును కలిగించుచేష్టలతో చమత్కారపుమాట

లతో మరపురాని రతికేళిని సలుపును. అనేకమంది ప్రియులను కలిగియుండును. చంచలప్రేమ కలదిగ నుండును. ఇది చిత్తినీ జాతిస్త్రీ లక్షణములు.

## శంఖినీజాతిస్త్రీ లక్షణములు

బలమైనశరీరము, పెద్దపాదములు, కోపస్వభావమును, పుష్పములయందు అధికమైనప్రేమ, మన్మథమందిరముచుట్టును దట్టముగ పెరిగినవెంట్రుకలును కలిగియుండును. అలంకారముల యందు మిక్కుటమైనప్రేమ కలిగియుండును. సంభోగకాలమున [illegible]లము తక్కువగ స్రవించును. శరీరము కొంచెము ఉష్ణముగ నుండును. రతిసమయములో భర్తను నఖక్షతములు చేయుచుండును. ఇతరులదోషములను వినుటకు ఆసక్తిచూపుచుండును. కంఠము శ్రావ్యముగ నుండదు. ఎల్లప్పుడు ఏదో ఒకవిషయమునుగురించి విచారించుచునే యుండును. కోపముగా చూచుచుండును. సున్నని శరీరమును, పెద్దవిగానుండు చన్నులును, ఆకర్ణాంతములైన నేత్రములును, కఠినముగనుండు పాదములును, శంఖమునుబోలిన కంఠమును, ముచ్చటగొలుపు కనుబొమలును, మిక్కిలి నలుపైన తలవెంట్రుకలును కలిగియుండును. కారపుపదార్థములను తినుటకు అపేక్షకలిగియుండును. సువాసన ద్రవ్యములను తరుచు ఉపయోగించుచుండును. భర్తయందు గాఢమైనప్రేమ కలిగియుండును. నీలపురంగుచీరలను ధరించుటకు ఉబలాటపడుచుండును. తరుచు సంభోగమును కోరుచుండును. రతికి పూర్వము మదనమందిరమును తరుచు బయటపరచుచుండును. ఉపరతికొరకు ఉబలాటపడుచుండును. మూడవజామునందు కామోద్రేకమును అధికముగ కలిగియుండును. శశాంకు

దనుపురుషునితో రతిసలుపుటకు కోరుచుండును. ఇవి శంఖినీ జాతిస్త్రీయొక్క లక్షణములు.

## హస్తినీజాతిస్త్రీ లక్షణములు

తిన్నగ నడవలేక కొంచెము వంకరగ నడచుచుండును. కాలివ్రేళ్లు కొంచెము వంకరగను పొడవుగను ఉండును. పాదములు పొట్టిగను, నెరికురులు నీలముగను, తగుమాత్రమైన శరీరమును ఉండును. శరీరమును, మదనగృహమును ఏనుగు మదమువంటివాసన కొట్టుచుండును. భోజనప్రియురాలు. పెదవులు పెద్దవిగను, కంచుకంఠమును, చంచలస్వభావమును కలిగియుండును. మదనమందిరముమీాద రోమములు తక్కువగను, యోనిమిక్కిలి లోతుగను, చాల వెడల్పుగనుఉండును. గాఢముగరతిసలిపిననేగాని తృప్తిచెందదు. చంకలు గబ్బు కంపుకొట్టుచుండును. చన్నులు కుంభములవలె నుండును. శిరోజములు పొట్టిగను, నుదురు ఎత్తుగను, తొడలును నడుమును పెద్దవిగను నుండును. బాగుగ బలసినశరీరమును, కోమలహృదయమును, విశాలమైనకన్నులును, మృదుమధురమైనకంఠమును, కపటములేని ఆలోచనలును కలిగియుండును. బాగుగ రతిచేయగలుగువానిని గాఢముగ ప్రేమించును. గులాబిపుష్పమువంటి రంగుగలచీరలు ధరించుచుండును. మదనమందిరమును బయటపెట్టుటకు అంగీకరింపదు. మనస్సునందుగల కామోద్రేకమును పైకి కనిపించనీయక ప్రవర్తించుచుండును. ఆలింగనమునందు అధికప్రేమ చూపుచుండును. సుందరముగనుండి, బాగుగ బలసినపురుషుని ప్రేమించుచుండును. రెండవజామునందు రతిని కోరుచుండును. ఇవి హస్తినీజాతిస్త్రీలక్షణములు.

## సమరతి

1. శశజాతిపురుషుని అంగము ఆరు అంగుళములపొడవు ఉండునని యిదివరలో తెలుపబడెను. మృగీజాతిస్త్రీయొక్క యోనికూడ ఆరు అంగుళములలోతు ఉండును. వీరిరువురును రతిసలిపినయెడల సమరతి యనబడును. అనగా ఒకేపరిమాణ ములుగల కామజననాంగములుగల కామినీకాముకులు రతికేళి సలిపినయెడల పరిపూర్ణమగుసౌఖ్యమును పొందగలుగుదురు. వీరిరువురును కలిసి చేయురతి సమరతి యనబడును.

2. వృషజాతిపురుషుని అంగము తొమ్మిది అంగుళముల పొడవు ఉండును. బడబజాతికి చెందిన స్త్రీయొక్క యోనికూడ తొమ్మిది అంగుళములలోతు ఉండును. వీరిరువురును కలిసి సంపర్కముచేసినచో సమరతియే యనబడును, ఏలనన ఆయా జాతిపురుషులయొక్కయు ఆయాజాతిస్త్రీలయొక్కయు అంగ ములపరిమాణములును, లావును సమానముగ నుండుటవలన విశేషసౌఖ్యప్రదమైనదిగ నుండును.

3. అశ్వజాతిపురుషునియొక్క అంగము పన్నెండు అంగుళములపొడవు కలిగియుండును. హస్తినీజాతిస్త్రీ యోని కూడ పన్నెండు అంగుళములలోతు కలిగియుండును. వీరిరు వురును కలిసి సంభోగముచేసినయెడల సమరతి యనబడును.

అందుచే పైనచెప్పబడినవిధముగ సమరతులు మూడు విధములుగ ఏర్పడుచున్నవి మొత్తముమీద సమరత మనగా స్త్రీయొక్క యోనికి పురుషునిసాధనము సరిగ సరిపోవునను భావము.

"విపర్యయేణ విషమాణిషట్":—అని వాత్స్యాయనుని సూత్రము. అనగా స్త్రీపురుషుల కామజననాంగములు సరిసమానములు కానియెడల వారిసంభోగము ఎగుడుదిగుడులుగ నుండును. సమానముగాని సంపర్కములను ఆరురీతులుగ వర్ణించియున్నారు. వీనినే విషమసంపర్కయోగము లని చెప్పుదురు.

స్త్రీయోనియొక్క లోతు, వెడల్పులకంటె పురుషుని అంగము ఎక్కువ పొడవుగను, లావుగను ఉన్నచో పురుషుని సాధనము స్త్రీయోనిని చించుకొని లోపలకు బలవంతముగ ప్రవేశించును. దీనిని 'ఉచ్చరతి' యందురు. అనగా బిగువుగట్టిగల రతి యని భావము. అవి రెండురకములు: 1. అశ్వజాతి పురుషునికి బడబజాతిస్త్రీతోను, 2. వృషజాతిపురుషునికి మృగీజాతిస్త్రీతోను సంభోగము జరిగినచో ఉచ్చరతి యనబడును.

"విపర్యయే ద్వేపునర్నీచరతే":—పైనచెప్పబడిన విధానమునకు, అనగా చాల పొట్టిఅంగముగలపురుషుడు, చాల లోతుగ నుండుయోనిగలస్త్రీతో సంపర్కము జరిపిన, అది నీచరతి యనబడును. అనగా పురుషునిసాధనము యోనికి చాలక పోవుటవలన 'నీచరతి' యగును. ఈనీచరతి రెండువిధములు; 1. శశజాతి యువకుడు అంతకంటెను లోతైన భగముగల బడబజాతినాయికతో కలిసినను, వృషజాతివాడు హస్తినీజాతియువతితో సంభోగించినను నీచరతి యనబడును.

ఉచ్చరతములో పురుషునిలింగము స్త్రీయోని లోతునకంటెను పొడవుగ నుండును గనుక, లింగమును విశేషశ్రమతోటియు, కష్టముతోటియు యోనిలోనికి ప్రవేశింపజేయవలసియుండును.

అశ్వజాతిపురుషుని సాధనము పన్నెండు అంగుళముల పొడవు ఉండును. మృగీజాతియొక్క యువతియోని ఆరు అంగుళములలోతుమాత్రమే యుండును. కనుక నిట్టి సమయములలో సంభోగమును సౌఖ్యముగ చేయుటకు వీలులేదు. స్త్రీకివిశేషబాధాకరముగ నుండును. పురుషునికికూడ యోనిలో మేహనమును జొనుపుటకు విశేష శ్రమదాయకముగనే యుండును.

పైనచెప్పబడిన నీచరతిలో పురుషునిలింగము పొట్టిగా నుండును. యోని చాల లోతుగ నుండును. అందుచే లింగము యోనినంతను ఆవరించలేక సంపర్కము పైపైననే జరిగిపోవును. దానివలన స్త్రీకి తృప్తిలేకనే సంపర్కము జరిగిపోవును.

ఉచ్చరతియు, నీచరతియు సౌఖ్యములైనవిగావు. ఈరతులలో మొదటిరకమైన ఉచ్చరతియందు లింగము పరిమాణములో మిక్కిలి పెద్దదిగ నుండుటవలన, గట్టి బిగువుగల సంపర్కమువలన లింగము యోనియొక్కలోపలిభాగములో చుట్టును మిక్కిలి బిగువుగ రాచుకొనుచు, స్త్రీమానమునకు అధికమైనబాధను కలుగజేయును.

నీచరతియందు అనగా వదులై బిగువులేనిసంపర్కములో స్త్రీయోనిలో పురుషునిమదనదండముయొక్క స్పర్శసుఖము తృప్తికరముగ నుండదు గనుక స్త్రీకి సరియైనతృప్తి కలుగుచుండుటలేదు. అందువలన ఉచ్చ, నీచరతులను శాస్త్రకారులు నీచరతులుగ పరిగణించుచున్నారు.

కాన నీచరతికంటె ఉచ్చరతి మేలని శాస్త్రకారుల అభిప్రాయము. ఏలన ఉచ్చరతిలో స్త్రీ ఉత్ఫుల్లకాదులవలన భగమును తెరచుకొనియున్నచో పురుషునిసాధనము యోనిలోతుకంటె ఎక్కువ పొడవుగా నున్నందువలన స్త్రీకి తృప్తికలిగించుటకు సామర్థ్యము కలదగును. ఇక నీచరతియందు స్త్రీ సంపుటికాదులవలన యోనిని ముడుచుకొనియున్నను సాధనము చిన్నదిగా నుండుటవలన స్త్రీని తృప్తిపఱుపజాలదు. అందువలన చిన్న అంగముగలవాడు ఎంతటికామోద్రేకము కలిగియున్నను, ఎంతసేపు రతిచేయగలిగినను స్త్రీకామమును తృప్తిపరుపలేడు. అందువలన స్త్రీలు అట్టి పురుషుని ఏహ్యభావముతో చూచుచుందురు.

సమరతులు మూడువిధములు

1. శశజాతిపురుషుడు — మృగిజాతిస్త్రీ
2. వృషజాతిపురుషుడు — బడబజాతిస్త్రీ
3. అశ్వజాతిపురుషుడు — హస్తినిజాతిస్త్రీ

మధ్యరతులు నాలుగువిధములు

1. అశ్వజాతిపురుషుడు — బడబజాతిస్త్రీ
2. వృషజాతిపురుషుడు — మృగిజాతిస్త్రీ

విషమరతులలో మధ్యరతులు నీచరతులు

1. శశజాతిపురుషుడు — బడబజాతిస్త్రీ
2. వృషజాతిపురుషుడు — హస్తినీజాతిస్త్రీ

విషమరతులలో అధమరతులు రెండువిధములు

1. ఉచ్చతరరతి:—అశ్వజాతిపురుషుడు - మృగిజాతిస్త్రీ
2. నీచతరరతి:—శశజాతిపురుషుడు - హస్తినీజాతిస్త్రీ

ఈవిధముగ ఆరువిషమరతులయందును మధ్యరతులు నాలుగు ఏర్పడుచున్నవి. ఆనాలుగు మధ్యరతులయందును ఉచ్చరతులు రెండువిర్పడుచున్నవి. నీచరతులు రెండువిధములు. అవి 1. ఉచ్చతరరతి, 2. నీచతరగతి. ఈవిధముగ విషమరతులు ఆరువిధములుగ కలుగుచున్నవి.

గట్టిబిగువులేని సంభోగమును, వదులుబిగువులేని సంభోగమును మధ్యతరగతికి చెందినవి యగుచున్నవి. గట్టి బిగువుగల రతివలన స్త్రీ అమితసౌఖ్యమును, సంతోషమును చెందుచున్నది. కామేచ్ఛసంతుష్టి దీనియందు ఆమె పరిపూర్ణ ముగ పొందగలుగుచున్నది. ఇందు యువతి తనతొడలను బాగుగ విప్పి లింగము యోనిద్వారములోనికి సులభముగ ప్రవేశించుటకు సహాయపడుచున్నది.

పైనచెప్పబడిన సంభోగము లన్నిటియందును పొడవు నందును వెడల్పునందును సరిసమానముగనుండు యోనియు లింగమును గలవారిసంభోగమే చాల సౌఖ్యకరమైనది. ఏలన అంగములన్నియు సమానమైన పరిమాణములను కలిగి యుండును. అంగములన్నియు సమానముగను చక్కని సౌష్ఠ వము కలవిగను నుండుటచే యువతీయువకులు సంభోగము చేసుకొనుటవలన అమితసౌఖ్యమును, తన్మూలమున ఆనంద మును పొందగలుగుచున్నారు. ఈ 'సమరతియే' ఉత్తమమైన దని శాస్త్రకారులు శ్లాఘించుచున్నారు.

స్త్రీలయొక్క భగరంధ్రము పరిమాణము పెద్దది యగుట కును, చిన్నది యగుటకును స్వభావసిద్ధమగు శక్తిని కలిగి యున్నది. సంభోగముయొక్క తాత్పర్యము అన్యోన్యసౌఖ్య

మును పొందుటకు గాకపోయినను ఒకరిప్రేమను ఒకరు పొందు టకు చేయునట్టి సంభోగము 'సహాచర్య' సంభోగ మనబడును. ఇట్టిసమయమునందు కామేచ్ఛను ఆలింగనము, చుంబనము మొదలగునవి ప్రేమఉద్రేకముతో చేయబడు కృత్యములచే ప్రోత్స హించుచుండవలయును. ఇదియే కృత్రిమరాగ మనబడును.

ఒకపురుషుడు ఒకస్త్రీతో సంభోగముచేయుచున్నప్పుడు, సంభోగసమయములో తాను ఇదివరలో బాగుగ ప్రేమించిన వేరొకవనితను మనస్సులో నుంచుకొని ఆమెతో రమించు చున్నటుల తలంచుచు ఆనయించుచుండును. ఇది 'అన్యభావ సంభోగక్రీడ' యనబడును. దీనినే 'వ్యవహిత రాగ'మనికూడ అందురు.

సంభోగక్రియయందు అనేకవిధములు జరుగుచుండును. అంగములు తాకునట్లుచేయుట, ఒకదానితో నొకటి రాచు కొనునట్లుచేయుట, లోనికి ప్రవేశింపజేయుట, యింద్రియస్ఖల నము అని సంభోగములో నాలుగువిధములైన స్థితులు ఏర్పడుచుండును.

1. తాకుట:—ఇందు లింగము యోనిమీదను చేర్చ బడుట; ఒకటి లింగము యోనిని దృఢముగ తాకుట రెండవది. సంభోగమున కిదియే మొదట జరుగుపని. స్త్రీపురుషులు తగిన రీతిలో నుండిననేగాని సంభోగము చేయుటకు వీలుపడదు.

2. రాచుకొనుట:—మదనమండమును యోనిభాగము మీద నుంచి రాచుట. లింగమును చేతితో పట్టుకొని మదన మందిరద్వారమువద్ద నుంచి అటునిటు త్రిప్పవలయును. ఇది

'మంథన' మనబడును. ఇట్టికృత్యము యువతికి కామోద్రేకమును రేకెత్తించును. వెంటనే ఆమె భగరంధ్రమంతట ద్రవమువంటిపదార్థము ఊరును. దానివలన యోనిద్వారము తడిదై లింగము సులభముగను, సౌఖ్యముగను, యోనిలో ప్రవేశించుటకు అవకాశము కలుగుచున్నది. తరువాత మదన దండమును నెమ్మదిగ యోనిలోనికి ప్రవేశింపజేయవలయును. లింగమును యోనిలోనికి ఎన్నడును మోటుతనముగ ప్రవేశింపజేయరాదు. ఆవిధముగ లింగమును యోనిలోనికి ప్రవేశింపజేసినయెడల స్త్రీకి యోనిరంధ్రములో భరింపలేనిబాధను కలుగజేయును. కొన్నిసమయములలో, లోపలిభాగములో గాయముకూడ కలుగవచ్చును. కనుక లింగమును లోపలికి కొంచెము కొంచెముగ ప్రవేశింపజేయవలయును. అట్టిపరిస్థితిలో చుంబనము, నఖక్షతము, దంతక్షతము మొదలగు ప్రక్రియలు సలుపుచునేయుండవలయును. భార్య చిన్నవయస్సు కలదై యుండినప్పుడు ప్రథమ సంభోగసమయమున భర్త యువతి యొక్క యోనిరంధ్రములో చేతివ్రేళ్లతో సువాసనతైలమునో, వెన్ననో పూసి, తనలింగముసకూడ ఆతైలమును అద్దుకొని పిమ్మట లింగమును యోనిలోనికి ప్రవేశింపజేయవలయును. ఆవిధముగ తనలింగమునంతయు యోనిలోనికి ప్రవేశింపజేయవలయును.

"లింగమును యోనిలోనికి ప్రవేశింపజేయు విధానము"—లింగమును యోనిలోనికి మెల్లగ కొంచెము కొంచముగ ప్రవేశింపజేయవలయును. ఆవిధముగ కొంత భాగమువరకు యోనిలోప్రవేశింపజేసి మరల వెనుకకు లాగ

వలయును. మరల లోనికి ప్రవేశింపజేయవలయును. ఈ విధముగ కొంచెము కొంచెముగ ప్రవేశింపజేయుచు మరల వెనుకకు లాగుచు పూర్తిగ లింగమును, మదనమందిరమును ప్రవేశింపజేయవలయును. ఈవిధముగ చేసినయెడల స్త్రీకి విశేష సౌఖ్యకరముగ నుండును.

"రతినిరూపణ":—ఇంతవరకును స్త్రీ పురుషుల అంగ ప్రమాణము లను రతివిశేషములు తెలుపబడెను. ఇక యువతీ యువకుల భావములనుబట్టి రతివిశేషములను తెలుపుచున్నాను. స్త్రీపురుషులస్ఖలనముకంటె భావప్రాప్తి ముందువిషయము గనుక భావప్రాప్తినిగురించి తెలుపుచున్నాను. ఇట్టిభావము రెండు విధములుగ నుండును. అందు మొదటిది సంభోగించవలయునని యువకునకు కలుగుకోరిక; సంభోగమునకు చివరభాగములో స్ఖలనమగుటకుపూర్వము కలుగుభావము రెండవది. ఈరెండువిధములగు భావములును రతిని నిరూపించుచుండును.

ఇట్టి భావసురతము మృదు వనియు, మధ్యమ మనియు, అధిక మనియు మూడువిధములుగ నుండును. ఇదియే సురత కాలమనియు, సంభోగకాలమనియు వాడబడుచుండును.

ఏపురుషుడు స్త్రీతో కలియవలయు నని అధికమైనకోరిక, ఆనందము, ఇంద్రియపటుత్వమును కలిగియుండి చుంబనములను, నఖక్షతములను, దంతక్షతములను సహించగలుగునో వాడు 'చండవేగు'డనబడును. అట్టిలక్షణములు సామాన్యముగ నున్నచో 'మధ్యవేగు' డనబడును, సంభోగమువిూద తక్కువ భావము గలిగి, రతిజలము తక్కువగనుండి నఖక్షతములను, దంతక్షతములను భరించలేనిచో 'మందవేగు' డనబడును. ఈవిధ

ముగ రతికాలమునుబట్టి పురుషులు మూడుతరగతులకు చెందినవారుగ నున్నారు.

"తద్వత్కాలతోపి శీఘ్రమధ్యచిరకాలానాయకాః":— అంగప్రమాణమునందలి హెచ్చుతగ్గులనుబట్టి 'రతులను' ఏవిధముగ తొమ్మిదిరకములుగ విభజించిరో, ఆవిధముగనే కాలమునుబట్టికూడ రతిని 'తొమ్మిదివిధములుగ' విభజించిరి. అనగా శీఘ్రముగ స్ఖలనమైనయెడల వాడు శీఘ్రవేగుడనియు, మధ్యరకముగ స్ఖలనమైనయెడల మధ్యవేగుడనియు, చాలకాలమునకు స్ఖలనమైన చిరవేగుడనియు (చండవేగుడనియు) చెప్పబడుచుండును. స్త్రీలవిషయములోకూడ ఈవిధముగనే చూచుకొనవలయును.

"ఔద్దాలకుని అభిప్రాయము":—వీర్యము స్ఖలనమగు సమయములో పురుషుడు ఏవిధమగు ఆనందమును, సౌఖ్యమును పొందుచున్నాడో; ఆవిధమగు సౌఖ్యమును ఆనందమును స్త్రీ పొందుచుండుట లేదు. అనగా సంభోగమునందు పురుషుడు పొందు సౌఖ్యమునకును, స్త్రీ పొందు సౌఖ్యమునకును భేదము కలదని తెలుసుకొనవలయును. ఏలన స్త్రీలకు ఇంద్రియ స్ఖలన మనునది లేదు. స్త్రీలకు వీర్య మనునది లేకపోవుటయే యిందులకు కారణము. స్త్రీలకు యోనిలో ఒకవిధమైన దురద కలుగును. ఆదురదను తీర్చుకొనుటకు స్త్రీకి పురుషునియొక్క సహాయము అవసరమగుచుండును. సంభోగసమయములో పురుషుడు తనలింగమును ముందుకుత్రోయుచు వెనుకకు లాగుచుండుటవలన ఆదురద నివారణయగుచున్నది. ఆదురద నివారణకానిచో మనస్సున ఒకవిధమగు ఉద్రేకము జనించి అది

క్రమముగ వృద్ధియగుచుండును. ఒకవనితకు అట్టిదురద తన భర్తవలన నివారణకానిచో ఆసతీపతులమధ్య ఎల్లప్పుడును ఏదోవిధముగ కలహములు ఏర్పడుచుండును. అట్టి తనభర్త యందు గౌరవమును చూపక మితిమీరి సంచరించుచుండును. తనకోరికను భర్తవలన పూర్తిచేసుకొనలేక పరపురుషసాంగత్యమును అపేక్షించుచున్నది కనుక పురుషుడు పొందు కామసౌఖ్యమునకును స్త్రీ పొందు సౌఖ్యమునకును వ్యత్యాసము కలదని బోధపడుచున్నది.

కేవలము దురద పోగొట్టుకొనుటకు పురుషునితో సంభోగము చేయుట ఎందులకు?. ఆపనికి వేరుసాధనములు లేవా? పుల్లతో చెవిలోదురద పోగొట్టుకొనినట్లు పురుషుని మేహనమువలన దురదపోగొట్టుకొనుచు, నేను నాప్రియునిచే ముద్దుపెట్టుకొనబడుచున్నాను, నఖక్షతములు చేయబడుచున్నాను, చుంబనము చేయబడుచున్నాను, ఆలింగనము చేసుకొనబడుచున్నాను, సంభోగింపబడుచున్నాను అని పురుషుని యందు మనస్సులో ప్రేమ యుంచుకొనుచు స్త్రీ, పురుషునితో గూడి సుఖమును పొందుచున్నది. ఇదియే 'అభిమానసుఖ' మన బడును. మామూలుగ దురద వదల్చుకొనుట 'రూపసుఖ' మనబడును. అభిమానసుఖమును, రూపసుఖమును కలసినప్పుడే విశేషసౌఖ్యము కలుగును. అట్టి విశేషసౌఖ్యమువలననే స్త్రీ ఆనందపరవశురాలగును. అట్టి ఆనందము ఇతరసాధనములతో దురదపోగొట్టుకొనునప్పుడు కలుగదు. స్త్రీలకు శుక్రమనునది లేకపోవుటచే స్ఖలనసౌఖ్యమును పొందలేరు. స్త్రీలకు సౌఖ్యము

సంభోగము ప్రారంభించినదిలగాయితు కలుగును. పురుషునకు మాత్రము స్ఖలనసమయమందే విశేషఆనందము కలుగును.

పురుషుడు పొందు రతిసౌఖ్యమును స్త్రీ పొందుటలేదని గ్రహించుట యెట్లు? పురుషునిప్రేమ మనస్సునకు సంబంధించి నదిగనే యుండుటవలనను, ఇంద్రియములవలన గ్రహించలేనివిష యమును ప్రత్యక్షముగ తెలుసుకొనుట అసాధ్యమగుటచేతను స్త్రీపురుషుల కామసౌఖ్యమును తెలుసుకొనుట అసాధ్యము. అందుచే స్త్రీపురుషులు ఒకరిసౌఖ్యమును ఒకరు గ్రహించలేరు. కనుక అట్టివిషయమును వ్రాయుటకూడ దుర్లభమే యగును.

పురుషుడు స్ఖలనమైనవెంటనే రతిక్రియను పూర్తిగ ఆపివేయుచున్నాడు. పిమ్మట స్త్రీ యింకను రతిచేయమని కోరి నను, అట్టిశక్తిలేక చేయలేకపోవును. కాని స్త్రీలు, పురుషుల వలెగాక మరల ఎంతసేపుఅయినను రతిచేయగలుగుదురు. స్త్రీలకు కూడ పురుషులవలె స్ఖలనసుఖ మున్నయెడల, అట్టిస్ఖలనానం తరము సంపర్కమును విడువవలయునుగదా! కాని ఒకపురు షుడు విరమించినప్పుడు స్త్రీబుద్ధి మరొకపురుషుని కోరుచునే యుండును. ఒకపురుషునితో సంభోగము సలిపి, స్త్రీమరల వెంటనే వేరొకపురుషునితో సంపర్కించునట్లు వినుచుందుము. స్త్రీలు ఎంతమందిపురుషులతో కూడినను తృప్తిచెందరని పెద్దలు చెప్పు చుందురు. అందుమూలముననే సంభోగసమయమున స్ఖలనసుఖ మును అనుభవించి సంభోగమునుండి విరమించుట యనునదిలేక పోవుటవలననే పురుషుడు అనుభవించు స్ఖలనసౌఖ్యము స్త్రీకి ఉండదు.

స్త్రీలు తమంతట తాము సురతమునుంచి విరమింపరు. దీనికి కారణము వారికి స్ఖలనము లేకపోవుటయే యని గ్రహించవలయును. కాని రతిసౌఖ్యమును స్త్రీకూడా పురుషునివలెనే పొందుచున్నది. చాలసేపు రతిచేయగలిగిన పురుషుని స్త్రీ గాఢముగ ప్రేమించి మెచ్చుకొనుచుండును. స్త్రీ అల్పరతిగల పురుషుని హీనముగ చూచును. అనగా తనమనస్సునకు తృప్తికలుగువరకు రతిచేసిన ఆనందమును, భావతృప్తి కలుగనిచో విచారమును పొందుచుండును. పురుషాయితములో స్త్రీ చాలసేపు రతిసలిపి రమింపజేసినయెడల పురుషుడు ఆనందించును. త్వరలో పురుషాయితమునుంచి విరమించిన స్త్రీని ద్వేషించుచున్నాడు. ఈవిషయమునుబట్టి ఆలోచింపగా రతిసౌఖ్యము యిరువురును సమానముగనే పొందుచున్నట్లు కనబడుచున్నది.

అనురాగప్రదర్శనము భావప్రాప్తికి సూచనకాదు. అనురాగమనునది స్త్రీపురుషు లిద్దరియందును కనిపించుచునే యుండును.

"కండూతిప్రతీకారోపి హి దీర్ఘకాలం ప్రియ ఇతి":— అని వాత్స్యాయనుని వచనము. యోనియందలి దురదను పోగొట్టుట స్త్రీలకు చాల ఆనందదాయకము. అదియునుగాక స్ఖలనసుఖముగాని అందుకు సమానమైన సౌఖ్యముగాని కలుగజేయును.

"ఏతదుపపద్యతఏవ":—పై విషయమునుబట్టి ఆలోచింపగా స్త్రీ స్ఖలనసౌఖ్యమును పొందుటవలన భావతృప్తిని పొందుచున్నదా? లేక దురదవదల్చుకొనుటవలన ఆనందమును పొందుచున్నదా? అనువిషయములు ఆలోచనీయముగ నున్నవి.

స్త్రీకి స్ఖలనసౌఖ్య మున్నదా లేదా యనువిషయము ఇట్టి వాదములవలన తెలుట అసాధ్యము. కనుక రతినుండి విరమించుట, విరమించకపోవుట అనువిషయమునుమాత్రమే గ్రహించవలయును. కాని స్త్రీలయందు పరిపూర్ణముగ రతినుండి విరమించుట యనునది కన్పించుచుండుటలేదు. ఇంతవరకు చెప్పబడినది ఔద్దాలకుని అభిప్రాయము.

ఇక నీ విషయములో బాభ్రవ్యుని అభిప్రాయము తెలుపుచున్నాను. స్త్రీపురుషు లిరువురును రతిసౌఖ్యమును అనుభవించుచున్నారు. స్త్రీ సంభోగమును ప్రారంభించినదిలగాయితు తెంపులేక, పురుషునిచే సంభోగింపబడుచు ఊటవలె రతిజలమును వదలుచునేయుండును. దానివలన సంభోగప్రారంభములగాయితు అభిమానసుఖమును అనుభవించుచు పురుషునివలె స్ఖలనసౌఖ్యమునుకూడ పొందుచున్నది. పురుషుడు మాత్రము స్ఖలనసమయములోమాత్రమే ఆభిమానికసౌఖ్యమును పొందుచున్నాడు.

ఈవిషయము ఔద్దాలకుని అభిప్రాయముకంటె సహజముగ నున్నట్లు బోధపడుచున్నది. ఈఅభిప్రాయములోకూడ స్త్రీపురుషులకు స్ఖలనసౌఖ్యము అంగీకరింపబడుచున్నది, కనుక భావమునుబట్టి రతులు తొమ్మిదివిధములుగ ఏర్పడుచున్నను స్త్రీపురుషులకు స్ఖలనకాలములోమాత్రము భేదము ఏర్పడుచుండుటవలన, కాలమువలన రతులు తొమ్మిదివిధములుగ ఏర్పడుచుండుటలేదు.

మరియు యోని ఒకయంత్రమువంటి దనియు, అది కదలింపబడినప్పుడెల్లను చెమ్మగిల్లుచుండు ననియు, స్ఖలనసౌఖ్య

మును పొందినపిమ్మట స్త్రీగర్భమును ధరించుచున్నదనియు బాభ్రవీయుడు తెలుపుచున్నాడు.

"గర్భముదాల్చినస్త్రీ లక్షణములు":—గర్భముదాల్చిన స్త్రీ తరుచుగ ఉమ్మివేయుచుండును. ఒడలు బరువెక్కియుండి కాలుచేతులు లాగికొనినట్లుండును. మనస్సు సదా ఆందోళన మొందియుండును. సదా ఆనందముగ నుండును. రతియందు విరక్తిభావమును కలిగియుండును. వీర్యమును యోనిలోనికి గ్రహించవలయునను కోరికను సదా కలిగియుండును. భావము అనగా తృప్తి అని అర్థము. తృప్తి అనునది రేతస్సును విడిచిననేగాని కలుగదు. స్త్రీ శోణితమునే విడుచునుగాని, శుక్రమును విడువ దని కొందరు చెప్పుచున్నారు. కామోద్రేకమును పొందినస్త్రీ పురుషుల భగలింగముల రాపిడివలన అరణి దండముల రాపిడిచేత అగ్ని ఉద్భవించినట్లు శుక్లశోణితములు స్రవించు నని పెద్దలమాటలుకూడ నిందుకు ప్రమాణముగ కనబడుచున్నవి. స్త్రీ విడుచునది శుక్లము కాకపోయినచో గర్భము ఏవిధముగ ధరించుచున్నది? స్త్రీపురుషునితో కలసినప్పుడు గర్భము ధరించినట్లుగనే, స్త్రీతో కలసినప్పుడుకూడ గర్భమును ధరించుచున్నది. కాని స్త్రీ, స్త్రీనికలసి సంభోగించినందువలన కలిగిన గర్భమున ఇరువురువిడిచిన శుక్లమువలన ఎముకలు లేని పిండము జన్మించుచున్నది.

స్త్రీలకు కామము పురుషునికంటె ఎనిమిదిరెట్లు అధికము గనుక స్త్రీ పురుషునివలన తృప్తిచెందుట యనునది జరుగదు. మొత్తముమీద చాలసేపునకుగాని స్త్రీలకు భావప్రాప్తి కలుగదు.

రతిప్రారంభసమయములో చిత్తము మధ్యస్థముగ యుండును. నఖక్షతము మొదలైనవాటిని అధికముగ భరింపజాలదు. క్రమముగ అనురాగము అభివృద్ధి అయినకొలదియు, ఆనందపరవశలై యుండుచు నఖక్షతములను మొదలగువాటిని భరించుటయు, సంభోగము పూర్తిఅగుకాలములో, రతి నిలిపి వేయవలయు ననుకోరిక జనించుటయు అనువిషయము రతి ఆరంభమునుండియు భావప్రాప్తి కలుగుచున్నట్లయినచో అసందర్భముగ కనబడుచున్నది. ఇది ఏవిధముగ అసందర్భమగుచున్నదో తెలుసుకొనవలయును.

స్త్రీలు పురుషులు చే, తాకుట, ఆలింగనముచేసుకొనుట, ముద్దుపెట్టుకొనుట, అదుమబడుట, గోళ్లతో గీయబడుట మొదలగువాటితో సామాన్యమగు స్ఖలనసౌఖ్యమును పొందినను, సంభోగప్రారంభములో మందవేగము, సామాన్యరతి, సామాన్యమగు ఉత్సాహము, పురుషులు చేయుచేష్టలలో ఓర్పు లేకపోవుటయు మొదలగునవి భరించలేరు. క్రమముగా పురుషుడు రతిని వృద్ధిచేయగా గాఢమైనరతిని పొందుచు, అమిత ఉత్సాహమును పొంది శరీరమును పురుషునకు అప్పగించి ఆనందపరవశలై శరీరమును మరతురు.

సంభోగముచేయవలయు ననుఅభిలాష కలిగినదిలగాయితు శుక్లధాతువు తనస్థానమునుండి జారి, తాను స్రవించు నాడులనుండి బయలుదేరి రతి ప్రారంభమైనదిలగాయితు కొంచెముకొంచెముగ స్రవించుచు ధాతువు పూర్తిగ క్షీణించుసరికి విరమించవలయు నని అభిప్రాయము కలుగును. కనుక పైన తెలుపబడిన బాభ్రవ్యుని అభిప్రాయములో భేదము ఏమియు

నుండదు. ఆవిషయమునే వాత్స్యాయనుడు ఈక్రిందివిధముగ తెలిపెను.

పురుషునకు స్ఖలనసమయములోమాత్రమే సుఖము లభించును. స్త్రీలకుమాత్రము రతి ప్రారంభించినదిలగాయితు అది పూర్తిఅగువరకు తెంపులేనిసౌఖ్యము కలుగును. ధాతువు స్రవించుట పూర్తిఅయినవెంటనే స్త్రీకి రతినుంచి విరమించవలయుననే కోరిక పుట్టును. ఈవిషయములనుబట్టి స్త్రీకికూడా స్ఖలనసుఖమున్నట్లు బోధపడుచున్నది.

స్త్రీపురుషులకు ఉపాయభేదము ఆదినుంచియు వచ్చుచున్నది. పురుషుడు కర్తగను, స్త్రీ ఆధారముగను సృష్టింపబడిరి. కర్త ఎల్లప్పుడును క్రియనుపొందచూడును. ఆధారము మాత్రము కర్తచేయుక్రియను పొందును. అనగా ఒకరి సాధనము పొడవుగను, మరియొకసాధనము లోతుగను నుండును. అనగా ఒకటి యిముడ్చుకొనతగినదిగను, మరియొకటి యిముడ్చుకొనునదిగను యున్నవి. అందువలన క్రియలోకూడ భేదమును అంగీకరింపవలసియున్నది.

రతిసౌఖ్యమునుకోరు స్త్రీపురుషు లిరువురకు జాతిభేదము లేదు. కనుక యిరువురును సౌఖ్యమును సమానముగనే పొందుదురు. దురద వదల్చుకొనుటవలనను, తెంపులేకుండా స్రవించుటవలనను స్త్రీలకు సౌఖ్యము రెండువిధములుగ కలుగుచున్నది. ఇక స్ఖలనములోకూడ యోని చెమ్మగిల్లుటవలనను, 'క్లిన్నత్వ'మనుసౌఖ్యమును, మథింపబడుటవలన కలుగుసుఖమును కలుగును. స్త్రీలకు ఈ రెండువిధములైన సుఖములు మధ్యరతిలో కలుగును. ఇక రతి పూర్తియగుసమయములో పురుష

నకువలెనే స్త్రీలకుకూడా స్ఖలనమగును. రతిపూర్తిసమయములో స్త్రీపురుషుల కిరువురకు ఒక్కమాటు స్ఖలనము అయినచో ఆ రతిని ఉత్తమరతి యందురు. ఆవిధముగ జరుగక పురుషునకు ముందుగ స్ఖలనముఅయినచో పురుషాంగము వాలిపోవును. పిదప స్త్రీ తృప్తినిపొంద లేకపోవును. అందువలన స్త్రీని విషమ రతులలో ముద్దులు, ఆలింగనములు మొదలగువానిచే ఆనంద పరవశురాలినిగచేసి ముందుగ ఆమెకు తృప్తికలుగువిధముగ చేయవలయును. స్త్రీముందుగ భావప్రాప్తిని పొందినచో వెంటనే పురుషుడు రతిని త్వరత్వరగచేయవలయును. తానుకూడ ఆవిధ ముగ తృప్తిని చెందవచ్చును.

సామాన్యముగపురుషునకు మొదటిరతియందు అధిక మైన ఉత్సాహమును, శీఘ్రస్ఖలనమును జరుగుచుండును. రెండవరతియందు, ఉత్సాహము కొంచెముతక్కువగ నుండి, స్ఖలనము కొంచెము ఆలస్యముగ కలుగును. స్త్రీలకుమాత్రము మొదటిరతియందు ఉత్సాహము తక్కువగను, భావప్రాప్తి ఆలస్యముగను కలుగుచుండును. రెండవరతిలో స్త్రీకి అధిక ఉత్సాహమును, శీఘ్రస్ఖలనమును జరుగును. ఈవిధముగ ధాతువు క్షీణించువరకు స్త్రీపురుషుల ఉత్సాహమును, నిరుత్సాహమును, శీఘ్రస్ఖలనమును, చిరస్ఖలనమును పరిశీలింపవలయును.

---

# రతి విధానములు

ఆలింగనము, చుంబనము మొదలగువానిమూలమున అనురాగములను వృద్ధిపరచుకొనినపిదప యువతీయువకులు సంభోగించుటకు సిద్ధముగా నుందురు. రాగకాలము అనగా పురుషునిసాధనము, స్త్రీభగము సంభోగమునకు సిద్ధముగనున్న కాల మని భావము. సంభోగమునకు సిద్ధపడుట అనగా స్త్రీ యోనిలో పురుషునిలింగము ప్రవేశపెట్టుట అని భావము.

సంభోగముచేయవలయునని అభిప్రాయము కలిగినప్పుడు యువతియొక్క బలమును గ్రహించవలయును. పిదప లింగమును యోనిద్వారములోనికి ప్రవేశింపజేయవలయును. అనగా యువతియొక్క కామోద్రేకము ననుసరించి సంభోగము సలుపవలయు నని భావము.

లింగమును భగరంధ్రములోనికి ప్రవేశింపజేయుటయే 'రతిక్రియ' యనబడును. లింగము దారుఢ్యమునుచెంది పెద్దదై విజృంభించియున్నప్పుడుమాత్రమే సంభోగమును చేయవలయును. యువకుడు సంభోగమునకు సంబంధించిన జ్ఞానమును కలిగియుండుట ముఖ్యము. సాధారణముగ కొందరుయువకులు మైథునక్రియాజ్ఞానము కలిగియుండక తమప్రియురాండ్రను ఏవిధముగ సంతోషపెట్టవలయునో తెలియక, సంభోగసమయమున ఆలోచనానిమగ్నులై, అవివేకముగ ప్రవర్తించుచుందురు. అట్టి అవివేకమును తొలగించుటకే యువకులు కామశాస్త్రజ్ఞానమును కలిగియుండవలయును.

మృగీజాతియువతి అనగా చిన్నదైనయోనిద్వారము గల యువతి వెల్లకిలపరుండి తనతొడలను వేరుచేయుచు తనభగ మును బాగుగవిప్పి శయనించవలయును. లింగముకంటె యోని పెద్దదిగ నున్నప్పుడు యువతి తనతొడలను దగ్గరగపెట్టి భగ రంధ్రమును చిన్నదిగ చేయవలయును.

"అవప్రాపయంతీవ హస్తినీ నీచరతే":—హస్తినీజాతిస్త్రీ అనగా పన్నెండుఅంగుళములలోతుగల యోనిగలస్త్రీ వృష జాతిపురుషునితో అనగా తొమ్మిదిఅంగుళముల పొడవుగల లింగముగలిగిన పురుషునితో రతి సలిపినయెడల అది నీచరతి యన బడును. నీచరతియందు యువతి తన తొడలను దగ్గరగ కలిపి యుంచి భగమును ముడిచి చిన్నదిగనుండునట్లు చేయుచు శయనించవలయును. శశజాతిపురుషునితో హస్తినికి సంయో గము జరుగునప్పుడు అట్టి నీచరతిలోకూడా యువతి యీవిధ ముగనే శయనించవలయును.

"న్యాయ్యోయత్ర యోగస్త త్సమపృష్ఠం":—యువతి, యువకుల భగలింగములు మామూలుగా సమానమైన పరిమా ణముగలవిగ నున్నయెడల సమరతి యనబడును. అట్టి సమరతి యందు యువతి తన తొడలను బాగుగ చాచ నక్కరలేదు, బాగుగ ముడవ నక్కఱలేదు. సామాన్యముగ ఉంచవలయును.

"అభ్యాంబడబావ్యాభ్యాతా":—బడబజాతిస్త్రీ అశ్వ జాతిపురుషునితో రతిచేయుసమయములో తనతొడలను బాగుగ చాచి యోని బాగుగ తెరచుకొనునట్లు శయనించవలయును. శశజాతిపురుషునితో రమించబోవు సమయములో తొడలను బాగుగ దగ్గరగనుంచి భగమునుముడిచి శయనించవలయును.

వృషజాతియువకునితో సంభోగము జరుపునప్పుడు యోనిని మామూలుగ నుంచవలయును. అనగా ఉచ్చరతియందు యువతి బాగుగ వేరుపరచియు, నీచరతియందు దగ్గరగ నుంచియు శయనించవలయును. పురుషుడు లింగమును భగము లోనికి ప్రవేశింపజేయునప్పుడు మొదట కొంచెము లోనికి ప్రవేశింపజేసి పిదప కొంచెము వెనుకకు లాగవలయును. మరల కొంచెము లోతుగబోవునటులు చేయవలయును. ఈ విధముగ యోనిలోనికి పూర్తిగ బోనీయవలయును. యోనిని తడిగ జేయు శ్రోణితము ఊరువరకు లింగమును ఆవిధముగ పైభాగముననే ఆడించవలయును.

మదనదండమును యోనిలో ప్రవేశింపజేయునప్పుడు యువతి తన యోనిని కటిభాగములను కదలించుచు పురుషునకు సహాయపడవలయును. ఆవిధముగ స్త్రీ, పురుషునకు సహాయపడని యెడల లింగప్రవేశము ఇరువురకు కష్టదాయకముగ నుండును. యోనిద్వారము మిక్కిలి మృదువైనచర్మమును కలిగియుండును. లింగమును యోనిద్వారములోనికి బలవంతముగ ప్రవేశింప జేసినయెడల యోనిలో గాయము కలుగవచ్చును.

సంభోగముకొఱకు కూర్చునియున్న పురుషుడు తన తొడలను యువతియొక్క తొడలమీద యుంచి రతిచేసిన యెడల అది 'గ్రామ్య' మనబడును.

యువతితొడలను పురుషుడు తన తొడలమీద నుంచుకొని రతిచేసినయెడల దానిని 'నాగరికము' అందురు.

యువతి రతిసమయములో శయ్యమీద వెల్లకిలపరుండి తలను శయ్యమీదనే యుంచి నడుమును పైకెత్తుచున్నచో

దానిని 'ఉత్ఫుల్లకము' అందురు. అట్టిది రతిసమయములో మామూలుగ జరుగువిషయమేయైనను యోనిని బాగుగ విస్తరింపజేయుటకొఱకు నడుమును బాగుగ పైకి ఎత్తుచు తన రెండు చేతులతోను భగమును విప్పుచు మేహనమును ప్రవేశపెట్టుకొనవలయును. అట్టిసమయములో యువతి తనపాదములను యువకుని నడుముమీద వెనుకభాగములో నుంచవలయును. ఈవిధముగ కామిని తన నడుమును పైకి ఎత్తుచు భగమును బాగుగ విప్పుచుండును గనుక దీనికి 'ఉత్ఫుల్లక' మని పేరు. ఈ ఉత్ఫుల్లక బంధనములో పురుషుడు తన లింగమును యోనిలో ప్రవేశపెట్టినపిదప స్త్రీ తన నడుమును గుండ్రముగ త్రిప్పవలయును. లేనిచో పురుషుడైనను తన నడుమును మెల్లగ గుండ్రముగ త్రిప్పవలయును. ఈవిధానము యోని కొలదిగ శోణితముచే ద్రవమగువఱకుమాత్రమే చేయవలయును. ఇట్టి బంధనములో పురుషుడు తొందరపడకూడదు. ఆవిధముగ తొందరపడినచో స్త్రీకి బాధ కలుగును. పురుషుని లింగము చివరభాగములో యుండు చర్మముకూడ నలగవచ్చును.

ఆవిధముగనే యువతి వెల్లకిల పరుండి తన తొడలను పైకి ఎత్తి నిలిపియుంచినపుడు పురుషుడు రతిచేసినయెడల, అది 'విజృంభితక' మనబడును. ఈబంధనములో వనిత తన తొడలను బాగుగ చాచియుంచుటవలన భగము బాగుగ తెరచిన నోరువలె తెఱచుకొనియుండును.

ప్రేయసి తన తొడలను పిక్కలతో కలిపి సమముగ ప్రక్కభాగములలో నుంచి మోకాళ్లు ప్రక్కకుపెట్టి, తన ప్రియుని రతిచేయుమని కోరినచో అది 'ఇంద్రాణికబంధ'మగును.

ఇందు పురుషుడు తన చంకలలో స్త్రీయొక్క మోకాళ్లను నొక్కిపట్టియుంచుటవలన స్త్రీయొక్క భగము పైనచెప్పబడిన బంధనములలోకన్న బాగుగ తెరచుకొనియుండును. ఈబంధన మును తొందఱపడి ఒక్కసారిగ చేయుటవలన ప్రమాదము సంభవింప వచ్చును గనుక మెల్లమెల్లగ అభ్యాసము చేయవల యును. దీనిని దేవేంద్రునిభార్యయైన శచీదేవి కనిపెట్టెను. అందువలన దీనికి 'ఇంద్రాణిక' మని పేరువచ్చినది.

ఈ ఇంద్రాణికబంధమును మృగినాయిక వృషజాతిపురు షునితో సంభోగించునప్పుడే గాక, అశ్వజాతిపురుషునితో రతి చేయునప్పుడుకూడ ఉపయోగించవచ్చును. అనగా ఉచ్చ రతిలోకూడ స్త్రీ ఈ బంధనమును అవలంబింపవచ్చు నని భావము. మృగిజాతిస్త్రీ, ఉత్ఫుల్లక, విజృంభితకబంధనములను వృషజాతిపురుషునితో సంభోగముచేయునప్పుడు మాత్రమే అవలంబింపవలయును. ఆవిధముగనే బడబజాతిస్త్రీ అశ్వజాతి పురుషునితో కలియునప్పుడు ఉత్ఫుల్లక, విజృంభితబంధనములను మాత్రమే ఉపయోగించవలయునుగాని 'ఇంద్రాణిక బంధన' మును ఉపయోగింపరాదు. హస్తినీజాతిస్త్రీ వృషజాతిపురు షునితో రతి సలిపినయెడల నీచరతి యేర్పడును గనుక అట్టి పురుషునితో కలియునప్పుడు సంపుటబంధనమును ఉపయోగించ వలయును.

### సంపుటబంధనవిధానము

హస్తినీజాతిస్త్రీ శశజాతిపురుషునితో రతిచేయునప్పుడు సంపుటకము, పీడితకము, వేష్టితకము, బాడబకము అను బంధము లను ఉపయోగించిన సౌఖ్యదాయకముగ నుండును.

యువతీయువకులు కాళ్లు సాపుగా చాచి రతిచేసినయెడల 'సంపుటకబంధ' మనబడును. ఈసంపుటకబంధములో పార్శ్వ సంపుటమని, ఉత్తానసంపుటమని రెండువిధములు గలవు. ప్రక్క వాటుగ పరుండి అనగా వామభాగమున పురుషుడును దక్షిణ భాగమున స్త్రీయు పరుండి యువతియొక్క ఎడమకాలు యువ కునియొక్క కుడిప్రక్కగ నుంచబడి రతిచేయుట 'సంపుటక' మనబడును.

స్త్రీ వెల్లకిల పరుండియున్నప్పుడు పురుషుడు ఆమెమీద బోర్లపరుండి రతిచేసినయెడల దానిని 'ఉత్తానసంపుట' మందురు.

పురుషుడు వెల్లకిల పరుండి, అతనిపై స్త్రీ బోర్లపరుండి పురుషునివలె రతిచేసినయెడల రెండవరకమగు 'ఉత్తానసంపుటక' మనబడును. ప్రక్కకు ఒత్తిగిలి చేయుసంపుటకములో నాయకుని నడుము దిండుమీదను, నాయికనడుము ప్రక్కమీదను యుండ వలయును. ఈవిధముగ మెరక పల్లములలో ఉండనిచో రతిసమయములో యువతీయువకుల భగలింగములు విడిపోవును.

నిద్రించవలసినవిధానములో స్త్రీకి కుడివైపున పురుషు డును, అతనికి ఎడమవైపున స్త్రీయు పరుండి నిద్రించవలయును. అన్నిజాతుల స్త్రీపురుషులును ఈవిధానమునే అవలంబింపవల యును. రతిసమయమున హస్తినీజాతిస్త్రీకి మాత్రము స్త్రీకి ఎడమవైపున పురుషుడును, పురుషునకు కుడివైపున స్త్రీయు పరుండవలయును. హస్తినీజాతియువతియొక్క భగమును పురు షుడు చేతితో తడుమువలయును గనుక ఈవిధముగ శయనిం చుట మంచిది. ఈపద్ధతిని హస్తినీవిషయములో మాత్రము పెద్దలు అంగీకరించిరి.

ఉత్తానసంపుటకబంధములో గాని, పార్శ్వసంపుటకబంధములో గాని లింగమును భగములోనికి ప్రవేశింపజేసుకొని సుందరి తన రెండుతొడలను కలిపి గట్టిగ నొక్కిపట్టుకొనియుంచి రతిచేయుట 'పీడితక' మనబడును.

ఉత్తానసంపుటములోగాని, పార్శ్వసంపుటములోగాని ప్రియునితో కలసి యువతి తన కుడితొడను పురుషుని ఎడమ తొడమీదను, ఎడమతొడను కుడితొడమీదను ఉంచి రతి చేసినయెడల, అట్టి రెండువిధములైనరతులను 'వేష్టితక' మని చెప్పుదురు. ఇందుపై పీడితకముకంటె యువతిభగము బాగుగ ముడుచుకొనియుండును.

ఆడగుఱ్ఱమువలె స్త్రీ కదలకయుండి లింగమును భగములోనికి గట్టిగా నొక్కిపట్టిన అది 'బాడబక' మనబడును. ఇది క్రమముగ అభ్యసించుటవలనగాని, చేయుటకు సాధ్యమైనది గాదు. ఒక్కసారిగ చేయకూడదు.

ఆంధ్రదేశమునందలి వనితలు అభ్యసించుటలో ఉత్సాహముకలవారుగ నుందురు గనుక యీ 'బాడబకబంధనము'ను వారు ఆచరణలో పెట్టుచుందురు. ఇట్టి అభ్యాసము సాంప్రదాయకము తెలిసినవారివద్దనుండి తెలుసుకొనవలయును. పైన చెప్పబడిన యీ ఏడువిధములైనబంధనములు బాభ్రవీయునిచే చెప్పబడినవి.

హస్తినీజాతిస్త్రీ వెల్లకిల పరుండి తన రెండుతొడలను పైకి చాచినప్పుడు పురుషుడు ఆమెతొడలను కౌగిలించుకొని రతిచేయవలయును. ఇది 'భుగ్నకము' అనబడును.

స్త్రీ తనకాళ్లను పైకి ఎత్తినయెడల పురుషుడు ఆమె మోకాళ్ల వెనుకభాగమును తనభుజములమీదనుండి తొడలను కౌగిలించి రమించుట 'జృంభితకము' అనబడును.

స్త్రీ పురుషునివక్షస్థలముమీద తన రెండుపాదములను మోపినప్పుడు పురుషుడు తనబాహువులతో నాయికమెడ కౌగిలించుకొని రమించవలయును. ఇది 'ఉత్పీడితకము' అనబడును. ఈబంధములో స్త్రీ తనమోకాళ్లను బాగుగ వంచి భుజములదగ్గరకు చేర్చియుంచవలయును.

పైనచెప్పబడినవిధముగ, స్త్రీ తనపాదములలో నొకదానినిమాత్రము పురుషుని వక్షస్థలముమీద నుంచి, రెండవపాదమును సాపుగ జాపినప్పుడు పురుషుడు పైనచెప్పబడిన ఉత్పీడితబంధనమునందువలె రతిచేసినయెడల 'అర్థపీడితక' మనబడును. కుడిపాదమును ఎడమప్రక్కకు, ఎడమపాదమును కుడిప్రక్కకు పురుషుని వక్షస్థలముమీద మోపి పైవిధముగ రతిచేసినయెడల, రెండవరకమునకు చెందిన అర్థపీడితక మనబడును.

రతిచేయుచున్నకాలములో పురుషుని భుజములమీద స్త్రీ తన ఎడమపాదమును మోపి, క్షణకాలముమాత్రమే యుంచి, మరల యథాప్రకారముగ క్రిందకు దింపిన ఒకరకమును 'వేణుదారితక' మనబడును. అట్టి రతిసమయములో స్త్రీ తన ఎడమపాదమును పురుషుని కుడిభుజముపై కొంతసేపుంచి, మరల యథాప్రకారముగ క్రిందకు జాపినయెడల రెండవరకమునకు చెందిన వేణుదారితక మగును.

స్త్రీ తన ఎడమపాదమునుగాని, కుడిపాదమునుగాని పురుషునిశిరస్సుపై నుంచవలయును. ఆవిధముగనే ఎడమపాద

మునుగాని, కుడిపాదమునుగాని చాచియుంచవలయును. అప్పుడు పురుషుడు తన మదనదండమును కూటమువలె సుందరి భగములోనికి దిగవేయవలయును. ఈబంధము 'శూలాచితక' మనబడును. దీనిని చాల అభ్యాసమునీూదనే చేయవలయును.

స్త్రీ యొక్కపాదములను రెంటింటిని పురుషుడు తన బొడ్డునకు రెండువైపులను మోపి రతిసలిపినయెడల, స్త్రీ కాళ్లు బాగా మడతపడడము జరుగును. ఇది 'కర్కాటకబంధ' మన బడును.

రతి జరుగుచున్నప్పుడు స్త్రీ తనకుడిపాదమును ఎడమ వైపునకు, ఎడమపాదమును కుడివైపునకు ఎత్తి పురుషుని నడుమును నొక్కుచున్నయెడల 'పీడితకబంధ' మనబడును.

వెల్లకిల పరుండియున్న స్త్రీరతిసమయములో, తన యెడమ పాదమును కుడితొడమీూదకు, కుడిపాదమును ఎడమగజ్జకు ఆనించి పురుషునితో రతిసాగించినయెడల 'పద్మాసనబంధ' మన బడును.

పురుషుడు భగలింగసంయోగమునకు భంగము కలుగ నీయక తననడుముయొక్క పైభాగమును రెండవవైపునకు త్రిప్ప వలయును. ఆవిధముగ రెండవవైపునకు తిరిగిన నాయకునివీపును స్త్రీ కౌగలించుకొనవలయును. ఆవిధముగ తననడుమును కౌగి లించుకొనియున్న స్త్రీతో పురుషుడు సంభోగించవలయును. ఇది 'పరావృత్తక' మనబడును. దీనిని చాల అభ్యాసమునీూదనే చేయవలయునుగాని తొందరపడినచో ప్రమాదము సంభవిం చును. ఇది ఒకరకమైన 'పరావృత్తక' మనబడును. ఆవిధముగనే స్త్రీ భగలింగసంయోగమునకు భంగముకలుగనీయక వెనుకకు

తిరిగినప్పుడు, పురుషుడు ఆమెవీపును కౌగలించి రమించినయెడల మరొకరకమగు 'పరావృత్తక' మనబడును. దీనినికూడ అభ్యాసముమీదనే చేయవలయును.

పైనచెప్పబడిన సంభోగవిధానములు చిత్రరతులలో చేరవు. మామూలుగ స్త్రీపురుషులు ఒకరిమీద ఒకరుగాని, ఒకరిప్రక్కను ఒకరుగాని శయనించి రమించుటయే శ్రేష్ఠమైనది.

ఇక చిత్రరతులను తెలుపుచున్నాను. నీటిలోగాని, నేలమీదగాని, పరుండిగాని, కూర్చుండిగాని, నిలువబడిగాని, స్త్రీపురుషుల రతులు సలుపుచు ఆనందింపవలయు నని సువర్ణనాభుని వచనము. చిత్రరతులను నీటిలోగాని, నేలమీదగాని, పరుండిగాని, కూర్చుండిగాని, నిలువబడిగాని చేయవలయు ననువిషయము అర్థములేనిది. నీటిలోనుండి రమించుపద్ధతిని శాస్త్రకారులు నిషేధించుచున్నారు. నీటిలో సంభోగము చేసినయెడల పాతకము ప్రాప్తించు ననియు, నీటిలో రేతస్సును విడిచినయెడల కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములు ఆచరించిననేగాని, అట్టి పాపము పోదనియు చెప్పబడియున్నది. కనుక నీటియందు రతి సలుపుట నిషేధింపబడెను.

చిత్రరతులు:—యువతీయువకులు నేలమీద నిలువబడి, గోడకుగాని, స్తంభమునకుగాని ఆనుకొని ఒకరినొకరు బాగుగ కౌగిలించుకొని బాగుగ రతినిచేసినయెడల 'స్థితరతి' యనబడును.

గోడనుగాని, స్తంభమునుగాని పురుషుడు ఆనుకొని నిలువబడియున్నప్పుడు, స్త్రీ అతనికంఠమును తనబాహువులతో చుట్టిపట్టుకొని, అతనిచే గట్టిగ కౌగలించుకొనబడి, తనతొడలతో ప్రియుని నడుమును చుట్టిపట్టుకొని, తరుచుగ తనచేతు

లను ప్రియుడు ఆనుకొనియున్న స్తంభమునకుగాని గోడకుగాని ఆనించి తననడుమును ప్రేశేషించుచు రతిచేసినయెడల 'అవలంబితక' మనబడును. ఇది ఒకవిధమైన చిత్రరతి.

నేలమీద గోవువలె చేతులును, కాళ్లును ఆనుకొని యున్నస్త్రీని, పురుషుడు వెనుకనుండి, ఆమెనడుమును పట్టుకొని రమించినయెడల 'ధేనుకబంధ' మనబడును. మనుష్యులు పశువుల వలె క్రీడించుటవలన యిది 'చిత్రరతి' యగుచున్నది.

యువతి వెల్లకిల పరుండియున్నప్పుడు సంభోగసమయములో చేయు స్తనమర్దన, ఆలింగన, చుంబన, నఖక్షత, దంతక్షతములను 'ఈ ధేనుకబంధ'ములో వీపుమీదనే చేయవలయునని భావము.

కుక్కలు, లేళ్లు, మేకలు, గొఱ్ఱెలు, గాడిదలు, పిల్లులు, పులులు, ఏనుగులు, పందులు, గుఱ్ఱములు మొదలగు జంతువులు ఏయేవిధముగ రతులు చేసుకొనుచుండునో ఆవిధానముల ననుసరించి క్రొత్తరతివిధానముల ననుసరించి యువకుడు యువతితో కలసి అనుభవించవలయును.

ఒకపురుషుడు పరస్పరము విశేషనమ్మకము కలిగియున్న ఇరువురు యువతులతో ఒక్కసారిగ రమించుట 'సంఘాటక' మనబడును. ఇది ఒకరకమైన చిత్రరతి. సంఘాటకమునందు ఇరువురుయువతులును వెల్లకిల పరుండియున్నప్పుడు యువకుడు వారిద్దరితోను ఒక్కమారే రమించును. [illegible]ను ఒక యువతిభగములోనికి లింగమును ప్రవేశింపజేసి రతిచేయుచుండు[illegible]. రెండవ యువతిని చుంబనము, స్తనమర్దనము, నఖక్షతము మొదలగు వాటితో అనురాగమును వృద్ధిచేయుచుండవలయును. పిమ్మట

రెండవ యువతికి భగలింగసంయోగమువలన తృప్తిచేయుచు, మొదటి యువతికి చుంబనము, మొదలైనకృత్యములతో కామోద్రేకమును కలిగించుచుండవలయును.

"బహీర్వ్యభిశ్చసహగౌయూథికం":—ఒకరిమీద నొకరు విశేషాభిమానము, స్నేహము, అధికప్రేమ కలిగిన చాలమంది యువతులతో ఒకపురుషుడు రమించినయెడల 'గౌయూథిక' మన బడు చిత్రరతి యగును. గోవులమందలో ఆబోతు రమించినట్లు రమించడము గనుక దీనికి 'గౌయూథిక' మని పేరువచ్చినది.

నీటియందు అనేక ఆడయేనుగులతో ఒకమగయేనుగు రతిక్రీడ జరిపినట్లు, అనేకమందిస్త్రీలతో ఒకయువకుడు నీటి యందు రమించుట 'వారిక్రీడితక' మనబడును. ఆవిధముగనే ఒకమేకపోతు ఆడమేకలమందలో పడి రమించినట్లు యువకుడు సమూహాముతో కలసి రమించుట 'ఛాగలము' అనబడును. ఆడలేళ్లగుంపులో ఒకమగలేడి పడి రమించినట్లు పురుషుడు అనేకమందిస్త్రీలతో కలసి రమించినచో 'ఐణేయ' మనబడును. ఈవిధముగనే ఒకసమయములో ఒకయువతి యిరువురు లేక ముగ్గురుపురుషులతో కలసి ఒక్కపర్యాయమే రమించుటకూడ జరుగుచుండును.

స్త్రీరాజ్యమునకు సమీపములో గ్రామనారీదేశమని యొకదేశము కలదు. ఆదేశమందును, స్త్రీరాజ్యమందును, బాహ్లీకదేశమందును పలుపురుయువకులను ఒక్కొక్కస్త్రీ వివాహముచేసుకొని అంతఃపురములలో నుంచుకొనును. ఆ పురుషులు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కడును, కొన్నిసమయము లలో అందరును ఎవరికి ఇష్టమువచ్చినట్లు వారు అనేకరక

ములబంధములలో ఆస్త్రీతో రతిసలుపుచుందురు. అనేకమంది యువకులు ఒకస్త్రీతో రతిసలుపునప్పుడు, ఒకడు తొడమీద ధరించవలయును. రెండవవాడు రతిసలుపుచుండవలయును. మరి యొకడు స్తనములమీద నఖక్షతములు చేయుచుండవలయును. వేరొకడు చుంబనము చేయుచుండవలయును. మరొకడు ఆలింగనము గావించవలయును. ఈవిధముగ ఒక్కొక్కడు ఒక్కొక్క రకమగు క్రియతో ఆమెను రంజింపజేయుచుండవలయును. వంతుల ప్రకారము ఒకరితో ఒకరోజునను, మరొకనితో మరొక రోజునను క్రీడించుట వేరొకవిధాన మగును. ఈవిషయములు చాల నీచముగ కనబడుచున్నవి. ఇట్టిక్రీడలు మానవులు చేయ తగినవిగా లేవు.

పైనచెప్పినరీతిగ కొన్ని దేశములలో పలువురుయువకులచే పరిగ్రహింపబడిన వేశ్యగాని పలువురుపురుషులచే పరిగ్రహింపబడిన రాజస్త్రీగాని పైవిధముగనే ప్రవర్తించవలయును.

దక్షిణదేశీయులు భగరంధ్రముతోగాక అపానరంధ్రముతోకూడ రతిచేయుచుందురు. దీనినికూడ ఒకవిధమైన చిత్రరతి అని చెప్పిరి.

సూక్ష్మబుద్ధిగలవాడు పశువులు, మృగములు, పక్షులు మొదలైనవి అనుసరించు రతివిధానములను చూచి గ్రహించుచు ఆయావిధానములతో స్త్రీలను రంజింపజేయుచుండవలయును.

యువతుల అభీష్టవిధానములను గ్రహించి వారికి భావప్రాప్తి కలుగువిధముగ పశుపక్ష్యాదుల రతిబంధవిధానముల ననుసరించి రతిని సలిపి ప్రేమను, గౌరవమును వృద్ధిగావించుకొనవలయును.

---

# పురుషాయితములు

పురుషుడు పలురకములగు బంధనముల నుపయోగించి రతిక్రీడలను సలిపిసలిపి శ్రమజెంది అనురాగముతో పరిపూర్ణుడై యున్నప్పుడు యువతి పురుషాయితమును చేయుటకు మొదలు పెట్టవలయును. యువకుడు స్త్రీవలె వెల్లకిల పరుండియున్నప్పుడు యువతి పురుషునిమీద బోర్లపరుండి, పురుషుడు చేయువిధముగ రతిక్రీడను సలుపుట, పురుషాయిత మనబడును. పురుషాయిత మునకు ఉపయోగించు క్రియలకు 'పురుషోపసృప్తము' లని పేరు.

పురుషుడు అనేకరకములుగ బంధము లుపయోగించి రతులు సలిపిసలిపి బాగుగ శ్రమజెందియున్నప్పుడు, అతడింకను రతియందు అనురాగపూరితుడై యున్న విషయమును గ్రహించి, యువతి అతనిని శయ్యపై వెల్లకిల పరుండజేసి పురుషాయిత క్రియలకు మొదలుపెట్టవలయును. పురుషాయితమునకు స్త్రీతప్పక పురుషుని అనుమతిని పొందవలయును. అతనికి పురుషాయితము నందు బాగుగ నిష్టమున్నదని గ్రహించినతరువాత అతడు శ్రమ జెందియుండకపోయినను పురుషాయితమునకు మొదలుపెట్ట వలయును.

పురుషాయితమును రెండువిధములుగ చేయవచ్చును. ఇందు మొదటిరకములో ముందు యువతి వెల్లకిల పరుండి యుండగ, పురుషుడు రతిచేయుచు ముకోణాకారములో తాను మారుచుండి, భగలింగములకు ఎడబాటు కలుగకుండగనే,

యువతిని పైకి లేవదీసుకొని తనబాహువులతో కౌగలించుకొన వలయును. అప్పుడు స్త్రీ అతనిమీద వాలును. తరువాత పురుషుడు మెల్లగ శయ్యమీద వాలును. ఈవిధముగ మొదట ప్రారంభించినరతికి భిన్నము ఏర్పడకుండా భంగముకలుగక, ఆసుఖమునకు తెంపు కలుగనీయక, క్రిందమీదై, పరిపూర్ణ అనురాగముతో, ఆనందముతో, ఉత్సాహపూరితయై, పులకరించుచున్న శరీరముతో రతిసౌఖ్యమును అనుభవించుచుందురు. ఇట్టి పురుషాయితమును పురుషుడు శ్రమజెందియున్నప్పుడుగాని, రతియందు ఇంకను అనురాగపూరితుడై యున్నప్పుడుగాని అవలంబింపవలయును.

పురుషుడు రతిని ప్రారంభింపకపూర్వమే స్త్రీ పురుషాయితమును చేయదలచి, పురుషుని పురుషాయితమునకు అనుకూలముగ పరుండునటుల జేసి, అతనిపై కెక్కి ప్రారంభము నుంచి పురుషాయితమును ప్రారంభించినచో, రెండవరకముపురుషాయిత మనబడును. రతిసారసౌఖ్యమునకు తెంపును కలుగనీయక చేయుపురుషాయితములు ఈరెండువిధానములేగాని వేరుగ మరేమియు కనబడుచుండుటలేదు.

పురుషాయితము బాహ్య మనియు, అభ్యంతర మనియు రెండువిధములు. స్త్రీ తనశిరస్సులో ధరించినపుష్పలు విడిపోవువిధముగ, చిరునవ్వు నవ్వుచు ఆయాసముచే, విశ్రాంతిని తీసుకొనుటకుగాను, పురుషుని అధరపానము జేయుచు, బుగ్గలను ముద్దుపెట్టుకొనుచు, తనకుచకుంభములను పురుషునివక్షస్థలముపై అదిమి నొక్కుచు, మాటిమాటికి సిగ్గుచే తలవంచుకొనుచు, మామూలురతిలో పురుషుడు తనమీద నేయేవిధ

ముగ చేష్టలుచేసెనో, తానును ఆవిధముగనే, అతనిమీద కసితీర్చుకొనుటకు, అవిఅన్నియు చేయవలయును. ప్రియుడు తనను ఎన్నిబాధలు పెట్టెనో, అన్నిబాధలు అతనిని పెట్టవలయును. అతడు తనను తలక్రిందు చేసిన తానును తిరిగి అతనిని తలక్రిందు చేయుచునని పరిహాసముగ పలుకవలయును. చిరునవ్వ నవ్వుచు, మెల్లగ కొట్టుచు, బెదరించుచు, విలాసముగ పలుకుచుండవలయును. యువతి పురుషాయితక్రియలో ఎంత స్వేచ్ఛగ ప్రవర్తించినను తన సహజలజ్జాస్వభావమును మితిమించనీయరాదు. నారీమణులకు సహజములైన సిగ్గును, లజ్జయు అలంకారములుగను, సుగుణములుగను పరిగణింపబడుచున్నవి. తా నింకను పురుషాయితబంధన కృత్యములయందు అభిలాష కలిగియున్నను, పైకిమాత్రము చాలించవలయు ననుకోరిక కలిగియున్నట్లుగ నటించుచుండవలయును. స్త్రీ, పురుషునివలె రతిచేసినచో, అది 'అభ్యంతరపురుషాయితే' మనబడును. అనగా యింతకుముందు తెలిపినవిధముగ స్త్రీ పురుషునిపై కూర్చుండి పురుషాయితబంధములో రతిసలుపవలయు నని భావము.

పురుషాయితబంధనములో పురుషుడు చేయుకృత్యములు పురుషోపవృత్తము లనబడును. స్త్రీ చేయుకృత్యములను పురుషాయితము లందురు. ముందుగ పురుషుడు చేయుకృత్యములను తెలుపుచున్నాను. ముందు పురుషుడు శయ్యపై పరుండియున్న ప్రియురాలిని మాటలసందర్భములోకి దింపి పరిహాసములాడుచు కామోద్రేకమును కలుగజేయవలనుయును. తరువాత తానును ప్రక్కపరుండి నెమ్మదిగ చీరముడిని విడదీయవలయును. అందులకు ఆమె అభ్యంతరపరచుచున్నయెడల, బుగ్గలమీద ముద్దు

లను ప్రయోగింపవలయును. కలతపెట్టి పరవశురాలినిగ జేసి ఎట్టులో ఆకోకముడిని మాటలసందర్భములో తప్పించవలయును నిట్టనిలువుగ విజృంభించియున్న తన మదనదండముతో ఆమె స్తనములమీదను, పొత్తి కడుపుమీదను, కంఠభాగము మీదను, బుగ్గలమీదను, తొడలమీదను నెమ్మదిగ తాకవలయును. అంతగా పరిచయములేనిస్త్రీ యైనచో తొడలమధ్య మాత్రమే లింగమును నొక్కి తాకించి యుంచవలయును. కన్యక విషయములోకూడ యీవిధముగనే చేయవలయును. బాగుగ పరిచయముగలస్త్రీతో రతిసలుపునప్పుడు ఆమెకు ప్రీతిఅయిన తావులలో మదనదండమును తాకించుచుండవలయును. విశేష పరిచయముగలస్త్రీని తరుచుగ ముంగురులమీద చుంబనమును చేయుచుండవలయును. బుగ్గలను నెమ్మదిగ వ్రేళ్లతో మెలిపెట్టుచుండవలయును. క్రొత్తస్త్రీలతోను, క్రొత్తకన్యలతోను యీవిధముగ ప్రవర్తించిన వారు సిగ్గుపడి, కన్నులను మూసుకొనుచుందురు. బాగుగ చనువుగలిగినస్త్రీలు ఆవిధముగ సిగ్గుపడి కన్నులను మూయరు. స్వేచ్ఛగ ప్రవర్తించుస్త్రీలుకూడ సిగ్గుజెందక ప్రవర్తించుచుందురు. మొత్తముమీద బాహ్య పురుషాయితములు కోకముడిని ఊడదీయుటయు, మదనదండముతో తాకుటయు, భగముపై లింగముతో రాపిడిచేయుటయు, బుగ్గలు, స్తనములు, పాలభాగము, ముంగురులు వీనిని ముద్దుపెట్టుకొనుటయు అని నాలుగువిధములుగ చెప్పబడినవి. ప్రక్కశయనించియున్నలతాంగికి చనువిచ్చి చుంబనాదికృత్యములను ప్రయోగించుచు రతిక్రీడాకేళీవిలాసములలో ఆమెను లాలించి తేలించుచుండవలయును.



పురుషుడు తనమదనదండమును ప్రియురాలియోనిలో ప్రవేశింపజేసిన తరువాత, స్త్రీ ఆలింగప్రవేశస్పర్శసౌఖ్యమును అనుభవించుచు, దృష్టిని తనశరీరమునందలి యేదో ఒకభాగము మీద ప్రసరింపజేయును. ఆవిధముగ ఆమె తనశరీరము నందలి ఏభాగమును చూచుచుండునో ఆస్థానమును ప్రియుడు తనమదన దండముతో తాకుచు, చేతులతో మర్దనచేయుచుండవలయును. ఆవిధముగ చేయుటవలన ఆమెకు త్వరలో రతిసౌఖ్యమును కలిగించవచ్చును. ఈవిషయమును బైటపెట్టుటకు యువతులు సిగ్గుపడుచుందురు. గనుక ఇది ఒకపరమరహస్యమని సువర్ణనాభుడు తెలిపెను.

యువతికి మదనదండముతో ఎక్కడతాకిన సుఖమును పొంది పరవశతను పొందునో, అక్కడ తాకుచు, ఆ అంగములను పీడించుచు రతిచేయవలయునని కొందరు కామశాస్త్ర వేత్తలు తెలుపుచున్నారు.

ఏయేఅంగములను స్పృశించిన స్త్రీదృష్టి సుఖాతిశయముచే భ్రమించుచుండునో, ఆయాప్రదేశములను స్పృశించుచు స్తనములను మర్దించుచు రతిసలుపవలయునని మరికొందరును, రతిసౌఖ్యమునకు లక్షణములని చెప్పిరి. కాని వాత్స్యాయనుల వారు సువర్ణనాభుని అభిప్రాయమే సమంజసముగా యున్నదని తెలిపెను.

స్త్రీలకు భావప్రాప్తి కలిగినప్పుడు అనగా రతిచేయవలయు ననుఅభిలాష పూర్తిగ కలిగి ఇక అందుకు ఒకక్షణమైనను ఆగలేనప్పుడు శరీరము జారిపోవును. నేత్రములు మూయుటయు, సిగ్గుపడుటయు, రతికొరకు పురుషునిమీద పడి

ప్రాకులాడుచుండుటయు మొదలగులక్షణములు జనించును. ఈ లక్షణములు కనబడినప్పుడు స్త్రీ భావప్రాప్తిని పొందినదని తెలుసు కొనలయును.

మఱియు స్త్రీ భావప్రాప్తిని పొందుసమయములో చేతులు విదలించుచుండును. శరీరమంతయు చెమటపట్టును. పురుషుని లేవనీయక బాగుగ కౌగలించుకొనును. చుంబనములు, నఖక్షతములు, దంతక్షతములు చేయుచుండును. తనపాదములతో ప్రియుని పాదములను నొక్కిపట్టుచుండును. పురుషునికి ముందుగ భావప్రాప్తి అయినచో తానే అతనిపైకిచేరి నడుము ఆడించుచుండును.

మదనధ్వజమును యోనిలో ప్రవేశింపజేయుటకు పూర్వము నారీమణులచేష్టలు యీవిధముగ నుండునని పురుషుడు గ్రహించుకొని ఆమెకు ముందుగ భావప్రాప్తి కలిగించుటకు చేతితో ఆమె భగమును ఏనుగతొండముగతో చేయు విధముగ కదల్చుచుండవలయును. తరువాత లింగమును మదన భవనములో ప్రవేశింపజేయవలయును. ఈవిధముగ భగమును కదలించుట భగముయొక్కస్థితినిబట్టి నాలుగువిధములుగ విభజించియున్నారు. చేతినాలుగవవ్రేలును అనగాఅనామిక వ్రేలును చూపుడువ్రేలును కలిపిపట్టి యోనిలోనికి పోనిచ్చిన ఏనుగు తొండమువలె ప్రవేశించును. అప్పుడు వ్రేళ్లను ఆవిధముగనే భగములోపల బాగుగ కదల్పవలయును.

సంబాధమూ, భగము, యంత్రము అను మూడుపదములకు ఒకటే అర్థము. భగములోపల కొంతభాగము తామర పువ్వువలెమువలెను, మఱికొంత మెలితిరిగియును, మరికొంతభాగము

ఆవునాలికవలె గరుకుగను యుండును. ఈనాలుగుభాగముల లోను మొదటిభాగమును వదలి, మిగిలినమూడుభాగములను దురదవదల్చుటకు చేతితో బాగుగ కలియబెట్టవలయును. ఈవిధముగ చేతితో బాగుగ కలియబెట్టినపిదప, కొలదిగ భావప్రాప్తి పొందిన నారీమణితో రమించినయెడల ఆమెకు త్వరలో రతి యందు తృప్తిని కలిగించవచ్చును.

భగలింగములు సమకూర్చి చేయుఉపసృప్తములు పదిరకములని కామశాస్త్రగ్రంథములో తెలుపబడియున్నది. అవి ఉపసృప్తకము, మంథనము, హళము, అసమర్దనము, పీడితకము, చటకవిలసితము, సంపుటము, నిర్ఘాతకము, వరహాఘాతము వృషాఘాతము అనునామములతో వ్యవహరింపబడుచున్నవి.

మదనదండమును సాఫుగా యోనిలో ప్రవేశపెట్టుట 'ఉపసృప్తక' మనబడును. దీనిని తరుచు ప్రతివారును అవలంభించుచుందురు.

చేతితో లింగమును పట్టుకుని యోనిలోపలిభాగము నంతయు త్రిప్పుట 'మంథన' మనబడును.

పురుషుడు తనకటిప్రదేశమును క్రిందుగా యుంచి లింగమును యోనిలో దూర్చి వెనుకకు లాగుచుముందుకు పొడచుట 'హళ' మనబడును. ఆవిధముగ తొందరతొందరగ పొడుచుచుండిన 'మర్దన' మగును.

లింగమును భగములోనికి ఎంతవరకు త్రోయుటకు వీలగునో అంతవరకు ప్రవేశింపజేసి వెనుకకు ముందుకు శక్తికొలది పీడించుట 'పీడితక' మనబడును.

. యోనిలోపలివరకు ప్రవేశింపజేసినలింగమును పూర్తిగ వెనుకకు లాగి ఒక్కమాటుగా ముందుకు పొడిచినయెడల 'నిరాత' మనబడును.

ఒకప్రక్కగమాత్రమే మేహనమును యోనిలోనికి చొప్పించుట 'వరహాఘాత' మనబడును.

మదనదండమును ఒకమాటు ఒకప్రక్కకు మరొకమాటు మరొకప్రక్కకూ చొప్పించుచు గుచ్చిగుచ్చి రతిచేసినయెడల 'వృషాఘాత' మగును.

ఒకసారి యోనిలో ప్రవేశింపజేసినలింగమును బయటకు తీయకనే రెండుమూడుపర్యాయములు పొడిచిన 'చటకవిలసిత' మగును. భావప్రాప్తిసమయములో ఈవిధానము నవలంబించుట మంచిది.

యువతీయువకులు కాళ్లు బాగుగ చాపి, ఇరువురి అంగములు బాగుగ కలియునట్లు హత్తుకొని కౌగలించుకొని రతి చేయుట 'సంపుటబంధ' మనబడును.

"తేషాం స్త్రీసాత్మ్యాద్వికల్పేన ప్రయోగః":—ఏస్త్రీకి ఏ విధమైనబంధనములు. కృత్యములు సౌఖ్యమును, ఆనందమును కలుగజేయునో గ్రహించి ఆస్త్రీవిషయములో అట్టి ఉపసృప్తాలను అనగా క్రియలను చేయుచుండవలయును. ఆవిధముగ ప్రయోగించుటలో రతిప్రారంభకాలములో కొలదిగను, మధ్యకాలములో మధ్యవేగముగను, చివరసమయములో చండవేగముగను ప్రయోగించుచుండవలయును. యువకుడు చీర ముడి విప్పిబాహ్యోపసృప్తాలు చేయువిధముగనే పురుషాయిత

ములో స్త్రీకూడా ప్రియునివస్త్రమును తొలగించి బాహ్యపురుషాయితములు సలుపవలయును.

యువతి ప్రియుని మదనదండమును చేతితో పట్టుకొని భగముయొక్క ముఖద్వారముమీద యుంచి బాగుగ చాల సేపువరకు రాపిడిచేయుచు, పీడించుచున్నయెడల 'సందశ' మనబడును.

యువతి లింగమును భగములోనికి ప్రవేశింపజేసుకొని కాళ్లు దగ్గరగ ముడిచి, ప్రియునిశరీరముమీద చేతులు ఆనించి కుమ్మరిసారివలె తిరుగుచు రతిచేయుట 'భ్రమరక'మనబడును. ఈ భ్రమరకబంధనములో యువకుడు సౌకర్యముకొరకు తన నడుమును రతిసమయములో మధ్యమధ్య పైకి ఎత్తుచుండవలయును. స్త్రీ తన నడుమును ముందుకువెనుకకు ఆడించి గుండ్రముగ త్రిప్పుచుండినయెడల 'భ్రమిత' మనబడుబంధనమనబడును.

పిదప భగలింగసంబంధమునకు అంతరాయముగలుగకుండ పురుషుని ముఖముమీద తనముఖము నుంచి విశ్రమించవలయును. ఆవిధముగ యువతి రతిసలిపి అలసినపిమ్మట తాను పూర్వము అలసియున్నప్పుడు తనప్రియురాలు తనకు ఏవిధముగ సహాయముచేసెనో, ఆవిధముగనే తానుకూడ ఆమెను వెల్లకిల పరుండబెట్టి తాను పైకెక్కి రతిసలుపవలయును. పురుషాయితములలో ఈవిధానములు చాల సౌఖ్యముగను, ఆనందదాయకముగను నుండును.

యువతి తనస్వభావమును ఎంతకప్పిపుచ్చియున్నను బయటపడనీయక ఎంతగంభీరముగ యున్నను, పురుషాయిత

ములో తనభావములను పూర్తిగ వెల్లడించును. అట్టిపొఖ్య ములో శరీరమును మైమఱచి తనశరీరమును, హృదయమును కొంచెమైనను దాచక వెల్లడిచేయుచుండును.

ఏస్త్రీస్వభావము యెట్టిదో, ఏస్త్రీకోరికలు యెటువంటివో గ్రహించి, ఆయాస్త్రీలను ఆయాబంధనములతోను, క్రియల తోను సంతుష్టిపరచుచుండవలయును. అనగా రతియందు ఏస్త్రీ ఏబంధనమువలన ఆనందమును పొందునో గ్రహించి ఆస్త్రీ యందు ఆబంధనము నుపయోగించవలయునని భావము.

వెలుపలనున్నస్త్రీని, ప్రసవించినవనితను, మృగినాయికను గర్భవతియగుస్త్రీని, లావుపాటిదానిని, పురుషాయితక్రియకు ఉపయోగించరాదు. వెలుపలయున్నస్త్రీ పురుషాయితముచేసిన యెడల గర్భమును ధరించదు. మృగినాయిక పురుషాయితము చేసినయెడల యోని చిన్నది గనుక ప్రమాదము సంభవించును. గర్భముధరించిన స్త్రీ పురుషాయితము చేసినయెడల గర్భము స్రవించిపోవును. లావుపాటిస్త్రీ పురుషాయితము చేయలేదు.



# స్త్రీకి కామోద్రేకమును కలిగించు విధానములు

రతికి ఆరంభసమయములో పురుషుడు ఏమిచేయవలయును ? రతిని ప్రారంభించుసమయములో పురుషుడు ఏమిచేయవలయునో ముందు తెలుసుకొనవలయును.

నాగరకుడు, పీఠమర్దుడు మొదలగు మిత్రజనముతోను, తాంబూలము మొదలగువానిని అందించుసేవకులతోను కలసి పూలమాలలు మొదలగునవి ధరించి, శరీరమునకు పరిమళతైలముల నలదుకొని, శుభ్రమైన తెల్లనివస్త్రములు ధరించి, సువాసనలు వెదజల్లుచు, బాగుగ అలంకరింపబడినగృహమునందలి రతిగృహమును ప్రవేశింపవలయును. చక్కగ అలంకరించుకొనియున్నస్త్రీచేత కొలదిగ మధురపానీయముల త్రాగించి, కుశలప్రశ్నలువేయుచు, మరలమరల పలుకకములగు పానీయములను త్రాగించుచు ప్రియురాలిని శయనముమీద కూర్చుండుమని సంజ్ఞరూపమున తెలియజేయవలయును.

యువకుడు ఒకస్త్రీని ప్రేమించి, ఆప్రేమించినస్త్రీయొక్క పూర్తివిశ్వాసమును, అభిమానమును సంపాదించుటకు ప్రయత్నించవలయును. లతాంగి తనసమీపమునకు వచ్చినవెంటనే పట్టి శయ్యపై పరుండబెట్టి మోటుతనముగ తనకామేచ్ఛను తీర్చుకొనుటకు ప్రయత్నింపరాదు. మొదట ఆమెతో విశేషసన్నిహితసంబంధమును కలిగించుకొనుటకు ప్రయత్నింపవలయును.

యువతులు స్వభావసిద్ధముగ పుష్పములవంటి మృదు స్వభావము గలవారు. పుష్పములను ఏవిధముగ వాడు కొందుమో, వడతులనుకూడ అవిధముగనే వాడుకొనవలయు నని భావము. యువకుడు తన ప్రియురాలిని సమీపించినప్పుడు మోటుతనముగ ప్రవర్తించుపురుషులను సుందరాంగులు అస హ్యించుకొందురు. కనుక పురుషుడు ఆమె సంతోషమునకు భంగము కలుగనివిధముగ ప్రవర్తించుచుండవలయును.

పడకగది మనసున కుల్లాసము కలిగించు వస్తుసముదాయ ముతో నిండియుండవలయును. ఆగదిగోడలను శృంగారచేష్టలను దీపింపజేయు యువతీయువకులపటములచే అలంకరింపవలయును; మరియు నానావిధసుగంధపరిమళయుక్తమగు పుష్పములు, సుగంధద్రవ్యములు కలిగి మనోల్లాసమును కలిగించుచుండ వలయును.

యువకుడు సుందరియొక్క దక్షిణపార్శ్వమున కూర్చుండి తనవామహస్తముతో ఆమెను అలింగనము చేసుకొనవలయును. ఎడమచేతితో ఆమె నెరికురులను భుజములను తడుముచుండ వలయును. నెమ్మదిగ ఆమెను సంభాషణలోకి దింపి కామేచ్ఛను కలిగించుమాటలు చెప్పుచు, మధ్యమధ్య ఆలింగనము చేసు కొనుచు క్రమముగ పరిచయమును వృద్ధిచేసుకొనవలయును. మధ్యమధ్య నోటికి తాంబూలమును అందించుచు; అధరమును ముద్దుపెట్టుకొనుచు లాలనచేయుచు రతికి పురికొల్పవలయును. ఆలింగనము చేసుకొనునప్పుడు ఆమె కుచద్వయము తనశరీర మునకు బాగుగ హత్తుకొనునట్లు చేయవలయును. క్రమముగ ఆమె నీపై వ్రాలునట్లుగ జేసి, ఆమె శరీరమునంతయు చేతితో

తడుముచుండవలయును. కొంచెముసేపు ఈవిధముగ చేయుచున్నయెడల ఆమెమనస్సునందు తప్పక కొంతమార్పు కలుగును. ఇట్టికృత్యములు చేయుచుండుటవలన యువతికి కామేచ్ఛ అధికమగుచున్నది. అప్పు డామె అతనిసంయోగమును కోరుచు రతికి సిద్ధపడుచున్నది. తనతో కలసి యిక సంభోగించుమని అతనిని తొందరచేయును. అట్టిసమయమున ఆమెశరీరమునంతయు ముద్దుపెట్టుకొనుచు, తనచేతిని నెమ్మదిగ ఆమెకుచద్వయముపైకి పోనిచ్చి నెమ్మదిగ పిసకవలయును. తరువాత పురుషుడు నెమ్మదిగ తనచేతులను ఆమెతొడలపైకి పోనిచ్చి హాయికలిగించునట్లు తడుముచుండవలయును. ఇట్లు కేళీవిలాసకృత్యములను విధివిరామము లేకుండ చేయుటవలన కామోద్రేకము క్రమముగ అధికమై ఆమెయే రతికేళికి పురుషుని బలవంతము చేయును.

యువకుడు యువతియొక్క కుచములను పిసుకుటవలన కలుగుసౌఖ్యము ఆమె అనుభవించుచున్నసమయములో, యువకుడు ఆమెమన్మథగృహమునుకూడ చేతితో తడుముచుండవలయును. అట్టిసమయములో ఆమెశరీరమంతయు పులకరించి గగుర్పొడుచును. తరువాత ఆమె తనభావమును స్పష్టము చేయుటకు ప్రయత్నము చేయుచుండును. ఆమెను కౌగలించుకొను నెపముతో నెమ్మదిగ ఆమెతొడలపై నుండువస్త్రమును తొలగించుటకు ప్రయత్నించవలయును. కోకముడి విప్పి నెమ్మదిగ ఆమెశరీరముమీద నుండువస్త్రమును పూర్తిగ తొలగించుటకు ప్రయత్నము చేయవలయును. ఆమెను వస్త్రరహితురాలిగ జేసినపిదప ఆమె సిగ్గుచే కండ్లు గట్టిగ మూసుకొనును.

శయనించునపుడు భర్త వామభాగమునను భార్య దక్షిణభాగమునను పరుండవలయునని శాస్త్రకారులు నిర్ణయించి యున్నారు. తరువాత యువతియొక్క జుట్టును దువ్వుచు, శరీరమును తడుముచు, పమిటను సవరించి, కోకముడిదగ్గరకు చెయ్యి పోనిచ్చి, ముడిని వదలించి రతికొరకు మెల్లమెల్లగ కుడిబాహువుతోకూడ కౌగలించవలయును. ఇదివరలో చెప్పబడినవిధముగ పరిహాసముగ మాట్లాడుచు నాయికను అనేకవిధములుగ రతికేళి కొరకు ప్రేరేపణ చేయవలయును. నాయికకు సంగీతము వచ్చినచో పాడించవలయును. వివిధకళలనుగురించి ముచ్చటించుచుండవలయును. మద్యపానము నిషేధము గనుక పానకములు, పాలు మొదలగునవి తరచు త్రాగుచుండవలయును. ఈవిధముగ యువతికి అనురాగమును కొంత కలుగజేసి అక్కడనున్న మిత్రులకు, పరివారజనమునకు పుష్పములు, గంధములు, తాంబూలముల నిచ్చి బయటకు పంపివేయవలయును. తరువాత ఇదివరలో చెప్పినవిధముగ ఆలింగన, చుంబనాదులచే ప్రియురాలికి కామోద్రేకమును రేకెత్తించవలయును. తరువాత కోకముడిని ఊడదీయవలయును.

స్త్రీ మైథునక్రియకు అంగీకారము చూపనప్పుడు బలవంతముగ ఆమెతో సంభోగము చేయరాదు. స్త్రీ తనకుగల సహజమగుసిగ్గును విడనాడగలిగినప్పుడే ఆమె పురుషునితో సంభోగ సౌఖ్యము పొందుటకు అంగీకరించును. మరియు సంభోగక్రియ ఆమెకు కష్టము కలిగించువిధముగను, శ్రమకలిగించువిధముగను నుండరాదు. ఇట్టివిషయములను ఆమె ముఖలక్షణములనుబట్టి గ్రహించుచుండవలయును.

స్త్రీ సంభోగమున పూర్తిగ ఆపేక్షపొందినప్పుడు ఆమె శరీరము జారిపోవును. శరీరపటుత్వము పూర్తిగ తగ్గిపోవును. ఛేదింపబడినలతవలె పడిపోయి, తనశరీరమును 'నీకు ఇష్టము వచ్చినటుల జేసుకొను' మని ప్రియునకు అప్పగించును. అట్టిసమయమునందు ఆమె మన్మథగృహములో ద్రవపదార్థము స్రవించుటకు ప్రారంభమై ఆప్రాంతమును తడిగ చేయును. ఇట్టిలక్షణములను గుర్తించి ఆమె సంభోగమునకు అభిలషించుచున్నదని గ్రహించవలయును. తరువాత మెల్లగ రతిక్రీడలను ప్రారంభింపవలయును.

స్త్రీకి ఆవిధముగ సంభోగక్రియయందు దుర్భరమైన అభిలాషను కలుగజేసి, పిమ్మట ఉచ్ఛ్రతయందు ఆమెతో సంభోగక్రియలు జరిపినయెడల స్వర్గసౌఖ్యమును అనుభవింపజేసి, ఆమెయొక్క ప్రేమను, అమితవిశ్వాసమును పొందవచ్చును. ఇట్టి సంభోగక్రియలవలననే యువతీయువకులు ఒకరినొకరు విడచి ఒకక్షణకాలమైనను యుండలేనటువంటి ఆదరాభిమానములను ఒకరిపై ఒకరు కలిగియుందురు.

---

# వివిధరకముల బంధములు

1. పొడుచువిధానము:—స్త్రీ, తననడుమును, పురుషుని నడుముకంటె కొంచెము క్రిందభాగములో నుంచవలయును. తనభగమును ఆవిధముగ తెరచియుంచినప్పుడు పురుషుడు లింగమును తేలుకుట్టునట్లు వేగముగ యోనిలోనికి దూర్చవలయును. దీనినే 'పొడుచువిధాన' మందురు.

2. స్త్రీయొక్కనడుమును పురుషుడు రెండుచేతులతో ఎత్తిపట్టుకొని మదనదండమును పూర్తిగ లోనికి చాలలోతువరకు బోవునటులు చేయుటకు 'అవమర్దన' మని పేరు.

3. చాలలోతువరకు లింగమును ప్రవేశింపజేసి చాల సేపు అదుముచుండినయెడల 'బ్రహితక' మందురు.

4. సంభోగకాలచలనము:—లింగమును యోనిలో ప్రవేశింపజేసినతరువాత, లింగమును కొంచెము వెనుకకు లాగుటయు, మరల బాగుగ లోనికి త్రోయుచుండుటయు 'సంభోగకాలచలన' మనబడును.

5. కుమ్ముపద్ధతి:—పురుషుడు మదనదండమును యోని లోనికి జొనిపినతరువాత మరల కొంచెము వెనుకకు లాగవలయును. ఎంతవెనుకకు లాగునో అంతకు కొంచెము అధికముగనే మెల్లగ బలముతో లోనికి లింగమును నెట్టవలయును. దీనినే 'కుమ్ముువిధాన' మందురు.

6. పిచ్చుకమైథునము:—లింగమును లోనికి ప్రవేశింపజేసినపిదప వెనుకకును ముందునకును లాగిగ్రుచ్చబడుటయు.

పూర్తిగ బయటకు లాగివేయకనే ముందునకును వెనుకకును ఆడింపబడుటయు జరిగిన దానిని 'ఊరుపిచ్ఛిళమైథున' మందురు. ఈవిధానమును 'పాదకవిలాసిత' మనికూడ అందురు.

7. హంసమైథునము:—లింగమును యోనిలో జొనిపిన పిదప పైభాగముననే అనగా యోనిలో చాలలోతుగగాక, పైభాగముననే లింగమును వెనుకకు ముందునకు ఎక్కువసేపు రాయుచుండుటకు 'హంసమైథున' మనిపేరు.

8. ఎద్దువలె సంభోగించుట:—భగరంధ్రములో పెట్టిన లింగమును భగరంధ్రముయొక్క రెండుఅంచులను శక్తికొలది బిగబట్టి రాయుచు చాలసేపు వెనుకకు ముందుకు ఆడించుటకు 'వృషభమైథున' మనిపేరు.

మైథునక్రియ జరుపుటకుపూర్వము యువకుడు స్త్రీ యొక్క శరీరబలమును, కామోద్రేకమును బాగుగ గ్రహించ వలయును. లేనిచో యువతి సంభోగక్రియయందు సౌఖ్యము అనుభవించుటకు మారుగ విశేషశ్రమను పొందును. అందుచే యువకుడు స్త్రీల ఉత్సాహమును గ్రహించగలుగుజ్ఞానము కలిగియుండవలయును సంభోగక్రియయందు పరస్పర సౌఖ్యము ముఖ్యావసర మని గుర్తించవలయును. సాధారణ సంభోగ సమయములలో యువతి తనతొడలను అధికముగ విప్పకను, మిక్కిలి దగ్గరగ పెట్టకను సామాన్యమైనదూరములో నుంచు కొనవలయును. అన్నిజాతులవారికిని ఈవిధానము విశేషసౌఖ్య దాయకముగ నుండును. కామకళారంగములో ఈవిధానమే విశేషముగా వాడుకలో నున్నది.

యోనిద్వారము చిన్నదిగగలయువతి తనతొడలను బాగుగ వేరుచేసి పురుషదండమును యోనిలోనికి ప్రవేశింప జేసుకొనవలయును. యోనిరంధ్రము పెద్దదిగ గలస్త్రీ సంభోగ సమయమున తనతొడలను దగ్గరగపెట్టి లింగమును ప్రవేశింప జేసుకొనవలయును.

భగరంధ్రము చిన్నదిగగలస్త్రీ వెల్లకిల పరుండి తనతొడలను బాగుగ వేరుచేసి యోనిరంధ్రమును ఎంతపెద్దదిగ చేసుకొనుటకు వీలగునో అంతపెద్దదిగ చేసుకొనవలయును. ఆవిధముగ చేయుటవలన శ్రమలేకనే రతిక్రీడ జరిగిపోవును.

9. విజృంభితబంధవిధానము:—ఈవిధమైన బంధములో నారీమణి తనపిఱుదులను బాగుగ పైకి ఎత్తుచుండవలయును. మరియును బాగుగ విప్పియుంచుకొనవలయును. ఈవిధముగ చేయుటవలన యోనిరంధ్రమునకు పైభాగమునందుండు పెదవులు బాగుగ విడిపోయి, ఆవలించినప్పుడు నోరు తెరువబడిన విధముగ తెఱచుకొనియుండును. అందువలననే దీనికి 'విజృంభితక' మని పేరువచ్చినది.

10. తిర్యకబంధము:—వామభాగమున పురుషుడును, దక్షిణభాగమున స్త్రీయు శయ్యపై పరుండి, స్త్రీయొక్క ఎడమ కాలు పురుషుని కుడితొడపై నుంచి సంభోగించుట 'తిర్యక' మనబడును.

11. శంబుతకబంధము:—స్త్రీ వెల్లకిల పరుండి తన రెండు కాళ్లను బాగుగ చాచియుంచి తనతొడలను లింగము భగములోనికి ప్రవేశింపజేయుటకు వీలుగనుండునట్లుగ వేరుచేసి సంభోగము జరుపుట 'శంబుతక' మనబడును.

12. వేష్టితకబంధము:—శంబులకబంధములో అనగా పైనచెప్పబడినవిధముగ స్త్రీ తనకాళ్లను పురుషునికాళ్లకు చుట్టి యుంచిన యోనిరంధ్రము చిన్నది యగును. అట్టియోనియందు పురుషుడు లింగమును ప్రవేశింపజేసి సంభోగము జరుపుట 'వేష్టితకబంధన' మనబడును.

13. అదిమికొట్టునట్టివిధానము:—లింగమును యోని లోనికి బాగుగ పోనిచ్చినతరువాత స్త్రీ తన రెండుతొడలను దగ్గరగ చేర్చి అదుమవలయును. ఆవిధముగ చేయుటవలన యోనిరంధ్రము చిన్నదై, ప్రక్కదవడలచే లోపల లింగమును అదిమిపట్టును. అప్పుడు లింగమునకు విశేషసౌఖ్యదాయకముగ నుండును. అట్టిసమయములో పురుషుడు తనలింగమును వెనుకకు లాగలేక ముందునకు బాగుగనొక్కి అదుముచుండును. దాని వలన యోనిలోపలిభాగములో స్త్రీకి విశేషసౌఖ్యము కలుగును.

14. వర్గవాహబంధము:—స్త్రీ తనయోనిని ముడుచు కొనినటులజేసి, లింగమును చేతితో పట్టుకొని బలవంతముగ యోనిలోనికి ప్రవేశింపజేసుకొని, లింగమును బయటకు పోనీయ కుండ చూచుకొనుచు చేయురతివిధానమునకు 'వర్గవాహ' మని పేరు.

15. వంగి చేయురతివిధానము:—స్త్రీ వెల్లకిల పరుండి తనరెండుతొడలను దగ్గరగ చేర్చవలయును. కాళ్లను బాగుగ ఎత్తియుంచి రతిక్రీడను సలుపుమని పురుషుని కోరవలయును.

16. గ్రామ్యబంధము:—స్త్రీవెల్లకిలపరుండితనరెండుకాళ్లను పైకెత్తి, సంభోగమునకు ఎదురుగ కూర్చొనియున్నపురుషుని

భుజములపై నుంచును. దీనినే 'జృంభితబంధ' మనియు 'గ్రామ్య' మనియు చెప్పుదురు.

17. వేణుదారితకము:—స్త్రీ వెల్లకిల పరుండి ఒకకాలు పైకెత్తి ఎదురుగ కూర్చుండుపురుషునిభుజముమీద పెట్టవలయును. రెండవకాలు పొడుగ చాచియుంచవలయును. స్త్రీ ఆవిధముగ నున్నప్పుడు పురుషుడు రతిచేయవలయును. ఈబంధములో యువతి తనపాదమును పురుషునిభుజముమీద మార్చి మార్చి పెట్టుచుండవలయును. ఈవిధముగ చేయుటవలన భగరంధ్రమున లింగము రెండువైపులను బాగుగ రాచుకొనును.

18. శ్వాసితకబంధము:—స్త్రీ వెల్లకిల పరుండి ఒకకాలు పొడుగ చాచియుంచవలయును. ఒకకాలును తనశిరస్సును తాకుచున్నట్లుగ యుంచవలయును. ఆవిధముగ సంభోగముచేయుట 'శ్వాసితకబంధ' మనబడును.

19. బర్హితకబంధము:—స్త్రీ వెల్లకిల పరుండి తనరెండు కాళ్లను బాగుగ పైకి ఎత్తవలయును. తరువాత కుడితొడను ఎడమతొడమీదను, ఎడమతొడను కుడిపాదముమీదను మార్చిమార్చి సంభోగసమయములో నుంచవలయును. ఇది 'బర్హితకబంధన' మనబడును.

20. పద్మాసనబంధము:—సంభోగసమయమున యువతి వెల్లకిల పరుండి తనతొడలను పైకెత్తియుంచును. మోకాళ్లను ముడిచి ఒకకాలుమీద మరియొకకాలు నుంచవలయును. ఈ విధానమునకు 'పద్మాసన బంధ' మని పేరు.

21. వంగువిధానము:—యువతి బోర్లపడుండినప్పుడు పురుషుడు ఆమెమీద పడుకొని వెనుకభాగమునుండియే లింగమును యోనిలో ప్రవేశింపజేయవలయును.

స్త్రీకి ఇష్టములేనిసమయములలో, సంభోగమునకు బలవంతముచేయకూడదు. ఈవిషయమును ప్రతిపురుషుడును తప్పక పాటించవలయును. స్త్రీకికూడ కామేచ్ఛకలిగినప్పుడేసంభోగము ఆనందసంధాయకముగ నుండును.

కామోద్రేకము పూర్తిగ జెందియున్న స్త్రీని ఎంతటి బలశాలియైనపురుషుడైనను తృప్తిపరచలేడు. పురుషులకామేచ్ఛ నియమితమైనదిగ నుండును. స్త్రీలకామేచ్ఛకు కట్టుబాటు కనబడదు. అందువలన పరిపూర్ణకామేచ్ఛ గలస్త్రీని, పురుషుడు తృప్తిపరచలేకున్నాడు. అన్నిసమయములయందును పురుషులయందు కామేచ్ఛ ఒకేవిధముగ నుండదు. ఏదేని ఒకసమయమున ఒకపురుషునకు కామేచ్ఛ అధికముగ నుండకపోవచ్చును. అంతమాత్రమున ఆతనియందు కామేచ్ఛలేదని భావింపరాదు. మరొకసమయమున ఆవ్యక్తియందే కామోద్రేకమును అధికముగ కలుగవచ్చును. కొందరు కామోద్రేకమును అధికముగ కలిగియుందురు. కొందరియందు సామాన్యముగ నుండును. కామోద్రేకముచెందినస్త్రీ పతియందు తృప్తిచెందనియెడల నిరుత్సాహమును పొందుచున్నది. తన్మూలమున ఆమెలో ఉత్సాహము క్రమముగ నశించును.

---

# ఆలింగన సౌఖ్యము - విధానములు

సంభోగము అరువదినాలుగు ప్రకరణములతో ఒప్పు చున్నది. అందువలననే దానిని చతుష్షష్టి అని చెప్పిరి. ఈచతుష్షష్టికి అంగభూతమైనదికూడా చతుష్షష్టియనియే మనప్రాచీనులు తెలిపియుండిరి. ఈచతుష్షష్టినిగురించి మనము తెలిసికొనవలయును.

సంభోగమునకు అంగభూతమైనఉపాయశాస్త్రము(కామశాస్త్రము) అరువదినాలుగుభాగములు కలిగియుండుటవలన చతుష్షష్టి అని చెప్పబడుచున్నది.

అంతియేగాక కళలు చతుష్షష్టి యగుటవలనను, ఆకళలే సంప్రయోగమునకు అంగములుగ నుండుటవలనను, ఆకళలను సంగ్రహించి తెలిపినస్వరూపమే చతుష్షష్టి యని చెప్పినను చెప్పవచ్చును..

ఆలింగనము, చుంబనము, దంతక్షతము, నఖక్షతము, సీత్కారము, పాణిఘాతము, సదంశము, ఉపసృప్తము, వరాయితము అని పిలువబడు అంగములతో (భాగములతో) చెప్పబడిన ఋగ్వేదమునందలి ఋక్కులకు చతుష్షష్టి అనిపేరు గలదు. ఋగ్వేదములో పాంచాలు డనుమహర్షి అనేకఋక్కులతో. ఈచతుష్షష్టికళలను చెప్పియుండెను. మరియు పాంచాలదేశీయుడైన బాభ్రవ్యుడు తానువ్రాసిన 'సాంప్రయోగ'మను గ్రంథములో ఈచతుష్షష్టికళలను గురించి తెలిపియుండెను. పైనచెప్పబడిన పాంచాలమహర్షికిని, బాభ్రవ్యునకును గోత్ర

సంబంధ ముండుటవలన, గౌరవముకొరకు ఈసంజ్ఞ ఏర్పడినట్లుగ కొందఱు వ్రాయుచున్నారు.

ఆలింగనము, చుంబనము, నఖక్షతము, దంతక్షతము, సంభోగము, సీత్కృతము, పురుషాయితము, ఔపరిష్టము అను నీ యెనిమిది, ఒక్కొక్కటి మరల ఎనిమిదివిధములుగ భేద ములు కలిగియుండుటవలన ఎనిమిది ఎనిమిదులు అరువదినాలుగు గనుక వీనికి చతుష్షష్టికళ లని పేరువచ్చినదని బాభ్రవ్యునిశిష్యులు చెప్పిరి.

కాని ఆలింగనము మొదలగు ఎనిమిదివిధములందును, ఒక్కొకదానియందు బాభ్రవీయులు తెలిపినవిధముగ ఎనిమిది భాగములు కనబడుటలేదు. పురుషాయితములో భేదములు తక్కు వగ నున్నవి. ఆలింగనాదులయందు భేదములు ఎనిమిదికంటె అధికముగ నున్నవి. ఈవిధముగ కొన్నిటియందు భేదములు తక్కువగను, కొన్నిటియందు అధికముగను నుండుటవలనను, ప్రహణనము, విరుతము, పురుషాయితము, చిత్రరతులు మొద లగునవికూడ వీటిలో కలియుచుండుటవలనను ఈచతుష్షష్టి యని పేరు ఏడాకులకుట్టు అయిదువర్ణములతో బలికర్మ అను నట్లు సామాన్యముగ వచ్చినదేగాని, అర్థముతో కూడుకొనినది కాదని వాత్స్యాయనులవారి వాదము.

చుంబనము (ముద్దుపెట్టుకొనుట) కంటె ఆలింగనము ముందు చేయవలసినది గనుక, ఆలింగనమునుగూర్చి తెలుపు చున్నాను.

అంతకుపూర్వము ఆలింగనసౌఖ్యమును పొందక కౌగి లించుకొనవలయు ననేఅభిలాష కలిగినస్త్రీపురుషులు తమతమ

పరస్పరప్రేమను సూచించుకొనుటకు చేసుకొనబడు కౌగిలింతలు 'ఆలింగనము' లనబడును. ఈ ఆలింగనము సంభోగమునకు మొదటిమెట్టు. ఈ ఆలింగనములను రెండువిధములుగ భాగింప వచ్చును. 1. అంతకుపూర్వము ఆలింగనసౌఖ్యమే యెరుగనివారు. 2. ఆలింగనసౌఖ్యము ఇదివరలో బాగుగ అనుభవించినవారు.

ఈఆలింగనములు 1. స్పృష్టకము, 2. విద్ధకము, 3. ఉద్ఘృష్టము, 4. పీడితకము అని నాలుగురకములు.

1. ప్రియురాలు తనకు ఎదురుగ వచ్చునప్పుడు ఏదోవంక బెట్టుకొని ఆమెప్రక్కనుంచి పోవుచున్నట్లు నటించి ఆమె శరీరమునకు తన శరీరము బాగుగ రాచుకొనునట్లుతాకుట 'స్పృష్టక' మనబడును. ఈ ఆలింగనమువలన శరీరమంతయు పులకరించి యిరువురిమధ్యను ప్రేమ అధిక మగును.

2. యువతి పురుషుడు ఏకాంతముగ నున్నసమయమును కనిపెట్టి ఏదో నెపముపెట్టుకొని అతనిదగ్గరగపోయి కుచములతో బాగుగ నొక్కవలయును. పురుషుడుకూడ యువతిని గట్టిగా కౌగిలించుకొనవలయును. ఇది 'విద్ధకఆలింగన' మనబడును.

పైన తెలుపబడిన రెండువిధములైన ఆలింగనములును అంతకుపూర్వము విశేషపరిచయము లేని నూతనదంపతులు చేసుకొనునవిగ నున్నవి. ఇందు మొదటివిధానమును పురుషుడు ప్రయోగింపవలయును. రెండవవిధానమును స్త్రీ ప్రయోగించవలయును. ఇవి విశేషపరిచయము గల కామినీకాముకులు అవలంబింపవలసినవిధానములు గావు.

3. జనసమూహములోగాని, అసలు ఇతరు లెవ్వరు లేని ప్రదేశములోగాని చీకటిగా నుండుసమయములో ఇతరు

లెవ్వరు చూడనివిధముగ స్త్రీపురుషులు మెల్లమెల్లగ కలసి నడచుచు, ఒకరినొకరు చాలసేపు శరీరములు రాచుకొనుట 'ఉద్ఘర్షణ' మనబడును. యువతిని యువకుడును, యువకుని యువతియు ఒకరిశరీరమును ఒకరు గట్టిగ రాచుకొనుట 'ఉద్ఘృష్టక' మనబడును.

పైన చెప్పబడిన ఉద్ఘృష్టఆలింగనమును గోడకుగాని స్తంభమునకుగాని ఆనించి చేసినయెడల 'స్ఫూటక' మనుఆలింగన మనబడును. దానిని ఇంకను గాఢముగ నొక్కి చేసినయెడల 'పీడితకఆలింగన' మగును.

ఈ రెండువిధములగు ఆలింగనములును విశేషపరిచయము గల యువతీయువకులు ఆచరింపదగినవి.

సంభోగసమయములో 1. లతావేష్టితకము, 2. వృక్షాధిరూఢకము, 3. తిలతండులకము, 4. క్షీరకము అను నాలుగు విధములైన ఆలింగనములు కామినీకాముకులు గావించుకొనుచుందురు. ఇందు మొదటిరెండును యువతిచేతను, మిగిలిన రెండును యువకునివలనను చేయబడవలయును.

1. లతావేష్టితకము:—లత అనగా తీగ. ఒకలత తనకు మిక్కిలి సమీపమునందు గల మరొకలతనో, కొమ్మనో, వృక్షమునో పెనవేసుకొనినట్లు ఒకయువతి నిలువబడియున్న తన ప్రియుని తనబాహువులతో పెనవేసుకొనినట్లు ఎదురుగ నిలువబడి కౌగిలించుకొని, అతనిముఖమును గాఢమైనప్రేమతో ముద్దుపెట్టుకొనుచు, అతనిపెదవులను చప్పరించుచు, తనపెదవులను అతనినోటి కందించుచు, లతవలె అతనిశరీరమును చుట్టుకొని పైకి ఎగబ్రాకుచు, తనముఖమును అతనిముఖమునకు

కొంచెము క్రిందుగా నుంచి మెల్లగ సీత్కారముచేయుచు, గాఢముగ కౌగిలించుకొనువిధానము 'లతావేష్టితక' మన బడును.

2. వృక్షాధిరూఢకము:—యువతి తన ప్రియునికాలిని నొక్కిపట్టి రెండవకాలితో అతనితొడమీదుగ నడుమును చుట్టుకొని నిలువబడి; ఒకచేతితో అతనిని వీపుమీదుగ చుట్టి కౌగిలించుకొనుచు, రెండవచేతితో మెడ వంచుచు మందముగ సీత్కారముచేయుచు చెట్టుఎక్కునట్లు నాయకునిమీద ఎక్కుచు ముద్దుపెట్టుకొనుట 'వృక్షాధిరూఢక' మనబడు ఆలింగన మగును.

పైన చెప్పబడిన రెండువిధములగు ఆలింగనములును యువతీయువకులు నిలువబడి కామోద్రేకమును వృద్ధిపరచు కొనుటకు ఆచరింపవలసినవి.

3. తిలతండుకము :—యువతీయువకులు ఒకశయ్య మీదనే ఒకరికొకరు ఎదురుముఖములుగ పరుండి ఒకరిపెదవు లను ఒకరు చప్పరించుకొనుచు, ఒకరితొడమీద ఒకరితొడ యుంచి, ఇరువురివక్షస్థలములు దగ్గరగ హత్తుకొనుచు, ఒకరి కామానుబంధముతో ఒకరిని గట్టిగ బిగియార కౌగిలించుకొను విధానము 'తిలతండులక ఆలింగన' మనబడును.

4. క్షీరజలక ఆలింగనము:—ఒకరిపై నొకరికి కలిగిన ప్రేమాధిక్యముచేత పరవశులై శరీరములు మరచి నీవు నేను అను భేదము లేకుండా అన్యోన్యభావములతో పాలును నీరును కలసిపోయినట్లు కలసిపోయి గాఢముగ ఆలింగనముచేసుకొనుట 'క్షీరజలకఆలింగన' మనబడును. ఈఆలింగనము సంభోగసమయ మునగాని సంభోగమునకు తయారుగనున్నసమయమునగాని

అనుభవింపబడుచున్నది. ఇట్టి గాఢపరిష్వంగనమువలన శాశ్వతానందసౌఖ్యము కలుగుచున్నవి. తిలతండులకము, క్షీరజలకము అనబడు పైనచెప్పబడిన రెండువిధములైన ఆలింగనములను, యువకుని మదనదండము దారుఢ్యమునుజెంది విజృంభించి రతిక్రీడకు సిద్ధమై స్త్రీయోని ద్రవించుసమయములో ఆచరింపబడుచుండును.

ఈ పైనచెప్పబడిన ఆలింగనములు బాభ్రవ్యునిచే చెప్పబడినవి. ఇక సువర్ణనాభుడు తెలిపిన ఒక అవయవముతో చేసుకొనబడు ఆలింగనములు తెలుపుదును.

పురుషుడు తన రెండుతొడలతోను యువతియొక్క ఒక్కతొడనుగాని, రెండుతొడలనుగాని తనశక్తికొలది గట్టిగ అదిమినొక్కినయెడల 'ఊరూపగుహన' మనబడును.

ఉపగుహన మనునది రెండురకములు. అందు మొదటిదానిలో యువతీయువకులు ఒత్తిగిలి ఒకరికి ఎదురుగ ఒకరు పండుకొనియున్నప్పుడు యువతి తనప్రియుని మదనదండమును చేతితో పట్టుకొని తనయోనికి తాకించుకొనుచుండును. ఇక రెండవరకములో భగలింగసంబంధము ఉన్నను లేకపోయినను ప్రియునిబొడ్డునకు క్రిందుగా నుండుభాగమును యువతి గట్టిగా తనతొడలసందులో నిరికించి బిగించుపట్టుకొని అట్టి ఆనందసమయములో తలముడి విడిపోయినను తెలుసుకొనలేక చుంబనములకొరకు, నఖక్షతములకొరకు దంతక్షతములకొరకు ప్రణయతాడనములకొరకు ప్రియునిమీదకు దూకుచున్నయెడల అది 'జఘనోపగుహన' మనబడును. ఈ రెండువిధములగు ఉపగుహనములందును స్త్రీయోని నేత్రానందసంధాయక

ముగ నుండును గనుక విశేషశోభాయమానముగ నుండును. యువతి అట్టిసమయములో యోనిని దాచక స్పష్టముచేయుట ఇంకను మంచిది.

ప్రియుడు కూర్చొనియున్నప్పుడుగాని ఒత్తిగిలిపడుండి యున్నప్పుడుగాని యువతి అతనిముఖమునకు ఎదురుగ తనముఖ మును పెట్టి తనమెడ వెనుకకు పెట్టి వక్షము ముందునకు పెట్టి తనకుచములతో అతనివక్షమును గట్టిగ అదుముచు అతనికౌగి లిలో చేరి, తనచన్నులను అతని రొమ్మునకు పెట్టి అదుము చుండుట 'స్తనాలింగన' మనబడును.

ముఖములో ముఖము పెట్టియు, కళ్లతో కళ్లు చేర్చియు, ఫాలభాగముపై ఫాలభాగము నుంచియు ఆలింగనము చేసు కొనుట 'లాలాటిక ఆలింగన' మనబడును.

చర్మమునకు, మాంసమునకు, ఎముకలకుకూడ సౌఖ్య మును కలుగజేయును గనుక కాళ్లుపిసుకుట, వళ్లుపిసుకుట మొద లైన సంవాహనక్రియలుకూడ మరొకవిధమగు ఉపగుహాన ఆలింగనములుగ కొందరు శాస్త్రకారులు చెప్పిరి, ఇందు పూర్ణ సౌఖ్యము బాగుగ కలుగును.

సౌఖ్యమును కలుగజేయుచుండుటవలనను, పూర్ణసౌఖ్య ములో తేడా లేకపోయినను, ఇది ఉపగుహానసమయములో గాకపోయినను ఇతరసమయములలో చేయబడుచుండుటవల నను, దీనివలన కలుగుసౌఖ్యములుకూడ వేరువిధముగ నుండుట వలనను, సంవాహనము ఉపగుహానమునకు సంబంధించినది కాదని చెప్పవలసియున్నది. ఉపగుహాన మనునది స్త్రీపురుషులలో ఎవరి చేత చేయబడినను, ఇరువురకునుకూడ సౌఖ్యమును కలుగ

జేయుచున్నది. కాని సంవాహనమునందు మాత్రము పురుషుడు చేసిన స్త్రీకిని, స్త్రీ చేసినయెడల పురుషునకును సౌఖ్యము కలుగుచున్నది. అందువలననే దానిని అసాధారణ మని తెలిపిరి.

ఆలింగనవిధానములు తెలుసుకొనవలయు నను అభిలాషతో ప్రశ్నించువారికిని, చెప్పుచుండగ ప్రక్కనసుండి వినువారికిని, అట్టిరహస్యములు గ్రహించి తాను ఇతరులకు చెప్పువారికికూడ సంభోగమునందు అభిలాష కలుగుచుండగ, ఇక వీటిని సంభోగమునకుపూర్వము యువతీయువకులు ఆచరించిన యెడల కామోద్రేకము అధికమగు నని వేరుగ చెప్పవలయునా?

కామోద్రేకమును కలిగించు ఆలింగనములు ఇందు చెప్పబడినవిగాక ఇంకను అనేకరకములు ప్రపంచములో నుండవచ్చును. అట్టి ఆలింగనములను వారివారి అభీష్టములకొలది ప్రయోగింపవచ్చును. అట్టి ఆలింగనములనుకూడ ఆచరింపవచ్చును. అనగా ఇట్టిఆలింగనములు సంభోగమునకు ప్రోత్సాహకరములైనవిగ నుండును.

ఈశాస్త్రములో తెలుపబడినవానిని ప్రయోగించుట కసాధ్యమగునా? అనువిషయమును మొదట తెలుసుకొనవలయును. శాస్త్ర మనునది విజ్ఞానమును కలుగజేయుటకు మార్గదర్శిగ నుండును. అజ్ఞాన మను చీకటిని పారద్రోలును. అనగా కొంతవరకు వివేకమును కలుగజేయునేగాని, సంభోగక్రీడలలో ప్రవేశించినపిదప ఈశాస్త్రములు, విధానములు అవసరము లేకుండగనే పనులు జరిగిపోవుచుండును. కామచక్రము ఒకసారి త్రిప్పబడినప్పుడు క్రమముగాని, విధానముగాని ఆచరించుటకు

అసాధ్యముగ నుండును. ఇట్టివిషయములన్నియు అనుభవము వలన సులభముగ తెలుసుకొనవచ్చును.

సంభోగసమయములో పైన తెలుపబడినవన్నియు కాల క్రమమున అనుభవమునకు రాగలవు. రాగకాలమున ఏవిధ మైన ఆలింగనము చేయవలయు ననుకుతూహలము కలుగునో, ఏ ఆలింగనము చేయుటవలన సౌఖ్యము కలుగు నని తోచునో, ఆవిధమైన ఆలింగనమునే చేయవలయు నని శాస్త్రకారులు తెలుపుచున్నారు.

సంభోగసమయములోమాత్రము ఆలింగనమే సౌఖ్య దాయకముగ నుండును. మిగిలినసమయములయందు మర్దనము చేయుట (వళ్లుపిసుకుట, కాళ్లుపట్టుటయు,) రాచుకొనుటయు సౌఖ్యకరములుగ నుండును. కాముకులు ఒకరినొకరు అనుమాన ములు లేనిదెంపములతో గాఢాలింగనము చేసుకొనుటవలన వారియందు కామోద్రేకము అధికమగును. ఆలింగనమువలనను, రాచుకొనుటవలనను అనగా ఈ రెండువిధములైన స్పర్శలవల నను విశేషసౌఖ్యము కలుగుచున్నది. కనుక సంభోగసౌఖ్య క్రియలలో ఆలింగనము మొదటిమెట్టుగ పరిగణింపబడుచున్నది.

---

# చుంబన మర్మములు

నారీమణులకు కామోద్రేకమును కలిగించుటకు చుంబన క్రియ ప్రధానముగ కనబడుచున్నది.

సంభోగము అనగా పురుషునిలింగమును యోనిలో ప్రవేశింపజేయుక్రియ. అట్టి సంభోగమునకుముందు చుంబనలను అనగా ముద్దులను అధికముగ ప్రయోగించుటవలన స్త్రీలకు కామోద్రేకము అధికమగును.

ఆలింగనముతరువాత పరస్పరము కేళీవిలాసములను సలుపుకొనుటలో చుంబనము చేసుకొనవలయును. ఆలింగనము చేసుకొని ముద్దుపెట్టుకొనవలయునా? లేక ముందుగనే ముద్దు పెట్టుకొని తరువాత ఆలింగనము చేసుకొనవలయునా? అను ప్రశ్న కలుగును. నఖక్షతములు, దంతక్షతములు ఎప్పుడు చేయవలయును? అను ప్రశ్న అనవసరము. వీటిని ఆచరించుటలో క్రమము అవసరము లేదు. కామోద్రేకము మితిమీరిన పిమ్మట వీటిని ఆచరించుటలో క్రమమును ఎవరును పాటింపలేరు.

సంభోగసమయములో ముఖ్యముగ ప్రణయతాడనములు, సీత్కృతములు చేయవలయును. కామోద్రేకము అధికముగ పొందియున్నప్పుడు కాముకులు చిరుదెబ్బలనుకూడ ఓర్వగలుగుదురు. అట్టి చిరుదెబ్బలే ప్రణయతాడనము లనబడుచున్నవి. అట్టి చిరుదెబ్బలవలన సీత్కారములుకూడ బయలు

దేను. ఆలింగనము, చుంబనము, నఖక్షతము మొదలగునవి యన్నియు సంభోగమునకుముందే ఆచరించవలయును. లేని తరువాత అవి రుచింపవు. రతికాలములో స్త్రీ శరీరమును తడుముట, తట్టుట యనునవి సహజముగ జరిగిపోవువిషయములు. యువతీయువకులు ఒక్కొక్కప్పుడు చాలసేపు ఒకరి నోటిలోపలికి ఒకరు నాలుకను పోనిచ్చి, నాలుకలతో నాకుకొనుచున్నారు. అట్టికృత్యమువలన కలుగుఆనందమును అనుభవించుచున్నారు. ఇట్టికృత్యములకు సమయముగాని కారణముగాని అవసరములేదు. కనుక వీటిని సందర్భోచితముగ నాచరించుచుండవలయును. కాని వీటిని అమితముగ చేయరాదు. క్రియలనుమాత్రము మార్చిమార్చి చేయుచుండవలయును. కామకేళీవిలాసములు చాలసేపు చేయవచ్చును. మరియు ఆలింగనము, చుంబనము మొదలగువాటినన్నిటిని ఒకేపర్యాయము కామోద్రేకము రేకెత్తించుటకు చేయవచ్చును.

చుంబనములు ఏయేప్రదేశములలో చేయవలయును? ఎప్పుడు చేయవలయును? వానివిధానములు మొదలగు విషయములన్నియు వాత్స్యాయనుడు తెలిపియుండెను. చాలసేపు రతిచేయగలిగినపురుషుడు చుంబనము మొదలగునవి అధికముగ చేయగలుగును. మందవేగుడు, మధ్యవేగుడుమాత్రము వీటిని సంభోగమునకుముందుగనే చేయవలయును. కాని చుంబనాదిపంచకమును (చుంబనము, నఖక్షతము, దంతక్షతము, ఆలింగనము, ప్రణయతాడనము - ఇవి చుంబనాదిపంచక మన బడును.) రతిప్రారంభములో సామాన్యముగ చేయుచు, రతిమధ్యలో ప్రియురాలు బాగుగ అనుకూలమైనపిమ్మట "నావలన

నీ కేమికావలయునో చెప్పుము" అని అడుగుచు, లాలించుచు చుంబనాది క్రియలను విధివిరామము లేకుండ చేయుటకు మొదలుపెట్టవలయును. అనురాగముకూడ రతిప్రారంభసమయములో సామాన్యముగ నుండి క్రమక్రమముగ వృద్ధిపొంది మితిమీరును. రతిమధ్యలో యువతీయువకులు శరీరములను మైమరచియుందురు. కనుక అందుకు తగినట్లుగ రతిమధ్యలో ముద్దులు, నఖక్షతములు, దంతక్షతములు, ప్రహణనములు, సీత్కృతములు అధికముగ చేయుచుండవలయును. క్రొత్తస్త్రీయందు వీటిని క్రమవిధానముగ ప్రయోగించవలయును. పురుషుడు తనతొందరనంతను క్రొత్తస్త్రీయందు ప్రయోగించిన బెదరిపోవును.

నుదురు, ముంగురులు, బుగ్గలు, కండ్లు, వక్షస్థలము, స్తనములు, పెదవులమధ్యభాగము, నాలుక - ఇవి ముద్దుపెట్టుకొనుటకు తగినస్థానములని కామశాస్త్రవేత్తలు తెలిపిరి. గజ్జలు, చంకలు, భగముకూడా ముద్దుపెట్టుకొనటకు తగినస్థానములే యని లాలాటదేశీయుడగు పూర్వాచార్యులు వ్రాసియుండెను. ఈవిధముగ చూచినయెడల ముద్దుపెట్టుకొను స్థానములు మొత్తము పదునొకండుస్థానము లగుచున్నవి. కామోద్రేకమునుబట్టియు, దేశాచారమునుబట్టియు ఇంకను పెక్కుస్థానములు ముద్దుపెట్టుకొనబడుచున్నవి. గజ్జలు, చంకలు, భగము-ఇవి శిష్టులు ముద్దుపెట్టుకొనుటకు తగినస్థానములు కావని వాత్స్యాయనులవారి అభిప్రాయము.

రెండుపెదవులను సగమువిచ్చినపుష్పమువలె దగ్గరగ చేర్చి యితరులశరీరముమీద ఎక్కడైనను తాకుట చుంబన

మనబడును. ముద్దుపెట్టుకొనుటకు పెదవులే తగినస్థానములుగ కనబడుచున్నవి. దానినే ఓష్ఠచుంబన మ్మందురు. అట్టి ఓష్ఠచుంబనములలో అధరోష్ఠము, ఉత్తరోష్ఠము, సంపుటము అని మూడు విధములు కలవు. సాధారణముగ అధరోష్ఠమునే అనగా క్రింది పెదవినే చుంబనమునకు శిష్టులు వాడుచుందురు.

ప్రియునితో విశేషపరిచయము లేకపోవుటవలన యువతి ముద్దుపెట్టుకొనుటకు సిగ్గుపడుచున్నప్పుడు, ముద్దుపెట్టుకొనుమని యువకునిముఖముమీద నుంచునేగాని సిగ్గుచే నింకను ముద్దు పెట్టుకొనలేకపోవును. ముఖము అనగా పెదవులు అని భావము. దీనిని 'నిమిత్తచుంబన' మందురు.

స్ఫురిత చుంబనము: — యువకుడు తనక్రిందిపెదవిని ప్రియురాలినోటియందు ప్రవేశింపజేసినప్పుడు యువతి సిగ్గుచే సందేహించుచు తనప్రియునిపెదవిని తనపెదవులతో అందుకొనుటకు ప్రయత్నించి క్రిందిపెదవినిమాత్రమే కదలించును. పైపెదవిని కదలించుటకు సిగ్గుపడుచుండును. రెండుపెదవులను కదలించినయెడల గ్రహించినట్లగు యగును. ఇది 'స్ఫురితచుంబన' మనబడును.

ఘట్టితక చుంబనము : — కొంత సిగ్గు వెనుకకు లాగుచుండగా తనరెండుపెదవులను ముందుకు చాచి ప్రియునిపెదవులను తనపెదవులతో అందుకొని, కండ్లను మూసుకొని, తనచేతులతో ప్రియునికండ్లుకూడ మూసి నాలుక చివరభాగమును కదలించుచు, ప్రియుని అధరోష్ఠమును పానము చేయుట 'ఘట్టితక చుంబన' మనబడును.

ఈ పైనచెప్పబడిన చుంబనములు అనివారలో విశేషపరిచయములేనిస్త్రీలు ప్రయోగింపవలయును.

యువతి తనప్రియునకు ఎదురుగ నిలువబడి అతని అధరమును ముద్దుపెట్టుకొనుట 'దిసమచుంబన' మనబడును. రెండు పెదవులను ముందుకు చాచి ప్రియుని అధరములను చివరవరకు గ్రహించుట 'తిర్యక్చుంబన' మనబడును. తనరెండుచేతులలోను ప్రియుని శిరస్సును, గడ్డమును పట్టుకొని తనపెదవులు కదలించుచు చుంబనము చేయుట 'ఉద్భ్రాంతిక' మనబడును. యువతీ యువకులు ఒకరిపెదవులను ఒకరు బాగుగ నోటిలో జొనిపించి అధరపానము చేయుచు ముద్దుపెట్టుకొనుట 'అవపీడితక'చుంబన మనబడును. ఇట్టి అవపీడితక మింకను రెండువిధములుగ వివరింపబడుచున్నది. అందు మొదటిది, పెదవులతోమాత్రమే అధరమును గ్రహించి పీడించినయెడల అది 'శుద్ధపీడితక' మనబడును; రెండవది, నాలుకచివరతోకూడ పీడింపబడినయెడల అది 'చూషణ' మనియు, 'అధరపాన' మనియు ఆనబడును.

బొటనవ్రేలిని, చూపుడువ్రేలితో కలిపి వాటితో ప్రియుని క్రింది పెదవిని పట్టుకొని, తననోటిలో పెట్టుకొని పళ్లు నాటనివిధముగ, తనపండ్లలో గట్టిగ పట్టుకొని అధరపానము చేయుచు ముద్దుపెట్టుకొనినయెడల 'అవపీడితక' మనబడును. ఇది అయిదవ రకమగు చుంబనము.

పైన చెప్పబడిన అధరచుంబన సమయములలో యువతీ యువకులమధ్య ఒకవిధమైనజూదము ఏర్పడుచున్నది. ఆవిధముగ కామినీకాముకులు ఇరువురు, ఒకరిపెదవిని ఒకరు అందుకొనుటకు ప్రయత్నము చేయుచుందురు. ముందుగా ఎవరు

రెండవవారిపెదవిని అందుకొనగలుగుదురో, వారు రెండవవారిని ఓడించినట్లగును. కామినీకాముకులు ఇరువురు మామూలుగా ఒకరిపెదవిని ఒకరు పందెముతో పెనగులాడి అందుకొని చుంబనముచేసినయెడల దానిని కపటములేనిచుంబనమందురు. కపటములేని యీజూదములో పురుషుడు సహజముగ బలవంతుడగుటచే, పురుషుడే ముందుగ స్త్రీయొక్క అధరమును గ్రహించగలుగును. కపటజూదములో సుందరియే తనఅందగానిఅధరమును ముందు గ్రహింపగలుగును. ఈవిధముగ నీజూదము కపటములేనిజూద మనియు, కపటజూద మనియు రెండువిధములుగ పరిగణింపబడుచున్నది. ఇట్టిజూదములో జయించినవారిమీద రెండవవారు కలహమునకు కాలుదువ్వుదురు. అట్టి ప్రణయకలహము యువతీయువకులమధ్య అనురాగమును మరింత వృద్ధిచేయునది యగుచున్నది. ఈజూదమునందు వనిత ఓడిపోయి తనమృదువైనఅధరమునకు నొప్పికలిగిన దని కల్లబొల్లియేడుపులు ప్రారంభించి చేతులు విదలించుచుండును. "ఇక నీతో మాట్లాడనులే" అని ప్రియుని బెదరించుచుండును. ప్రియునిఅధరమును తనపండ్లతో అందుకొనుటకు ప్రయత్నించి అందిపుచ్చుకొని, మెల్లగ పండ్లతో అదిమిపట్టుకొనవలయును. ఒకవేళ ప్రియుడే తనఅధరమును అందిపుచ్చుకొనిన, తనఅధరమును ఇక వదలిపెట్టుమని పోట్లాడవలయును. "నేను ఎంతమాత్రము ఓడిపోలేదు. ఓడినది మీరే" యనియు "మరల పందెము వేద్దాము కాచుకో"మనియు పేచీపెట్టవలయును. మరల తానే ఓడి తరువాత ఇంకను అధికముగ చేష్టలుచేయుటకు ప్రారంభించవలయును.

ఇక కపటజూదమునుగురించి చెప్పుచున్నాను. ముఖ చుంబనద్యూతమునందు స్త్రీ ముందుగ తనప్రియుని నమ్మించుటకు ప్రయత్నము చేయవలయును. అతడు ఆవిధముగ నమ్మి పర ధ్యానముగ నుండగ, అకస్మాత్తుగ అధరమును ముందు తన పెదవులతో అందిపుచ్చుకొని, తరువాత అతడు తప్పించుకొను టకు అవకాశము లేకుండా దంతములతో నొక్కిపట్టవలయును. పిమ్మట అతనిఅధరమును ఆవిధముగనే పట్టియుంచిగాని, వదలి గాని మిగిలినకృత్యములు చేయవలయును. ఇట్టి కపటద్యూతము నందుకూడ ఒక్కొక్కప్పుడు వనితకే జయము లభించవచ్చును. ఆవిధముగ కపటజయమును పొంది స్త్రీ పురుషుని "చూచి తివా పాపము ఓడితివి" అని పరిహాసముచేయుటకు మొదలు పెట్ట వలయును. చేతితో చప్పట్లుచేయుచు పరిహాసముచేయుటకు మొదలుపెట్టిన, ఇరువురకు మరింత సంతోషదాయకముగ నుండును. "స్త్రీ చేతులలో ఓడిన ఏమి మగతనము" అని చెప్పుచు గేలిచేయవలయును. అతనిమిత్రులు, సేవకులు విను విధముగ పరిహాసముచేయవలయును. "ఈపర్యాయము చూడుడు, మీ పెదవులు రెండును కొరికివేసెదను" అని నిజముగ చెప్పుచున్నట్లు నటించుచు అతనిని బెదరించుచు, శరీరమును వయ్యారముగ కదలించుచుండవలయును. మీ తెలివితేటలు చూపించవచ్చును, ఈపర్యాయము రమ్మనమని పోట్లాటకు పిలుచుచు కనుబొమలు ఎగురవేయుచు శరీరమును కదలించు చుండవలయును. వయ్యారముగ అతనివైపు చూచుచు నవ్వ వలయును. తరువాత అతనిమీద ఆలింగనములు, చుంబన ములు, నఖక్షతములు, దంతక్షతములు విధివిరామములేక

ప్రయోగించవలయును. పరిహాసముగ ప్రియుని పలకరించుచుండవలయును. మధ్యమధ్య పురుషుడు తాను జయించినను, ఓడిపోయినను ప్రణయకలహావృద్ధి చెందునట్లుగనే చేష్టలు చేయుచుండవలయును. ఆమె అధరమును తన పెదవులతో అంది పుచ్చుకొని, ప్రియురాలు త్రోసివేసినయెడల సీత్కారము చేయుచు, తల పంకించుచు, తనకోరిక నెరవేర్చుకొనుటకు మరల ప్రయత్నముచేయవలయును. కోరికినయెడల మరల కోరకవలయును. త్రోసివేసిన తిరిగి త్రోయవలయును. కలహించిన కలహించవలయును. "సరే మొదటిసారి ఏదో పరాకుగ నుండుట వలన గెలువగలిగితివి. ఈపర్యాయము గెలువుము. చూతము" అని ఆటను మరల మొదటికి తేవలయును. ఈపందెములో కూడ తానే జయమునుపొంది పూర్వముకంటె అధికముగ కామకేళీవిలాసములను జరుపవలయును. ఒకానొకసమయములో ఓడినను పరాకుగ నున్నట్లు నవ్వవలయును. "నాతో ఓడిపోయితిరి; పాపము ఓడిపోయితిరి" అని పరిహాసముచేసినచో "నేను ఓడలేదు ఓడలేదు" అని తిరిగి పరిహాసముచేయవలయును. పోట్లాడినచో తానును పోట్లాడవలయును. చిందులుత్రొక్కుచున్నయెడల తాళమువేయవలయును. బెదరించిన తానును బెదరించవలయును.

ఈ పైనచెప్పబడినచుంబనద్యూతము సలిపినవిధముగనే నఖక్షత, దంతక్షత, ప్రణయతాడన ద్యూతములుకూడ ఆచరింపవలయును.

ఈ పైనచెప్పబడినజూదములు దీక్ష కాలము రతిచేయు

గలిగిన యువతీయువకులుమాత్రమే ఆచరింపగలుగుదురు కాని మందవేగులు మధ్యవేగులు ప్రయోగించలేరు.

యువతి తన అధరోష్ఠమును చుంబనముచేసి పానము చేయుచున్నప్పుడు, యువకుడు ఆమె పైపెదవిని చుంబనము చేయవలయును. ఆమె పై పెదవిని ముద్దుపెట్టుకొనునప్పుడు తాను క్రిందిపెదవిని ఆశ్రయించవలయును. ఈవిధానము 'ఉత్తర చుంబిత' మనబడును. ఈవిషయము ప్రసంగమువల్ల చెప్పబడ్డదే గాని నాసికాపుటపానమువలె నిదియును అసహ్యమైనది గనుక ఆచరింపతగినదికాదు. ముద్దుపెట్టుకోతగినది క్రిందిపెదవియేగాని పై పెదవి కాదు.

యువతీయువకు లిరువురు కలసి ఒకపర్యాయము చుంబనముచేయువిధానమును తెలుపుచున్నాను. ఇరువురును పెదవులను ముడుచుకొని ఒకరు మరియొకరినోటిలో నుంచి, ఒకరినొకరు ముద్దుపెట్టుకొనవలయును. చుంబనము చేయు నప్పుడు శబ్దముగునట్లు చుంబనము చేయవలయును. ఇందు రెండు పెదవులను దగ్గఱచేర్చి చుంబనముచేయుదురు గనుక నిది 'సంపుటకచుంబన' మని పిలువబడుచున్నది. ఈ 'సంపుటకచుంబనము' మీసములురానిపురుషుడుమాత్రమే చేయగలుగును. మీసములుగలపురుషుడైనయెడల, యువతి తనపెదవులను పురుషునినోటియందు ఉంచువిధానమునుమాత్రమే ఆచరించవలయును.

ఈ సంపుటకచుంబనమునకు చెందిన అంతర్ముఖచుంబనమును తెలుపుచున్నాను. యువతీయువకులలో ఎవరిపెదవులు రెండవవారినోటిలో ప్రవేశించునో, వారు తమనాలుకతో

రెండవవారి పైపండ్లను, క్రిందిపండ్లనుకూడ తాకుచుండవల యును. పొడవుగగాని, పొట్టిగగాని యుంచి ఒకరినాలుకను రాపిడిచేసినయెడల 'జిహ్వాయుద్ధ' మనబడును. ఇది అంతర్ముఖ చుంబనము, దశనచుంబనము, జిహ్వాచుంబనము, తాలుచుంబ నము అని నాలుగువిధములు.

ఈ జిహ్వాయుద్ధమునందు చెప్పబడినవిధముగనే, బల వంతముగ పెదవులను చుంబించడము, దంతములను చుంబించ డము, వానిని ఒకరివి ఒకరు చుంబనముచేయుటకు అంగీకారమ మొదలగువిషయములుకూడ ఆచరించవలయును.

పెదవులమీదను, నోటిలోపలను గాక నుదుటు మొద లగుస్థానములలో చేయుపనినిబట్టి సమచుంబనమనియు, అంచిత చుంబనమనియు, మృదుచుంబనమనియు, పీడితచుంబనమనియు, నాలుగురకములుగ ఏర్పడుచున్నవి. అట్టిచుంబనస్థానములన్నియు పైనచెప్పబడియున్నది. ఆస్థానములలో గడ్డలు, వక్షస్థలము ప్రదేశములలోమాత్రము సమచుంబనమును ప్రయోగించ వలయును. పీడితమునుగాని, మృదుచుంబనమునుగాని చేయ రాదు. స్తనములు, బుగ్గలు, భగములు వీనిమీద పీడితచుంబన మును ప్రయోగించవలయును. చన్నులమీదను, చంకలదగ్గరను అంచితచుంబనమును చేయవలయును. లలాటముమీదను నేత్ర ములమీదను మృదుచుంబనము చేయవలయును. ఈవిధముగ చేయువిధానమునుబట్టి చుంబనభేదములు ఏర్పడుచున్నవి.

పురుషుడు నిద్రపోవుచున్నప్పుడు అతనిముఖమును ప్రేమ భావముతో చూచుచు, తనకు ఏవిధముగ ముద్దుపెట్టుకొనుట కిష్టమో, ఆవిధముగ చుంబనముచేసినయెడల 'రాగదీపన' మన

బడును. పురుషుడును ఆవిధముగనే యువతి నిద్రపోవుచున్న ప్పుడు చుంబనముచేయుట 'సాంప్రయోగిక' మనబడును. ఇట్టి చుంబనమునందు ఒకవేళ యువతికి నిద్రాభంగము కలిగినను కలుగవచ్చును.

సంగీతము పాడుచున్నప్పుడును, ప్రణయకలహములో నున్నప్పుడును అతనిదృష్టిని మరల్చుటకును నిద్రపోవుచున్న ప్పుడు లేపుటకును పురుషుని ఆయాపనులనుంచి మరల్చుటకును చుంబనము 'చలితక' మనబడును.

రాత్రిసమయములో యువతి నిద్రించుచున్నప్పుడు ఆమెను సమీపించి తనకోరిక తీరునట్లుగ చుంబనముచేయుట 'ప్రాతిబోధిక' మనబడును. ఈచుంబనము కేవలము నిద్రపోవు చున్నవ్యక్తిని నిద్రనుండి మేల్కొలుపుటకుమాత్రమే చేయ బడునదిగ నున్నది.

యువతి యువకునిభావమును గ్రహింపవలచి అతడు తన దగ్గరకు వచ్చుకాలమును గ్రహించి, నిద్రపోవుచున్నట్లు నటించు సమయములో, 'నాప్రియునకు నాయందు ప్రేమ యున్నచో ప్రాతిబోధికచుంబనమును చేయును' అని అను కొనుచు నిద్రపోవుచున్నయువతిని ఆభావమునుంచి మరల్చు టకు ప్రాతిబోధికచుంబనము బాగుగ ఉపయోగపడును.

అద్దములోనైనను, దీపపువెలుతురు పడుచున్నగోడ మీదనైనను యువతినీడను చుంబనముచేయుట 'ఛాయాచుం బన' మనబడును,

తనయొడిలో నున్నపిల్లవానినిగాని, ఏదైనను ఒకపటమునుగాని, బొమ్మనుగాని యువతి చూచుచుండగ చుంబనము చేయుట 'సాంక్రాంతిక చుంబన' మనబడును.

పైనచెప్పబడిన ఛాయా, సాంక్రాంతికచుంబనములను ప్రణయకలహసమయములందును, మాటలు భావములు కలియనిసమయములయందును చేయవలయును.

రాత్రియందుగాని, ఏదైనను ఒకప్రదర్శనము జరుగుచున్నప్పుడు ఒకప్రదేశములో చేరియున్న తనబంధుజనములోగాని యువతికి సమీపమునందున్న ప్రియుడు చేతివ్రేలినిగాని, కూర్చొనియున్నయెడల కాలివ్రేలినిగాని ముద్దుపెట్టుకొనిన యెడల 'అంగులీచుంబన' మనబడును.

పాదములు పిసుకుచు ప్రియునకు తనకోరికను తెలియపరచుచు, నిద్రపోవుచు ఏమియు ఎరుగనిదానివలె అతనితొడలమీద ముఖమునుపెట్టి ముద్దుపెట్టుకొనుట 'ఊరుచుంబన' మనబడును. కాలివ్రేళ్లు లాగుచు, ఆకాలిబొటనవ్రేలిని ముద్దుపెట్టుకొనుట 'పాదాంగుష్ఠచుంబన' మనబడును. ఈ అంగులీచుంబనము మొదలగునవి స్పృష్టకము మొదలైనచుంబనములచేత కొంచెము శరీరస్పర్శకుమాత్రము అలవాటుపడి, విశేషపరిచయము లేనివారియందుమాత్రమే ప్రయోగించవలయును. వీనిని 'అభియోగికము' లందురు.

నూతనముగ పరిచయము చేసుకొనుసమయములయందును, సంభోగకాలమునందును పురుషుడు ఎట్టికృత్యములను చేయు

చుందునో, యువతికూడ తిరిగి అట్టికృత్యములనే చేయుచుండ వలయును. అనగా ప్రియుడు ఏపనిని చేయునో, స్త్రీకూడ ఆ పనినే తిరిగి చేయవలయు నని భావము. ఆవిధముగ చేయని యెడల అట్టిస్త్రీని పురుషుడు సరసమెఱుగని మొద్దువలె భావించును. అంతియేగాక క్రమముగ ఆమెవిషయములో విరక్తిభావము పొందును. దానివలన అట్టిదాంపత్యము సారములేనిదగును. పురుషుడు ప్రణయతాడనము చేసినయెడల తానును ప్రణయతాడనము చేయవలయును. ముద్దుపెట్టుకొనినయెడల తిరిగి తానును ముద్దుపెట్టుకొనవలయును.



# నఖక్షతములు

నఖక్షతములు అనగా మెల్లగ చేతిగోళ్లతో గిల్లుట, చక్కిలిగింతలుపెట్టుట, రక్కుట, గీరుట యని అర్థము. యువతులకు, కామోద్రేకమును రేకెత్తించి సంభోగేచ్ఛను అమితముగ కలుగజేయుటకు నఖక్షతములు అత్యంతము ఆచరణీయములు. ఈ క్రియ పరస్పరము సంభోగేచ్ఛను పురికొల్పుటకు దంపతులు ఒకరిమీద నొకరు ప్రయోగించుచుందురు. సంభోగేచ్ఛను కలిగించుటకు చుంబనక్రియలతోపాటు నఖక్షతములనుకూడ ముఖ్యముగ చేయవలయునని కామశాస్త్రకారులు బోధించుచున్నారు.

నఖక్షతములను శరీరముమీద ఏప్రదేశములో చేయవలయును, ఎప్పుడు ఏవిధముగ ప్రయోగించవలయునను విషయములను గ్రహింపవలయును.

మందవేగులు, మధ్యవేగులు నఖక్షతములను ఎల్లప్పుడు ప్రయోగించరాదు. చాలసేపు రతిచేయగలిగినవారు వీటిని ఎప్పుడైనను, ఏవిధముగనైనను ప్రయోగింపవచ్చును.

నూతనముగ కలుసుకొనినప్పుడుగాని, దూరదేశములకు పోయి తిరిగివచ్చినప్పుడుగాని, ప్రియురాలిని విడిచి దూరదేశమునకు పోవునప్పుడుగాని, కోపముచెందియున్న ప్రియురాలిని ప్రసన్నురాలినిగ చేసుకొనుటకుగాని ప్రయోగించవలయును.

నఖక్షతములవలెనే అనురాగమును ఇంకను వృద్ధి చేయుటకు దంతక్షతములనుకూడ చేయవలయును. అను

రాగము అధికముగ నున్నప్పుడు దంతక్షతములు తేలికగ చేయవలయును. అనురాగము సామాన్యముగ నున్నప్పుడు దంతములతో గట్టిగ నొక్కవలయును.

నఖక్షతములు, రూపవత్ అనియు అరూపవత్ అనియు రెండురకములు. ఏదైనను ఒకవస్తువు ఆకారమును అనుసరించి చేయబడునవి రూపవత్ అనియు, ఏవస్తువుయొక్క ఆకారమును అనుసరించక చేయబడునవి అరూపవత్ అనియు పిలువబడుచుండును. మరల వీటియందు మెల్లగ చేయబడునవి, సామాన్యముగ చేయబడునవి, గట్టిగచేయబడునవి అని మూడువిధములు గలవు.

రూపవత్ అనునఖక్షతములు అచ్ఛురితకము, అర్ధచంద్రాకారము, మండలాకారము, రేఖాకారము, వ్యాఘ్రనఖము, మయూరపదకము, శశప్లుతకము, ఉత్పలపత్రకము అని ఎనిమిదిరకములు కలవు.

"కక్షౌ స్తనౌ గళః—పృష్ఠం జఘన మూరూచస్థానాని" అని శాస్త్రములో చెప్పబడియున్నది. అనగా ఈనఖక్షతములను చంకలు, స్తనములు, కంఠమునకు ప్రక్కభాగములు, కటిభాగము అనగా పిఱుదులు, పొత్తికడుపు, తొడలు అను ఈఆరు ప్రదేశములందును చేయవలయు నని భావము. ఇది పూర్వాచార్యులవారి అభిప్రాయము.

రతిక్రియయందు నిమగ్నులైయున్న యువతీయువకులు ఇది నఖక్షతముచేయుటకు తగినప్రదేశ మనిగాని, ఇది అందుకు తగినప్రదేశము కా దనికాని ఆలోచింప నవసరము లేకనే ఏప్రదేశములో నఖక్షతము చేయవయు నని అభిలాష

కలుగునో ఆప్రదేశములో చేయవచ్చునని సువర్ణనాభుల అభిప్రాయము.

నఖక్షతములకు సాధారణముగ ఎడమచేతినివ్రేళ్ళ మాత్రమే ఉపయోగించవలయును. చేతిగోళ్లకొనలు దేరి, ఆకొనలు రంపపుపళ్లవలె రెండుమూడుపళ్లు కలిగియుండవలయును.

ఆగోళ్లమీద పలురకములైనరంగులరేఖలు కలిగియుండవలయును. వెనుకభాగములు సమముగను,ప్రకాశవంతములైనవిగను, పరిశుభ్రముగను, చీలికలులేనివిగను, బాగుగ పెరుగునట్టి స్వభావము కలవిగను, మెత్తదనము కలవిగను, చూచుటకు మనోహరముగ నుండునవిగను నుండవలయును.

గౌడదేశీయులగోళ్లు పొడవుగను, చూచుటకు మనోహరముగను, స్త్రీలమనస్సునకు సంతోషమును కలుగజేయునవిగను ఉండును. కాని ఇవి నఖక్షతములకు పనికిరావు. దక్షిణదేశీయులగోళ్లు పొట్టిగా నుండి నఖక్షతములు చేయుటకు మిక్కిలి అనుకూలమైనవిగా నుండును. మహారాష్ట్రులగోళ్లు విశేషముపొడవుగను, మిక్కిలి పొట్టిగను ఉండక మధ్యరకముగ నుండును.

పైనచెప్పబడిన మంచిలక్షణములగోళ్లను అయిదింటిని, గుత్తివలె ముడిచి బుగ్గలు, స్తనములు, అధరము వీటిమీద మృదువుగ గీరుట 'అచ్ఛురితక' మనబడును, ఇట్టి నఖక్షతములలో స్పర్శమాత్రముచేతనే శరీరమంతయు గగుర్పొడిచినట్లగును. నఖక్షతములు చేయబడుచున్నప్పుడు యువతి కొలదిగ సీత్కారముచేయుచుండును. నఖక్షతములను చెప్పబడినప్రదేశములందేగాక సమయానుకూలముగ నితరప్రదేశములలోకూడ చేయ

వచ్చును. సంభోగమునకు ముందుగను, సంభోగసమయమునను, నఖక్షతములను యువతీయువకు లిరువురును ఒకరిపై నొకరు చేసుకొనుటవలన విశేషసౌఖ్యదాయకముగ నుండును. సంవాహనము చేయబడుతావులలో నఖక్షతములనుకూడ చేయవచ్చును. మరియు తలయందుగాని శరీరముమీదగాని దురద కలిగినప్పుడును, కురుపుచిదుపుటకును, చక్కిలిగింతలుపెట్టుటకును, భయపెట్టుటకునుకూడ నఖక్షతములు చేయవచ్చును.

అర్ధచంద్రాకారము:—కంఠమునకు ప్రక్కభాగములందును, స్తనములకు వెనుకభాగములందును అర్ధచంద్రాకారములో చేయబడునఖక్షతములు 'అర్ధచంద్రాకారనఖక్షతము' లనబడును.

పైన తెలుపబడిన అర్ధచంద్రాకారనఖక్షతములను, ఒకదానికొకటి ఎదురుగ చేయబడిన 'మండలాకార' నఖక్షతము లనియు, గుండ్రనినఖక్షతములనియు యనబడును. ఇట్టి వర్తులాకారనఖక్షతములను బొడ్డునకు క్రిందిభాగమునను పిఱుదులమీదను, గజ్జలసందునను చేయవలయును. మరియు శరీరముమీద నెక్కడైనను మిక్కిలి పొడవుగగాక, సామాన్యముగ చేయవలయును.

స్తనముయొక్క చివరభాగమునుంచి పైభాగములో వంకరగ చేయబడునఖక్షతములు 'వ్యాఘ్రనఖము' లనబడును.

మయూరపదకము:—నెమలిపాదముల ఆకారములో చేయబడునఖక్షతములు 'మయూరపదకము' లనబడును. బొటనవ్రేలిగోటిని కుచాగ్రముయొక్క క్రిందిభాగములో నాటునట్లు నఖక్షతము చేయబడినయెడల మయూరపదక మనబడును.

మయూరపదకములో అయినగోళ్లను కుచముయొక్క చివర భాగమును చుట్టుకొని యెదురుగ నుండును.

మయూరపదకము చేసినపిమ్మట కామోద్రేకమును పొందుచున్నయువతియొక్క కుచమునకు చివరభాగములో తనచేతి గోళ్ల నయిదింటిని దగ్గరగ చేర్చి నొక్కవలయును. ఇది 'శశప్లుతక' మనబడును. శశప్లుతకము స్త్రీలకు విశేషసౌఖ్యదాయకముగ నుండును. శశప్లుతకము చేయుపురుషులను స్త్రీలు విశేషముగ ప్రేమించుచుందురు.

నారీమణియొక్క స్తనాగ్రమునకు వెనుకభాగము మీదను, పిఱుదులమీదను, బొడ్డునకు క్రిందిభాగమునను కలువరేకు ఆకారములో చేయబడునఖక్షతములు 'ఉత్పలపత్రకము' లనబడును.

పురుషుడు దేశాంతరము పోవుసమయములో, మరల త్వరలో కలుసుకొనవలయు నను అభిలాషతో తనప్రేమను సూచించుటకు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని నఖక్షతములు చేయవలయును. అట్టిప్రయాణము చాలకాలము చేయవలసివచ్చిన నఖక్షతములు అధికముగను, స్వల్పకాలము చేయవలసివచ్చిన స్వల్పముగను చేయవలయును. ప్రియురాలితో వియోగము సంభవించు కాలములో ఈవిధమైననఖక్షతములు చేయబడును గనుక నివి 'స్మరణీయక నఖక్షతము' లనబడును.

మరియు పక్షులు, పుష్పములు, పాత్రలు, ఆకులు, తీగెలు మొదలగువాటి ఆకారములలోకూడ నఖక్షతములను చేయ

వలయును. అనగా యువతీయువకులు నఖక్షతములను వారివారి మనోభీష్టప్రకారము చేసుకొనవచ్చును.

మొత్తముమీద నఖక్షతములు ఎనిమిదిరకము లని శాస్త్రములో చెప్పబడియున్నది. కాని వాటియందు మరల ఏర్పడు భేదములు పెక్కు గలవు. నఖక్షతములు ప్రేమసూచకము లగుటచేతను, అభ్యాసముచే అనేకరకములుగ చేయబడవచ్చును గనుకను, వీటియందలిభేదములను ఎవరును నిర్ణయించ లే రని "పూర్వాచార్యు" లవారి అభిప్రాయము.

అనురాగసమయములోను, అనురాగము లేనిసమయము నను కూడ యువతీయువకులు, నఖక్షతములను చేసుకొనుచుందురు గనుక ఇవి అనేకరకములుగ చేయబడుచుండుట సహజమే యని వాత్స్యాయనులవారి అభిప్రాయము. అనురాగము అనునది కల్పితమైనను, సహజముగ జనించినదైనను, నూతనోత్సాహము కలదిగ్గా యుండును. ఇట్టి రతివిశేషముల నన్నిటిని బాగుగ తెలుసుకొని పూర్వము దేవదత్త యనువేశ్యయు, మూలదేవుడు మొదలగువారు 'కామకళా'రంగములో నేర్పరితనముగ ప్రవర్తించగలిగిరనికామశాస్త్రగ్రంథములలో చెప్పబడియున్నది. కనుక నఖక్షతములు మొదలగుక్రియలు అనురాగమును పెంపొందింపజేయును. ఇట్టివిశేషములను తెలుసుకొనుటయు, ఇట్టివిశేషములను తెలిసినవారిని ఆశ్రయించి శాస్త్ర రహస్యములను తెలుసుకొనుటయు మొదలగువిధానములు ఇతరశాస్త్రవిషయములలోకూడ జరుగుచునేయున్నది.

ధనుర్వేదము మొదలగుగ్రంథములలో కుంతలములు, ఖడ్గములు, అస్త్రములు, శస్త్రములు మొదలగువాటిని ఉపయో

గించువిధానములను తెలుపుశాస్త్రములలోకూడ మధ్యమధ్య నూతనవిధానములు అవలంబింపబడుచుండును. ఆవిధముగనే ఈకామశాస్త్రవిషయములోకూడ నూతన అనురాగముకొరకును, క్రీడలకొరకును ఉబలాటపడు యువతీయువకుల చేష్టలు అనేక నూతనపోకడలుగ నుండును. ఈశాస్త్రములో విచిత్రము, నేర్పరితనమే ముఖ్యము. అట్టి నేర్పరితనము కలిగియున్నవాడే నాగరికు డనబడును.

యువతులు రతియందు నూతనవిధానములను విచిత్ర చేష్టలను కోరుచుందురు. మొత్తముమీద విచిత్రరతులలో పురుషుడు చేయుకృత్యములయొక్క సౌఖ్యమును అనుభవించువారు గనుక వారికి తొడలు, కటిభాగము, గజ్జలు మొదలగు రహస్యస్థానములలోమాత్రమే జ్ఞాపకముకొరకు నఖక్షతములను పురుషులు ప్రయోగింపవలయును. అట్టి నఖక్షతములను చేసినకాలములో పొందినసౌఖ్యమును తలచుకొని తలంచుకొని స్త్రీలు ఆనందమును పొందుచుందురు. అట్టి నఖక్షత సౌఖ్యము ప్రియుని జ్ఞాపకమునకు తెచ్చుచుండును. అట్టి నఖక్షతములు జ్ఞాపకమువచ్చినప్పుడు మనస్సులో ఒకవిధమైన ఆనందమును కల్పించి, స్ఖలనసౌఖ్యముతో సమానముగు ఆనందమును కలుగజేయుచుండును. యువతులు తమప్రియులు రహస్య ప్రదేశములలో చేసిననఖక్షతములను తలచుకొని చాలకాలము వియోగము పొందినను, పరిపూర్ణప్రేమను కలిగియుందురు.

యువతీయువకులమధ్య చాలకాలము వియోగము సంభవించినను రూపమును, గుణములను, యౌవనమును ఈనఖ

క్షతములు జ్ఞాపకముచేయుచుండును. కనుక ఈనఖక్షతములు కామకళారంగములో విశేషముఖ్యములైనవిగ కనబడుచున్నవి.

స్తనములమీద నఖక్షతములసౌఖ్యమును పొందినవనిత, అట్టి నఖక్షతసౌఖ్యమును కలుగజేసిన ప్రియుడు దూరదేశములో నున్నను వానియందు విశేషగౌరవమును, అభిమానమును, విశేషప్రేమమును కలిగియుండును.

పురుషుడు ఏస్త్రీవలన నఖక్షతసౌఖ్యమును పొందునో ఆమెను చూచినప్పుడు విశేషఆనందమును పొందుచున్నాడు. ఆవిధముగనే స్త్రీకూడ ఏపురుషునివలన నఖక్షతసౌఖ్యమును పొందుచున్నదో అట్టిపురుషుడు వ్రతానుష్ఠానసమయములలో కనబడినను విశేష సంతోషమును పొందుచున్నది.

స్త్రీపురుషులమధ్య అనురాగమును పెంపొందించుటకు ఈనఖక్షతములు విశేషముగ తోడ్పడుచున్నవి. అందుచే నఖక్షతములు విశేషసౌఖ్యమును కలుగజేయునవిగ నున్నవి. కామోద్రేకమును కలిగించుకృత్యములలో నఖక్షతముల వంటివి మరేవియులేవు. కనుక ఈక్రియకామకళారంగములో ముఖ్యపాత్ర వహించుచున్నది.



# దంతక్షతములు

యువతీయువకులమధ్య కామోద్రేకమును వృద్ధిపరచుటకు దంతక్షతములు సాధనభూతములుగ కనబడుచున్నవి. మొదట యువతిశరీరముమీద ఇదివరలో చెప్పబడినస్థానములలో నఖక్షతములను చేసినపిమ్మట ఇంకను కామోద్రేకమును వృద్ధిచేయుటకు దంతక్షతములనుకూడ చేయవలయును. అందుచే యువకులు దంతక్షతములను చేయువిధానములనుకూడ తెలుసుకొనవలయును. నోటియందుండుదంతములతో యువతీయువకులు ఒకరిశరీరముమీద నొకరు మృదువుగ గీరుటయు, కరచుకొనుటయు దంతక్షతము లనబడును. దంతక్షతములు ఒక్కొక్కదేశములో ఒక్కొక్కవిధముగ ఆచరింపబడుచున్నవి.

పై పెదవి, నాలుక, నేత్రములు - వీనిని వదలి చుంబనమునకు చెప్పబడిన పరిస్థానములలో దంతక్షతములను చేయవచ్చును. అనగా నుదురు, అధరము, కంఠమునకు ఇరుప్రక్కలు, చెక్కిళ్లు, వక్షస్థలము, స్తనములు వీనిమీద దంతక్షతములను, చేయవచ్చునని భావము. లాటదేశీయులు గజ్జలు, చంకలు, భగము ఈ మూడుప్రదేశములలో చుంబనములు, దంతక్షతములు కూడ చేయుచుందురు. కాని శిష్టులు ఈస్థానములలో చుంబనములు, దంతక్షతములు చేయుటకు అంగీకరింపరు.

గొగ్గులు లేనివిగను, సమముగను, నునుపుగను, పరిశుభ్రముగను, తళతళలాడుచు, తాంబూలరాగము గలిగి, తగిన

పొడవును వెడల్పును కలిగి, సందులులేక వాడి కలిగి మొనలు తేలియుండునంతములు దంతక్షతములకు శ్రేష్ఠములైనవి.

మొక్కపోయినటువంటియు, మధ్యమధ్య చారలు కలిగినట్టియు, కరుకుగ నున్నవియు, గుగ్గిగా నున్నవియు, తొట్టి విగా నున్నవియు, మిక్కిలి పెద్దవిగ నున్నవియు, సందులు కలిగి యున్నటువంటియు దంతములు ముఖముయొక్క అందమును పాడుచేయుటయేగాక దంతక్షతములకూడ పనికిరావు.

గూఢకము, ఉచ్చూనకము, బిందువు, బిందుమాల, ప్రవాళమణి, మణిమాల, ఖండాభ్రకము, వరాహచర్వితము అని దంతక్షతములు ఎనిమిదిరకములు.

చూచుటకు ఎరుపు కలుగనీయక పళ్ల మొనలతో నొక్కిన యెడల 'గూఢక' మనబడును. ఇందు అందముగను, దంతక్షతము నకు తగినటువంటియు దంతములతో గుంటలుపడనివిధముగ దంతక్షతములు చేయవలయును. అంతకంటె కొంచెము గట్టిగ నొక్కినయెడల ఉచ్చూనక మనబడును. ఇందు దంతక్షతము చేయబడినచోట కొంచెము గుంటబడును.

పైన చెప్పబడిన గూఢకమును, ఉచ్చూనకమును ఇక ముందు చెప్పబోవు బిందువు అను మూడురకములైన దంతక్షత ములను అధరమునకు మధ్యభాగములో చేయవలయును. ఉచ్చూనకమును, ముందుచెప్పబోవు ప్రవాళమణిని బుగ్గలమీద ప్రయోగించవలయును. వాటిని ఆప్రదేశములలో ఉపయోగిం చిన యెడల విశేషసౌఖ్యదాయకముగ నుండును.

కర్ణాభరణములను ముద్దుపెట్టుకొనుటయు, నఖక్షతము లను, దంతక్షతములను ఎడమబుగ్గమీద చేయవలయును.

క్రిందిపెదవిని పైపండ్లను కలిపిగాని, క్రిందిపండ్లను, పై పెదవినిగాని దంతక్షతము చేయుస్థానములో సమకూర్చి తప చుగ దంతక్షతములు చేయుచు, కొలదిగ స్త్రీకి బాధ కల్పించిన యెడల 'ప్రవాళమణి' యనబడును. ఇట్టి దంతక్షతములో ప్రవాళమణివలె పండ్లు నాటి ఎఱ్ఱబారక, దంతములు, పెదవి మాత్రమే స్వల్పముగ నాటి విన్యాసముమాత్రమే కలుగును. మణిమాల యనుదంతక్షతమునుకూడ ప్రవాళమణివలెనే దంతములతోను పెదవితోను చేయవలయును. అనగా ఒక్క చోటమాత్రమే దంతక్షతము చేయబడినచో 'ప్రవాళమణి' యనబడును. వరుసగ అనేకచోట్ల చేయబడిన 'మణిమాల' యగును.

కంఠమునకు ప్రక్కభాగములలో పెసరగింజంతయు, అధరోష్ఠమువిూద నువ్వుగింజంతయు, పై పెదవితోను, క్రింది పెదవితోను దంతక్షతము చేయబడినయెడల అది 'బిందుసిద్ధి' యనబడును. ఇందు ముందుండు నాలుగు దంతములతోను ఒక్క పారిగ కొరుకుట జరుగును. ఈబిందుక్షతము చాలచోట్ల చేయ బడిన 'బిందుమాల' యనబడును. మణిమాల, బిందుమాల యన బడు దంతక్షతములను కంఠమునకు ఇరువైపులను, చంకల మీదను, గజ్జలలోను చేయవలయును. బిందుమాలను నుదురు మీదను, తొడలమీదనుకూడ చేయవచ్చును.

కొన్ని దంతములు బాగుగ నాటువిధముగను, కొన్ని దంతములు కొలదిగ నాటువిధముగను, కొన్ని దంతములు మరి కొద్దిగ నాటువిధముగను, గుండ్రనియాకారములో కుచముల మీద దంతక్షతము చేయబడినయెడల 'ఖండాభ్రక' మనబడును.

ఈదంతక్షతము చన్నులమీద చేయబడినయెడల విశేషసౌఖ్య మును కలిగించును.

కుచముమీద ఒకవైపునుండి మరొకవైపువరకు పండ్లతో బాగుగ నొక్కి లోతుగ గంట్లుపడునట్లుగను, ఎఱ్ఱబారునట్లు గను, నాలుగైదువరుసలు కల్పింపబడినయెడల 'వరాహచర్వితే' మనబడును. వరాహచర్వితము చన్నులకు వెనుకభాగమున చేసిన యెడల విశేషసౌఖ్యమును కలుగజేయును.

ఖండాభ్రక, వరాహచర్విత మనబడుదంతక్షతములు రెండును చాలసేపు రతిచేయగలిగినవారుమాత్రమే చేయగలు గుదురు. వీనిని స్త్రీలుకూడ పురుషునిమీద ఆచరింపవచ్చును. స్త్రీయొక్కకుచములమీద చేయవలయునని చెప్పబడిన దంతక్షత ములు, స్త్రీలు పురుషుల వక్షస్థలములమీద చేయవచ్చును.

స్త్రీపురుషు లిరువురకు శాస్త్రాధికారము సమానమే యగుటవలన స్త్రీలుకూడ ఇందుచెప్పబడినవిధానముల నన్ని టిని, పురుషులవలెనే ప్రయోగించవచ్చును. అనగా దంతక్షత ములను పురుషులకువలెనే స్త్రీలుకూడ ప్రయోగించవచ్చునని భావము. దంతక్షతములు సంభోగమునకు అమితప్రోత్సాహ కరముగ నుండుటవలన సంభోగమునకు పూర్వమును, సంభోగ కాలమునందును తప్పక వీటిని ప్రయోగించినయెడల విశేష ప్రోత్సాహకరముగ నుండును.

భూర్జపత్రములు. తలమీదను చెవులమీదను ధరించు పూవులమీదను, పువ్వుబంతులమీదను, తమలపాకులమీ దను, మోదుగాకులమీదను, తాపింఛపత్రముమీదను యువ తులదగ్గరకు పోవుయువకులు తమ అభిప్రాయములను ఎఱిగించు

ఁటను దంతములతో కొన్నియాకారములను సృష్టించుట 'అభియోగిక' మనబడును అనగా ఇవియన్నియు పరిచయము కొఱకు చేయబడు ప్రయత్నము లని భావము. ఈవస్తువులమీద నఖక్షతములు, దంతక్షతములు కల్పింపబడి, గుమగుమలాడునట్లు పరిమళద్రవ్యములను అలది దూతికద్వారా ప్రియురాలికి పంప వలయును.

దేశాచార మనియు, తనకు అంగీకారమైన యాచార మనియు ఆచారములు రెండురకములు. ఈ రెండువిధములగు ఆచారములతోను స్త్రీలను రంజింపజేయవచ్చును. అవిధముగనే స్త్రీలు పురుషులనుకూడ రంజింపజేయవలయును. ఈవిధముగ ఒకరి నొకరు సంభోగకాలములో ఆలింగన, నఖక్షత, దంతక్షత ములలో రంజింపజేసుకొనుచు కామోపభోగముల తేలుచుండ వలయును.

హిమవత్పర్వతములకును వింధ్యపర్వతములకును మధ్య గలభూభాగము మధ్యదేశ మనబడును. అనగా వినశనమునకు తూర్పుగను ప్రయాగకు కొంచెము పడమరగను నుండుదేశ మని భావము. ఇది భృగుమహర్షియొక్క అభిప్రాయము. గంగ, యమునానదుల మధ్యనుండుభూభాగమే మధ్యదేశమని వసిష్ఠుల వారి మతము. కాని భృగువుయొక్క అభిప్రాయమే సరియైనదని అందరును అంగీకరించిరి. ఈమధ్యదేశమునందలి ఆచారములను 'మధ్యదేశము' లని వ్యవహరించుచుందురు. అవి పవిత్రములైన ఆచారములుగ వ్యవహరింపబడుచున్నవి. శిష్టులగు ఆర్యులు వానిని ఆచరించుచుందురు. వారిస్త్రీలు చుంబనములను, దంత క్షతములను, నఖక్షతములను ద్వేషించుచుందురు. ఆలింగనము

లకుమాత్రమే ప్రీతిని చూపుచుందురు. ప్రణయతాడనముల యందుకూడ విశేషాభిలాషను చూపక సామాన్యాంగీకార మునుమాత్రమే చూపుచుందురు.

ఉత్తరదేశమునకు బాహ్లీక మనియు, ఉజ్జయినిలో ఒక భాగమునకు అవంతిక మనియు పేర్లు కలవు. ఈ రెండు దేశము లందును స్త్రీలు చుంబనములను, నఖక్షతములను, దంతక్షతము లను ద్వేషించుచుందురు. చిత్రరతులకొరకు మాత్రము అధిక ముగ ఉబలాటపడుచుందురు.

మాళవదేశమునందును, శ్రీకంఠక్షేత్రమునందును, కురు క్షేత్రమునందును నివసించుస్త్రీలు ఆలింగనములను, ముద్దులను, నఖక్షతములను, దంతక్షతములను విశేషముగ కోరుచుందురు. కాని గంట్లుపడునట్లుగ నొక్కుటకు, గీరుటకుమాత్రము అంగీక రింపరు. ప్రణయతాడనములవలన విశేషానందమును పొందు చుందురు.

సింధునది, విపాశనది, శతద్రునది, ఐరావతీనది, చంద్ర భాగానది, వితస్తానది అను ఈఆరునదులకును మధ్యగలదేశ ములో జన్మించినస్త్రీలు ఆలింగనములు, చుంబనములు, నఖక్షత ములు, దంతక్షతములు, ప్రణయతాడనములు, సీత్కృతములు వీనివలన తృప్తిపడక యువకునిమదనదండమును నోటిలో ప్రవే శింపజేసుకొని ఔపరిష్టకక్రియను ఆచరించి తృప్తిని చెందుదురు. ఇదియే 'ముఖరతి' యనబడును. ఇట్టి ఆచారముగలస్త్రీకి 'ముఖ చపల' మందురు.

పడమటిసముద్రతీరమున నున్న దేశము అపరాంతదేశ మనబడును. ఆదేశమునందు జన్మించినస్త్రీలను 'అపరాంతిక'

లందురు. అపరమాళవమునకు పడమరగ నుండునది 'లాటదేశ' మనబడును. అందు జన్మించినస్త్రీలను 'లాటస్త్రీ' లందురు. ఈ రెండుదేశములయందును జన్మించినస్త్రీలు బలవంతులుగ నుందురు. అందువలన చాలసేపు రతిచేయగలుగుదురు. కొద్ది కొద్దిగ నఖక్షతములను, దంతక్షతములనుగూడ సహింపగలుగు దురు. సంభోగకాలములో సీత్కారములు జేయుచుందురు. ప్రణయతాడనములయందు అభిలాష కలిగియుందురు. శ్రీ కృష్ణుడు అవతారమును చాలించినపిదప ఆయన అంతఃపురజన మును అర్జునుడు వెంటబెట్టుకొని వెళ్లుచుండుమార్గమునందు బలశాలురైన యీఅపరాంతదేశీయులు అడ్డుతగిలి కొల్లగొట్టి నట్లు మహాభారతములో చెప్పబడియుండెను.

వంగదేశమునకును, ప్రస్తుతదేశమునకును పడమరగ నుండుదేశము 'స్త్రీరాజ్య' మనబడును. ఆస్త్రీరాజ్యమందును, కోసలదేశమునందును జన్మించినస్త్రీలు ఆలింగనములు, చుంబన ములు, దంతక్షతములు సలుపబడినను పరిపూర్ణతృప్తిని జెందక గాఢమగు ప్రణయతాడనములనుకూడ కోరుచుందురు. వీరినే 'ఖరవేగు' లందురు. దురదవదల్చుకొనుటకు రతిని అధికముగ కోరుట 'ఖర' మనబడును. ఈదేశములందలిస్త్రీలు భగమునందలి దురదను వదల్చుకొనుటకు కృత్రిమసాధనములనుకూడ తెరుచు ఉపయోగించుచుందురు.

ఆంధ్రదేశములో జన్మించినస్త్రీలు స్వభావసిద్ధముగ చాల సుకుమారముగ నుందురు. అందువలన ప్రణయతాడనములను, నఖక్షతములను, దంతక్షతములను సహింపలేరు. ఒక్కరతిని మాత్రమే కోరుచుందురు. కందూతిని అనగా దురదను వదల్చ

కొనుటకు నీచపుమార్గములను అవలంబించుచుందురు. కామశాస్త్రములందు చెప్పబడినబంధనవిధానములను అనుసరించుటలో విశేషశ్రద్ధను చూపరు. ఆచారములను అతిక్రమించి సంచరించుచుందురు. మహారాష్ట్ర దేశమందలిస్త్రీలు సంగీతము మొదలగు అరువదినాలుగుకళలతోను, పాంచాలి కీళలగుగీతాది చతుష్షష్టి కళలతోను సంభోగము సలిపిననేగాని తృప్తిచెందరు. అనగా వారికి కళలయందు విశేషఅభిరుచి యని భావము. వారిసంభాషణ చాలనీచముగ నుండును. సంభోగసమయములో చాలతొందర చూపుచుందురు. ధూర్తలగుటవలన పురుషునికంటె తామే ముందుగ సంభోగమునకు తొందరచేయుచుందురు. పాటలీపుత్ర దేశమందలి స్త్రీల ఆచారములుకూడ ఇంచుమించు మహారాష్ట్ర దేశపుస్త్రీల ఆచారములవలెనే యుండును.

ద్రవిడ దేశమునందు జన్మించినస్త్రీలు సంభోగమునకు ముందు ఆలింగనములు, చుంబనములు మొదలగుదానిని కోరుచుందురు. స్తనములు, భగము మొదలగునవి మర్దింపబడుట వలన విశేషతృప్తిని జెందుచుందురు. పిదప వేగముగ స్ఖలన సౌఖ్యమును కోరుచుందురు.

గౌడ దేశమునందలిస్త్రీలు మృదుమధురముగ మాట్లాడు స్వభావమును కలిగియుందురు. సుందరమైనశరీరములు గలవారును, సుందరమైనశరీరము గలపురుషులను అధికముగ ప్రేమించువారుగను నుందురు.

సువర్ణనాభుడు దేశాచారముకంటెను, తనకు సంతోషదాయకమైన ఆచారమే మంచి దనియు, సర్వోత్తరమైన దనియు తెలిపెను. తనయభిలాష దేశాచారమునకు విరుద్ధముగ

నప్పుడు దేశాచారమును వదలి వ్యక్తిగతాభిలాషను అను సరించుటయే యుక్తమని భావము. ఏస్త్రీ ఏపద్ధతిలో అభీష్టమును కలిగియుండునో, పురుషుడు ఆవిషయమును బాగుగ గ్రహించి ఆపద్ధతి ననుసరించియే ఆవసరాచరణ్మును గ్రహించుచుండ వలయును.

ప్రహారణముకంటె దంతక్షతము, దానికంటె నఖక్షతము దానికంటె చుంబనము, దానికంటె ఆలింగనము అనురాగమును వృద్ధిచేసి స్పర్శసౌఖ్యమును కలుగజేయును.

వలదని వారించుచున్నను బలవంతముగ పురుషుడు దంతక్షతమునుగాని నఖక్షతముగాని చేసినయెడల, స్త్రీ వాటిని సహించలేక కోపములో వాటిని అంతకంటెను అధికముగ పురుషునిమీద ప్రయోగించవలయును.

బిందువును ప్రయోగించిన ప్రతిక్రియగ మాలను ప్రయోగించి కసి తీర్చుకొనవలయును. మాలను ప్రయోగించిన యెడల అభ్రఖండమును ప్రయోగించవలయును. యువతీయువ కులు ఈరీతిగ ప్రణయకలహములలో సంచరింపవలయు నని వాత్స్యాయనుని కామసూత్రములలో చెప్పబడియున్నది.

స్త్రీల అధరోష్ఠమును చుంబనము చేయునప్పుడును, పానము చేయునప్పుడును, స్త్రీ ముందుగ ఒకచేతితో పురుషుని తలను, రెండవచేతితో గడ్డమును పట్టుకొని పైకెత్తి, అప్పుడు అమృతముతో సమానమగు అధరసుధారసమును గ్రోలవల యును. పిదప ప్రియుని బాగుగ హత్తుకొని కౌగలించుకొని 'నీవే నే ననునట్లుగ' అతనిలో ఐక్యముగావలయును. మరియు ఇదివరలో చెప్పబడిన స్థానములలో చుంబనములు, నఖక్షత

ములు, దంతక్షతములు మొదలైనవి గాఢప్రేమతో సలిపి పరవశురాలు గావలయును.

స్త్రీ తనబాహువులతో పురుషుని గట్టిగా హత్తి కొంచె మైనను సందులేకుండ కౌగలించుకొని కంఠమును ఎత్తి, రెండవ చేతితో అతనిగడ్డమును పట్టుకొని మణిమాలను ప్రయోగించ వలయును. మరియు నఖక్షతములను, దంతక్షతములను సమయోచితముగ సలిపి ప్రియుని ఆనందడోలికల నూగించ వలయును.

రాత్రి కామకళారంగములో ప్రియురాలు సలిపిన దంత క్షతములను పురుషుడు జనసమూహములో సంచరించునప్పుడు ఇతరులు చూడకుండ ప్రియురాలికి చూపించవలయును. దానిని చూచి యువతి "శిక్ష బాగుగ జరిగినదిలే" అనుభావము సూచించునట్లుగ పక్కున నవ్వవలయును.

యువతి ఉన్మత్తముద్దులకొరకు ముఖమును ముడుచు చున్నట్లు చేష్టలుచేయుచు కన్నులు, కనుబొమలు విచిత్రముగ త్రిప్పుచు "మీరు గావించిన అపరాధమునకు ప్రతిక్రియ చేయ లేను లెండి" అను అసూయాభావము వెల్లడిచేయుచున్నట్లు, తనదేహముపై పురుషుడు చేసినగుర్తులను ఇతరులు చూడ కుండ అతనికే చూపవలయును.

ఈవిధముగ యువతీయువకులు ఒకరిపై నొకరికి అనురాగము బాగుగ జనించునట్లు ప్రవర్తించినయెడల వారి ప్రేమలు కాశ్వతానందసంధాయకములై మరతువన్నను మరపురానివిగ నుండును.

---

# ప్రహారణములు - సీత్కృతములు

ఏకశయ్యపై పరుండి భగలింగసంయోగము కలిగియున్న యువతీయువకులు ముఖ్యముగ ప్రయోగింపవలసిన ప్రహారణములనుగురించి చెప్పుచున్నాము. ప్రహారణములు అనగా చిరు దెబ్బలని అర్థము. కామోద్రేకములో యువతీయువకులు ఒకరిపై నొకరు ప్రహారణములు ప్రయోగించుకొనునప్పుడు సీత్కృతములుకూడ కలుగుచుండును. అందువలన సీత్కృతములను గురించికూడ తెలుపుచున్నాను.

సంభోగ మనునది ఇంచుమించు ఒక కలహమువంటిది. ఇందు యువతీయువకులు ఇరువురు ఎవరిసుఖముకొరకు వారు రెండవవారిని పీడించుచు, నొక్కుచు, నక్కుచు, తిరస్కరించుచు, పరిహాసముచేసుకొనుచు సంభోగము సలుపుకొనుచుందురు. సంభోగము ఎంతమృదువుగ చేయవలసినదైనను యువతీయువకులు ఒకరిపై నొకరు పీడించుకొనుచు నిర్దయతో ప్రవర్తించుచుందురు. ఒకవిధముగ ఆలోచించినచో సంభోగము కామినీ కాముకులకు ప్రతికూలభావమునే కలుగజేయును. అందువలననే కామమును కలహరూపమునను, సురతరూపమునను చెప్పుచున్నారు. అసలు సంభోగమునకు ప్రేమయే ముఖ్యాధారము. కనుక సంభోగమునకు మూలమైనప్రేమను అభివృద్ధిపరచుటకు ప్రహారణములు సాధనభూతము లగుచున్నవి. ఈప్రహారణములను భుజములు, శిరస్సు, స్తనములమధ్య, వీపు, పిరుదులు, ప్రక్కలు వీనిమీద ప్రయోగించవలయును.

ప్రహారణములు అపహస్తకము, సమతలకము, ప్రసృతము, ముష్టి అని నాలుగువిధములలో కల్పించవలయును. అరచేతి వెనుకభాగముతో పైనచెప్పబడినస్థానములలో కొట్టుట 'అపహస్తక' మనబడును. అనగా 'ఈవిధానములో వ్రేళ్లతో మాత్రమే కొట్టవలయునని భావము. గుప్పిటితో గ్రుద్దుట 'ముష్టి' యనబడును. అరచేతిని చావి స్తనములను మర్దించుట, స్తనములమీద చరచుట 'సమతలక' మనబడును. 'ప్రసృతక' మనగా ఏమిటో ముందు చెప్పబడును. ఇట్టి ప్రహారణమువలన కలుగు సీత్కృతములు అనేకరకములుగ నుండును.

"విరుతాని చాష్టౌ":—రతికూజితములు ఎనిమిదిరకములు. రతికూజితములు రతిమూలమున కలుగు సౌఖ్యవిశేషముచే ఏర్పడును. సీత్కృతములుమాత్రము ప్రహారణము లనబడు చిరుదెబ్బలవలననే కలుగును.

రతికూజితములు హింకారము, స్తనితము, కూజితము, శ్వసితము, రుదితము, సూత్కృతము, దూత్కృతము, ఫూత్కృతము అను పేర్లతో యొప్పుచున్నవి. హింకార మనగా పెదవులచే నోరుమూసుకొని కంఠముతోను, ముక్కుతోను అమిత సౌఖ్యము కలిగినప్పుడు చేయు హీ, హీ, హీ, అను శబ్దము. స్తనితము అనగా మేఘధ్వనివలె గట్టిగ శబ్దముచేయుట. ఇదియును కంఠముతోనే హుం, హుం అనువిధముగ చేయబడును. రుదిత మనగా ఏడ్పువిధముగ ధ్వనిచేయుట. సూత్కృతము అనగా నిట్టూర్పువిడుచుట అని అర్థము. ధూత్కృతమునకును, కూజితమునకును, ఫూత్కృతమునకును లక్షణములు ముందు చెప్పబడును.

'అమ్మ అమ్మ' అని చేయుశబ్దము, 'అగు అగు' అని చేయు శబ్దము, 'ఇక వద్దు వద్దు' అనుశబ్దము, 'చాలు చాలు' అనే శబ్దము. 'బాబోయి బాబోయి' అని చేయుశబ్దము రతికూజిత ములలో చేయబడుచుండును. రతికూజితములు అనగా రతి క్రీడ జరుగుచున్నసమయములో చేయబడుశబ్దములు, చేయ బడుకేకలు అని అర్థము.

పావురములవలెను, కోకిలలువిధమునను, తీతువపిట్టలచంద మునను, చిలుకలురీతిగను, తుమ్మెదలవలెను, గిడ్డంగిపిట్టలు, హంసలు, కారండవములు గోరువంకలవలెను వినుటకు చక్కగ నుండువిధమున మార్చి, మార్చి ప్రహారణకాలములో విచిత్ర ముగ చేయబడుశబ్దములు రతికూజితము లనబడును. పురుషుడు తనతొడమీద కూర్చొనియున్న ప్రియురాలివీపుమీద పిడి కిలితో నెమ్మదిగ గ్రుద్దవలయును. పురుషుడు ఆవిధముగ చేసి నప్పుడు దానివలన బాధపడుచున్నట్లు నటించుచు స్తనితమును, కూజితమును, రుదితమును యువతి చేయవలయును. తనకక్షు తీర్చుకొనుటకు యువతి పురుషునివీపుమీద ముష్టితో గ్రుద్ద వలయును.

సంభోగముచేయుకాలములో భగలింగసంబంధము కలిగి యున్నప్పుడు పురుషుడు యువతి స్తనముల మధ్యభాగములో అరచేతివెనుకభాగముతో నెమ్మదిగ చరుచుచుండవలయును. అట్టి చరుపులను సహించలేనివిధముగ స్త్రీ హింకారము మొదలగు సీత్కృతములను చేయుచుండవలయును. ఇట్టి సీత్కృతములను రతి ప్రారంభకాలములో కొలదిగను, రతి మధ్యకాలములో

కొంచెము అధికముగను, చివరసమయములో ఇంకను అధికముగను చేయుచుండవలయును.

ప్రియురాలు తనతో వాగ్వాదము చేయునప్పుడు పురుషుడు చేతివ్రేళ్లను కొంచెము ముందునకు వంచి, అరచేతివెనుక భాగముతో ఆమెతలమీద ఫూత్కారము చేయుచు కొట్టవలయును. ఇదియే 'ప్రసృతక' మనబడును. ఇట్టి ప్రహారణమును పురుషుడు చేసినప్పుడు స్త్రీ సహించలేకపోయినట్లు ఫూత్కృతము చేయవలయును. ఫూత్కృత మనగానోరుమూసుకొని కంఠముతోను, ముక్కుతోను చేయుశబ్ద మని భావము.

సంభోగముయొక్క అంత్యకాలములో అనగా స్ఖలన సమయములో ఆయాసముగ నుండును గనుక వినుటకు ఇంపుగ నుండునట్లు రతికూజితములను చేయవలయును. పురుషుడు దంతక్షతమునో, నఖక్షతమునో చేసినప్పుడు అలసిపోయినట్లు నటించుచు కంఠముతో చేయబడుశబ్దము 'ధూత్కృత' మనబడును. ఇట్టిశబ్దమును బద్దలయినవెదురుబొంగునుండి జనించుశబ్దమువలె చేయవలయును. నీటిలో రేగుపండు పడునప్పుడు కలుగు 'బుడుంగు, బుడుంగు' మనుశబ్దమువలె చేయబడుధ్వని 'ఫూత్కృత' మనబడును. పెదవుల పైభాగమును నాలుకతో కలిపి ధ్వనిచేసినయెడల ఇట్టిశబ్దము పుట్టును.

పురుషుడు ముద్దుపెట్టుకొనునప్పుడు యువతియు తిరిగి అందుకు బదులుగ సీత్కారము గలుగు చుంబనములు చేయవలయును.

రతిసమయములో ప్రియుడు కామోద్రేకముచే క్షణక్షణమునకు ప్రణయతాడనములు చేయుచున్నప్పుడు, యువతి

"ఆగు ఆగు; ఇక నాకు వద్దు వద్దు; లేచిపొమ్ము" అని పలుకుచు అలసినకంఠముతో శ్వసితము, రుదితము, స్తనితము అనబడు సీత్కృతములను చేయుచుండవలయును. స్ఖలనసమయమందు కూడ ఇట్టి రతికూజితములనే చేయవలయును. అట్టి రతిచివర సమయములో స్ఖలనమగువరకు మాటిమాటికి కటిక ప్రదేశము నకు రెండువైపులను మెల్లగ కొట్టుచుండవలయును. రతిచివర సమయములో 'సమతలక' మనుసీత్కృతమును ఆచరింపవలయు నని కామసూత్రములలో చెప్పబడియున్నది.

పురుషుడు తనఅరచేతిని బాగుగ చాచి కొట్టుచున్న సమయములో చిలుకలు, గోరువంకలు, హంసలు, కారండవములు అరచునట్లుగ ధ్వనిని చేయవలయును. ఇట్టిధ్వనులు శ్రవణానంద సంధాయకముగను, మనోహరముగను నుండును. అట్టి మనో హరమైనకూతలను వినుటవలన పురుషునిహృదయము ఆనంద ములో మునిగి బ్రహ్మానందభరితు డగుచుండును. ఇట్టి రతి కూజితములను రతిచివరసమయములో తరుచుగ చేయుచుండ వలయును.

పురుషుడు సహజముగ స్త్రీకంటె బలశాలి గనుక ఇట్టి ప్రహారణములను పురుషుడే చేయవలయును. తిరిగి కక్షతీర్చి కొనుటకై కొట్టుటకు తగినశరీరశక్తి లేకపోవుటయు, ఎప్పుడై నను తిరిగి తాడనము చేసినను అబల యగుటచే చేతులు నొప్పి యగుటయు, పురుషుడు కొట్టమని కోరినను సామర్థ్యము లేక పోవుటయు అనునవి స్త్రీకి సహజములు. అందువలన స్త్రీలు సాధారణముగ ప్రహారణలు సలుపలేరు. పురుషుడు ప్రహారణలు చేసినప్పుడు సీత్కారము చేయుటయే స్త్రీలలక్షణము. ఒక్కొ

క్కప్పుడు కామోద్రేకముచే దేశాచారమునుబట్టి తనసహజ ధర్మములను వదలి పురుషునిమీద ప్రహారణలు ప్రయోగించు చుండును. అట్టిసమయములో పురుషుడుకూడ తన సహజలక్షణ ములను ధర్మములను వదలి స్త్రీకి ఉత్సాహము కలుగ జేయుటకు, స్త్రీ చేయునట్లుగ సీత్కృతము, విరుతము మొదలగునవి చేయు చుండవలయును. పురుషుడు ఎల్లప్పుడు ఈవిధానమునే అనుస రించ నవసరములేదు. తనకు ఈవిధముగ చేయవలయునని కుతూహలము కలిగినప్పుడుమాత్రమే ఈవిధముగ చేయుచు, తనకుతూహలము తీరినపిమ్మట మరల ఎప్పటివలె తనసహజలక్షణ ములను అవలంబింపవచ్చును.

ప్రహారణములు నాలుగువిధము లని ఇదివరలో తెలుపబడెను. వానిని ఇంకను పెంచి ఎనిమిదిరకములుగ చెప్పుచున్నాను. చూపుడువ్రేలునకును, మధ్యవ్రేలునకును మధ్యగ బొటనవ్రేలును దూర్చి గ్రుద్దుట "కీల" యనబడును. దీనిని మొట్టినట్లుగ ఆచరింపవలయును. దీనిని స్తనములమధ్య భాగములో ప్రయోగించవలయును. కర్తరి అను ప్రహారణము ఒకటి కలదు. ఇది రెండువిధములుగ చేయబడుచుండును. వ్రేళ్లు కొలదిగ వంచి ఒక చేతితో తాడనము చేసినయెడల "భద్రకర్తరి" యనబడును. రెండుచేతుల వ్రేళ్లను కలిపి తాడనము చేసిన యెడల "యుగళకర్తరి" యనబడును. వీనిని శిరస్సుమీద మాత్రమే చేయవలయును.

చూపుడువ్రేలునకు, మధ్యవ్రేలునకుగాని; మధ్యవ్రేలు నకు అనామికకు మధ్యగాని బొటనవ్రేలును దూర్చి పిడికిలి పట్టి పొడిచిన "విద్ధ" యనబడును. దీనిని బుగ్గలమీద చేయ

వలయును. కుచములమీదను, ప్రక్కభాగములందును చర్మమును లాగినయెడల "సందంశిక" మనబడును. ఇదివరలో చెప్పబడిన నాలుగువిధములైన ప్రహారణములును, ఇవియూ కలసి ప్రహారణములు ఎనిమిదివిధములగుచున్నవి. వీనిని దక్షిణదేశీయులు తరుచుగ ఆచరించుచుందురు. వీరు యువతుల వక్షస్థలముమీద 'కీల' అనే ప్రహారణమును చేయుచుందురు. ఇది దేశాచారము. ఈ 'కీల' అను ప్రహారణమును దేశాచారమైనవారును, అలవాటు గలవారుమాత్రమే ఆచరింపవలయునేగాని ఇతరులు చేయుటవలన అధర్మమగును. కనుక ఇతరులు దీనిని ఆచరింపరాదు.

ఒకదేశమునందలి ఆచారములను, ఇతరదేశములయందలివారు ఆచరింపరాదని కామశాస్త్రములు తెలుపుచున్నవి. మరియు ప్రహారణములను కష్టము కలుగునట్లుగను, ప్రమాదము సంభవించునట్లుగను ఆచరింపరాదు.

పూర్వము చోళదేశపురాజునకు "చిత్రసేన" యనెడి పేరు గలిగినవేశ్య యొకతె యుండెడిది. ఆమె మిక్కిలి సుకుమారమైనది. ఒకదినమున రతిచేయుటకుముందు రాజు ఆమెను గట్టిగ తనశక్తికొలది నొక్కి కౌగలించుకొనెనట. మిక్కిలి సుకుమారురాలు అగుటచే, ఆ ఆలింగనమువలన ఆమె బాధపడుటకు ప్రారంభించెను. ఆవిధముగ ఆమె బాధపడుచున్నను, ఆమెబాధను గ్రహించలేక కామోద్రేకముతోనున్న ఆ రాజు 'కీల'యను ప్రహారణమును ఆమెవక్షస్థలముమీద ప్రయోగించెనట. ఆప్రహారణమువలన ఆమె వెంటనే మరణించెను.

పూర్వము కుంతలదేశాధిపతియైన 'శాతకర్ణి' యను రాజు నూతనముగ అప్పుడే పరిచయమైన 'మలయవతి' యను తన ప్రియురాలిని అబల యని తలపక, సర్వాభరణభూషితురాలై, బాగుగ అలంకరించుకొని మన్మథోత్సవసమయములో కనబడిన వెంటనే మోహావేశాపరవశుడై ఆమెను గవయబోయి, ప్రేమతో 'కర్తరి' యనుప్రహారణమును ప్రయోగించుటవలన ఆమె వెంటనే మరణించెను.

పూర్వము పాండ్యరాజువద్ద నరదేవు డనుపేరుగల సేనాధిపతి యుండెడివాడు. నరదేవుడు విశేషబలశాలి. అంతఃపురములో నాట్యముసలిపెడు 'చిత్రలేఖ' యను ఒకవేశ్య యుండెడిది. చిత్రలేఖ గొప్పసౌందర్యవతి. నరదేవుడు చిత్రలేఖను మోహించి ఒకనాడు ఆమెతో సంభోగము చేయబోయి కామోద్రేకముచే 'విద్ధ'యనుప్రహారణమును ఆమెమృదువైన చెక్కిళ్లమీద మోటుతనముగ ప్రయోగించుటవలన ఆమె వెంటనే కళ్లుతిరిగి క్రిందపడి మరణించెను.

ప్రపంచములో కామశాస్త్రరహస్యములను తెలియని వారు కొందరును, తెలిసినవారు కొందరును నుందురు. శాస్త్ర రహస్యముల నెఱుంగనివారు కామకళారంగములో ఏవిధముగ సంచరింపవలయునో తెలియనివారుగ నుందురు. అందుచే కామోద్రేకము కలిగినప్పుడు మోటుతనముగ స్త్రీలపై బడి రతిక్రియలను జేయుటకు ప్రారంభింతురు. అట్టి పురుషులసాంగత్యమును స్త్రీలు చాల ఏహ్యభావముతో జూచుచుందురు. కామశాస్త్ర మెఱింగినయువకుడు ఎంతకామోద్రేకమును కలిగియున్నను తొందరపడక సమయమును గ్రహించి

సంవర్షోచితముగ సంచరింపగలనేర్పరిగ్గా యుండును. అందుచే వీరు ప్రహారణాదులను ప్రయోగించుటలో ఆలోచనతో సంచరించుచుందురు. అందువలన ప్రమాదములు కలుగవు.

సురతవ్యవహారములలో శాస్త్రము తెలిసినవారికిని, తెలియనివారికినికూడ అప్పటికప్పుడు కలుగు అభీష్టములును, భావములును కలలోగూడ అనుకొనియుండనివిగ నుండును. అనగా కామకళావిలాసములు అప్పటి కప్పుడు కలుగుచుండు ననిభావము. అట్టి విషయములన్నియు శాస్త్రములో చెప్పబడుట అసాధ్యము.

విక్రమము, వల్గితము, ఉపకంఠము, ఉపజవము, జవము అని గుఱ్ఱములు అయిదురకములుగ పరుగెత్తుచుండును. ఈ అయిదు రకములైన నడకలయందును, అయిదవదియైన జవమను రకముగ గుఱ్ఱము పరుగెత్తుచున్న సమయములో అతివేగముగ పోవుచు, త్రోవలో గోతులున్నవనిగాని, దిబ్బలున్నవనిగాని, చెట్లున్నవని గాని గుర్తించలేకపోవును. ఆవిధముగనే యువతీ యువకులు కామోద్రేకములో శరీరములు మైమరచి అతి తొందరగ సురతక్రియలు జరుపుచుండురేగాని కలుగబోవుకష్టములను గుర్తించలేకపోవుదురు. శాస్త్రరహస్యముల నెరుగని వారిరీతి ఈపద్ధతిగ నుండును.

అందువలన శాస్త్రమును చదివినపురుషుడు సమయమును గ్రహించి, తాను సంభోగించబోవుస్త్రీయొక్క బలాబలములను తెలుసుకొని, అతి చండవేగముగ సలుపవలయునో, మృదువుగ సలుపవలయునో గ్రహించి యుక్తాయుక్తవివేకజ్ఞానములో

ప్రవర్తించగలుగును. దీనివలన శాస్త్రము తెలిసినవారికిని తెలి యనివారికిని సురతక్రియలలో చాలభేద ముండు నని తేలు చున్నది. కామశాస్త్రరహస్యములను తెలిసినవారు ఉద్రేక ముతో తొందరపడి రతిక్రియ ఎన్నడును చేయరు.

అందరిస్త్రీలయందును అన్నిరకములబంధనములను ప్రయో గింపరాదు. దేశకాలమానపరిస్థితులను గ్రహించి బుద్ధిమంతు లైనవారు సంప్రయోగములను జరుపుచుండవలయును.

అందువలననే కామశాస్త్రరహస్యజ్ఞానము ప్రతిమానవు నకును ముఖ్య మని గ్రహించి వాత్స్యాయనులవారు ఈకామ సూత్రములను సకలజనోపయుక్తముగ వ్రాసిరి.

---

# ఔపరిష్టములు

ఆలింగనము మొదలు పురుషాయితములవరకు గల సంభోగవిధానముల నన్నిటిని పురుషులు పూర్వము చెప్పబడిన నాలుగురకముల నాయికలయందును ఉపయోగించవచ్చును.

స్త్రీగాక, పురుషుడునుగాక యుండు అయిదవరకమునకు చెందిన నపుంసకవ్యక్తి చేయురతిక్రీడలు ఔపరిష్టము లనబడును. ఈనపుంసకవ్యక్తి ప్రపంచములో మూడవరకమునకు చెందిన వ్యక్తిగ పరిగణింపబడుచుండును. అట్టి నపుంసకులలో రెండురక ములైనవారు కనబడుచున్నారు. స్త్రీకివలె స్తనములు మొదలగు అంగములు కలవారు ఒకరకముగను, పురుషునివలె గడ్డములు, మీసములు మొదలగునవి యున్నవారు రెండవరకమునకు చెందినవారుగను నున్నారు. ఈ రెండురకములైననపుంసకులు రతికొరకు చేయుకృత్యములు 'ఔపరిష్టకము' లనబడును.

స్త్రీకివలె స్తనములు కలిగియున్ననపుంసకవ్యక్తి వస్త్ర ములు ధరించుటయందును, సంభాషణయందును, విలాసములం దును, కోరికలందును, స్వభావము, సుకుమారత మొదలగువాని యందును, ప్రహారణాదులను సహించలేకపోవుటయు, సిగ్గు మొదలగువానియందును, కేవలము స్త్రీలక్షణములనుమాత్రమే కలిగియుండును.

పైన చెప్పబడినవిధముగ స్త్రీలక్షణములను కలిగియున్న నపుంసకవ్యక్తి స్త్రీ యోనితో చేయుక్రియలన్నిటిని, తాను నోటితో చేయును. దీనినే 'ఔపరిష్టక' మందురు. స్త్రీలక్షణము

లను కలిగియున్న నపుంసకవ్యక్తి సర్వవిషయములయందును స్త్రీవలె సంచరించవలయును. వేశ్య సంచరించువిధముగ సంచరించుచు తాను పొందతగినవాళ్లను ఆశ్రయించి పొందుచు భావప్రాప్తిని పొంది తృప్తిపడుచుండవలయును.

పురుషరూపములో నున్న నపుంసకవ్యక్తి పురుషుని వలెనే వస్త్రములను ధరించుచు, స్త్రీరూపములో నుండునపుంసకవ్యక్తి వ్యవహరించువిధముగనే నోటితో రతికృత్యములను జరుపుచు, పైకి తెలియనివిధముగ అభిమానికసుఖభావమును మనస్సునందు కలిగియుండి పురుషునితో కలియుటకు ప్రయత్నము చేయుచుండును. ఇట్టివ్యక్తులు పురుషులకు కాళ్లుపిసుకుట మొదలగు క్రియలు చేయుచు, స్పర్శసౌఖ్యమును పొంది ఆనందించుచుందురు.

ఈనపుంసకుడు పురుషులకు ఒళ్లుపట్టుసమయములో అతనిని కౌగలించుకొనునట్లు తనయంగములతో పురుషునితొడలను పట్టుచు, పరిచయము వృద్ధియయినతరువాత కటిప్రదేశమునుకూడ స్పృశించుటకు మొదలుపెట్టవలయును. ఈవిధముగ గజ్జలు, పిఱుదులు, కటిప్రదేశము పట్టుచుండినయెడల పురుషుని మదనదండము విజృంభించుటకు ప్రారంభమగును. ఆవిధముగ పురుషునిలింగము కొయ్యవలె బిఱ్ఱబిగిసి నిలువబడినప్పుడు తనచేతికి తగులునట్లుగ ప్రవర్తించవలయును. ఆవిధముగ పిసుకుటవలన ఇంకను లింగము పెద్దదై దృఢమగుచున్నయెడల అప్పుడు అతని చపలత్వమును చూచి పరిహాసము చేయుచున్నట్లు అతనిముఖమువైపు చూచి నవ్వుటకు ప్రారంభించవలయును.

లింగము దారుఢ్యమును పొందుట కామోద్రేకసూచన యగును. ఆవిధముగ లింగము స్తంభమువలె దారుఢ్యమును చెందియున్నప్పుడు ఔపరిష్టక్రీడలకు పురుషుని అనుమతిని పొందినను పొందకపోయినను తనంతట తానే ఔపరిష్టక్రియలు జరుపుటకు ప్రారంభించవలయును. పురుషుడు తనచపలత్వము తీర్చుకొనమని స్వయముగ ప్రేరేపణచేసి అంగీకారభావమును వెల్లడించినయెడల 'నేను అట్టిపనికి అంగీకరింపను' అనికొంతసేపు సిగ్గుపడినట్లు నటించి పిదప ఔపరిష్టకములు మొదలుపెట్టవలయును. స్త్రీరూపములో నుండునపుంసకవ్యక్తి తన అభిలాష వెలిబుచ్చుచుండును గనుక యిక అది లగాయితు ఔపరిష్టక క్రియలు జరుపవచ్చును.

ఈఔపరిష్టకక్రియలలో నిమితకము, పార్శ్వతోదష్టము, బహిస్సందంశనము, అంతఃసందంశనము, చుంబితకము, పరిమృష్టకము, ఆమ్రచూషితకము, సంగరము అనునామములతో ఎనిమిది రకములగుకృత్యములు గలవు. నిమితకము మొదలగు ఈ అష్టవిధకృత్యములను వరుసగ ఒక్కొక్కదానినే ఆచరించి తుదకు నిలిపివేసి, తనకోరికను సూచించుచు పురుషునకు అభిలాషను కలిగించి, అతని అంగీకారమునిమీద తాను మరల ఔపరిష్టకములుచేయుచున్నట్లు నటించుచుండవలయును.

నపుంసకవ్యక్తి నిమితమును ఆచరించినపిమ్మట పురుషుడు మిగిలినకృత్యములనుకూడ చేయమని నపుంసకవ్యక్తిని కోర వలయును. ఔపరిష్టకక్రియలలో బాహ్యమనియు, అభ్యంతర మనియు రెండువిధములు గలవు. పురుషుని మేహనమును తన గుప్పిటతో పట్టుకొని నపుంసకవ్యక్తి తనపెదవులమీద దాని

అగ్రమునుంచి, పెదవులతో లింగముయొక్క చివరభాగమును గుండ్రముగ పట్టి నోటిని ఇటు అటు కదల్చుచుండవలయును. ఈవిధానమే 'నిమితక' మనబడును.

నపుంసకవ్యక్తి పురుషుని మేహనమును గుప్పిటితో పట్టుకొని ప్రక్కగయుంచి దంతములకు తగులనీయకుండ పెదవులతో మాత్రమే పీడించి ఇక వలదని అంతటితో ఆపినయెడల అది 'పార్శ్వతోదష్ట' మనబడును.

తరువాత పనికి పురుషుడు ప్రేరేపణచేసినయెడల నపుంసకవ్యక్తి తనపెదవులతో సాధనముయొక్క చివరభాగమును గట్టిగ పట్టుకొని అదిమి అదిమి వదలినయెడల 'బహిస్సందంశము' అనబడును.

పురుషునికోరిక ననుసరించి లింగమును మరికొంత లోనికి పోనిచ్చి పైన చెప్పబడినవిధముగ పెదవులతో పీడించి వదలుట 'అంతస్సందంశ' మనబడును.

మదనదండమును గుప్పిటితో పట్టుకొని చివరిభాగమును పెదవులతో ముద్దుపెట్టుకొనుట 'చుంబిత' మనబడును. ఆవిధముగ చుంబనము చేసినపిదప లింగముయొక్క చివరభాగమును నాలుకతో తడుముచు గట్టిగ నొక్కినయెడల 'పరిమృష్టక' మనబడును. పురుషునికోరిక ననుసరించి పైన చెప్పబడినవిధముగ మదనదండమును బాగుగ నోటిలోపలికి బోనిచ్చి నాలుకతోను పెదవులతోను గట్టిగా నొక్కి పైకి లాగి వదలినయెడల 'ఆమ్రచూషితక' మనబడును. పురుషునికోరిక ననుసరించి ఈవిధమైన ముఖరతియందు మేహనమును నాలుకతో బాగుగ పీడిం

చుచు, పెదవులను కదలించుచు, శిరస్సును అటు యిటు త్రిప్పుచు నొక్కిపట్టినయెడల 'సంగర' మనబడును.

కామోద్రేకము ఎట్లు మృదు, మధ్య, వేగభేదములతో నిమితము మొదలగు ఔపరిష్టక్రియలలో మితిమీరునో ఆవిధముగనే స్తనాది తాడనప్రయోగవిషయములలోకూడ అభివృద్ధిక్రమమును అనుసరింపవలయును.

కులటలును అనగా కులమునుండి వెలివేయబడినస్త్రీలును, తనకు యిష్టమైనపురుషునితో కూడుచుండుస్త్రీలును, పరిచారికలును, ఒళ్లుపట్టుస్త్రీలును మొదలైనవారుకూడ ఇట్టి ఔపరిష్టక క్రీడలను సలిపి తృప్తిని పొందుచుందురు.

ఇట్టి ఔపరిష్టక క్రియలను సలుపరాదని ధర్మశాస్త్రములో చెప్పబడియుండెను. శిష్టాచారసంపన్నులు యిట్టి ఔపరిష్టకకార్యములకు ఎన్నడును అంగీకరింపరు. పెద్దలు వీటిని పూర్తిగ నిషేధించిరి. ఔపరిష్టక క్రియలు జరిపిన స్త్రీముఖమును చుంబించుటకు అసహ్యము కలుగును. అందువలన ఇట్టికృత్యములు చేయరాదని ప్రాచీనార్యులు తెలిపియున్నారు.

కులమునుండి వెలివేయబడినస్త్రీలు, వేశ్యలు మొదలగు స్త్రీలతో సంభోగము జేయునప్పుడు ఔపరిష్టకార్యములు చేయుట దోషము కాదనియు, కులకాంతలతో నిట్టికార్యములు చేయుట దోషమనియు వాత్స్యాయనులవారి అభిప్రాయము. కనుక ఔపరిష్టకార్యములు జరుపుస్త్రీలతో ప్రాచ్యదేశీయులు సంభోగముచేయుటకు ఇష్టపడరు.

అహిచ్ఛత్ర దేశమునందలి పురుషులు వేశ్యలతో సంభోగము జరుపరు. ఒకవేళ వేశ్యలతో సంభోగము జరిపినను

ఔపరిష్టకృత్యములకు అంగీకరింపరు. అయోధ్యలో జన్మించిన పురుషులు మంచిచెడ్డలను గమనించక వేశ్యలతోకూడ రతిచేయు చుందురు. ఔపరిష్టకములనుకూడ తరుచు ఆచరించుచుందురు. పాటలీపుత్ర దేశమునందు జన్మించినపురుషులు తమంతట తాము ఔపరిష్టక్రియలకు స్త్రీలను ప్రేరేపణచేయరు, కాని స్త్రీలు కోరినయెడల అంగీకరించుచుందురు. శూరసేనదేశీయులు ఎట్టి సందేహమునులేక ఔపరిష్టక్రియలను సలుపుచుందురు.

స్త్రీల స్వభావమును, మనస్సును, ఆచారమును, మంచి ప్రవర్తనను, విశ్వాసమును, మాటలను నమ్ముటవలన ప్రమాద ములు సంభవింపవచ్చునని పెద్దల అభిప్రాయము. స్త్రీలస్వభావము సహజముగ మలినపూరితమైనదిగ నుండును. అందువలన స్త్రీలను ఎన్నడును పూర్తిగ నమ్మరాదు. నమ్ముచున్నట్లుగనే నటించుచు వారిని ఒకకంట కనిపెట్టుచునేయుండవలయును.

శిష్టులయందుకూడ దేశాచారములలో విశేషభేదము కనబడుచున్నది. ధర్మశాస్త్రములలోకూడ సంభోగసమయ ములో స్త్రీముఖము శుద్ధమైనదిగ నుండునని చెప్పబడియున్నది. అందువలన దేశాచారము ననుసరించియు, తమ అభీష్టముల ననుసరించియు యువతీయువకులు ఉచితరీతిని ప్రవర్తించవలయు నని వాత్స్యాయనులవారు తెలిపియుండిరి.

రతియందు చాలకాలము అనుభవముగలిగినపురుషులును, పరిచారికులును, కామోద్రేకము అణగినవారును ఔపరిష్ట ములను ప్రయోగింపరాదు. మొత్తముమీద ఔపరిష్టము ఆచ రించుట మంచిదికాదనియు, అది విశేషప్రచారములో లేదనియు తెలుసుకొనవలయును. కొందరు నాగరికులు సౌఖ్య

మును అపేక్షించి విశేషపరిచయము గలవారితో యీఔపరిష్ట క్రియలను ఆచరించుచుందురు. స్త్రీలు ఏవిధముగ యీఔపరిష్ట క్రియలను పురుషులమీద చేయుదురో, ఆదేవిధముగ పురుషులును స్త్రీలతో ఔపరిష్టకార్యములను. జరుపవలయును. యువతీయువకులు ఒకరికాళ్లవైపున ఒకరు పడుకొని ఒకరి రహస్యేంద్రియములను ఒకరు చేతితో తడుముకొనుచు చూచుచున్నయెడల 'కాకిలం' అనబడును. మరియు ఇందు స్త్రీపురుషులు ఒకరిఅంగమును ఒకరు నాలుకతో తడుముచుందురు. ఇందు కాకి నోటితో మేతను తిసుకొనినట్లుగ స్త్రీపురుషులు ప్రవర్తించుచున్నారు గనుక దీనికి 'కాకిలం' అని పేరువచ్చినది.

అందుమూలముననే విశేష నేర్పరులు, సాహసవంతులు, అధికులు అయినయోగ్యులను వదలి వెశ్యలు, కులమునుంచి వెలివేయబడినవారు, అవివేకులు, చాకలి, మంగళ్లతోను, దాసులతోను, మావటివాళ్లతోను, గుఱ్ఱపుబండివాళ్లతోను ప్రేమించి, నీచముగ సంభోగము చేయుచుందురు.

విద్యావంతులును, రాజకీయవేత్తలును, మంచిప్రవర్తనగలవారును ఇట్టి ఔపరిష్టకకృత్యములు చేయుట మంచిదికాదు. శాస్త్రములో వ్రాయబడిన ప్రతివిషయమును ఆచరించుటకు ప్రయత్నము చేయరాదు. ఏదేశమునకు ఏఆచారము చెప్పబడినదో ఆదేశమునందు ఆ ఆచారమునే అవలంబించవలయును గాని ఇతరదేశాచారములు అనుసరణీయములు గావని గుర్తింపవలయును. విశేషించి స్త్రీయొక్క స్వభావమును గ్రహించి రతిక్రీడలలో మెలగవలయునేగాని శాస్త్రములో చెప్పబడిన విషయములన్నియు ఆచరించుటకు ప్రయత్నించకూడదు.

అందుచే బుద్ధిమంతులైనవారు దేశ కాల పాత్రానుసారములను గ్రహించి ఈ ప్రయోగము ఆచరించవచ్చునా, ఆచరించరాదా అని ఆలోచించి పిమ్మట ఆచరింపవలయునేగాని 'గ్రుడ్డిఎద్దు చేనునందు బడినట్లు'గ సంచరింపరాదు.

ఈ ఔపరిష్టక్రియలు చాల రహస్యములైనవి గనుకను, మనస్సును చలింపజేయునవి గనుకను, ఎవరు ఎప్పుడు ఏవిధముగ ప్రవర్తింతురో ఎవరును తెలుసుకొనలేరు.



# రతి అనంతరము

రతి అనంతరము చేయవలసినపనులనుకూడ తెలుసుకొన వలయును. సంభోగమును బాగుగ తృప్తిదీరునట్లు అనుభవించినపిమ్మట యువతీయువకులు ఒకరితో నొకరికి పరిచయము లేని వారివలె తొలగి ఒకరి నొకరు కన్నెత్తి చూడక వేర్వేరు గదులలో ప్రవేశించి కొంచెము వేడిగనుండునీటితో స్నానము చేయవలయును. ఆవిధముగ స్నానము చేయునప్పుడు రహస్యాంగమును వేడినీటితో పరిశుభ్రము చేయవలయును. కామకేళీవిలాసములలో చేసినపనులు మనస్సున నిలువబడియున్నచో, రతిఅనంతరము అట్టిపనులు తలచుకొనుట అసహ్యకరముగ నుండును. ఇట్టిది విరక్తికి దారితీయవచ్చును. కనుక తప్పక స్నానమాచరింపవలయుననియె కామశాస్త్రవేత్తలు తెలుపుచున్నారు.

స్నానానంతరము పరిశుభ్రమైనవస్త్రములు ధరించవలయును. పడకను మార్చవలయును. రతి సలిపినప్రదేశమునందు గాక యితరఆసనములపై వేరువేరుగ ఒకరికి ఎదురుగ ఒకరు కూర్చొనవలయును. ఒకరిముఖమును ఒకరు చూచుటకు సిగ్గుపడుచున్నట్లు అభినయించవలయును. పిదప తాంబూలములను సేవించి స్వచ్ఛమగు మంచిగంధమును, అనులేపనములను ప్రియుడు ప్రియురాలికి స్వయముగ అందీయవలయును.

అనంతరము యువకుడు తనప్రియురాలిని ఎడమబాహువుతో బంధించి ఆలింగనము చేసుకొనవలయును. మధురపానీయమును చేతపట్టి యువకుడు తనప్రియురాలిని కోరుచు, ఆమెచే

ఆపానీయమును త్రాగించవలయును. ఫలములు, భక్ష్యములు, పాలు మొదలగునవి స్వీకరింపవలయును. ఫలరసములు మొద లగునవికూడ స్వీకరించుటవలన మరల రతిసలుపుటకు నూత నోత్సాహము కలుగును. ఈవిధముగ చేయుటవలన సంభోగ కాలములో కలిగినశ్రమ క్రమముగ తగ్గి నూతనోత్సాహము కలుగును.

వీర్యవృద్ధికరములైన, బలవర్ధకములగు భక్ష్యభోజ్య చోష్య లేహ్యాదులగు నాహారపదార్థములను సేవింపవలయును. పిదప యువతీయువకులు కొంచెముసేపు వెన్నెలలో విహరించ వలయును. సంతోషము కలుగునట్లు సంభాషణలు చేయవల యును. ఈవిధముగ చేయుటవలన వారిలో ఒకవిధమగు ఆనం దము ఉద్భవించును. రతిక్రీడాసమయమున కలిగిన లజ్జాబిడియ ములు తొలగిపోవును.

రతి అనంతరమున స్త్రీపురుషులకు చెమ్మట శరీరము క్రమ్మియుండుటవలన శరీరము మాలిన్యముగ నుండును. అట్టి సమయమున సాధారణముగ అనేకులు ఆవిధముగనే నిద్రించు చున్నారు. అది ఆరోగ్యమునకు భంగకరము. రతి అనంతరము నోరు, ముఖము, కన్నులు, ముక్కు, కాళ్లు, చేతులు బాగుగ తోమి కడుగుకొనవలయును.

శౌచము, శుభ్రవస్త్రధారణము, తాంబూలచర్వణము, చందనచర్చ, ఉపాహారపానీయములు, వాయుచంద్రికాదివిహా రము, నిద్ర - ఇవి సంభోగానంతరము తప్పక ఆచరింపవలసినపను లని కామశాస్త్రవేత్తలు తెలుపుచున్నారు. వేడినీటిస్నానము వెంటనే బలమును కలుగజేయును. స్నానమునకును, రహ

హ్యాంగములను శుభ్రము చేసుకొనుటకును వేడినీటిని ఉపయోగించుటయే మంచిది. రతి అనంతరము రహస్యాంగములను ప్రక్షాళన చేయకుండినయెడల ఉపదంశరోగములును, సుఖ రోగములును, గుహ్యావయవరోగములును సంభవించును.

స్త్రీలు తమమర్మస్థానమును కడుగుకొనుటలో పురుషుల కంటెను విశేషశ్రద్ధ కలిగియుండవలయును. ఏలనన స్త్రీల మర్మ స్థానములు పురుషుల మర్మస్థానములకంటెను అధికచిక్కులుగలవి. అందువలన క్రిములుదాగుకొనుటకు ఎక్కువవసతి కలిగియున్నవి.

సురతానంతరము రెండుఘడియలవరకు వ్యాయామము అనగా దేహపరిశ్రమ చేయకూడదు.

### సురతానంతరము నిద్ర ముఖ్యము

అన్నిటికంటెను, సంభోగానంతరమున నిద్రపోవుట చాల ముఖ్యము. సురతానంతరము రాత్రినిద్రించిననిద్ర చాలని యెడల పగలుకూడ నిద్రపోవచ్చునని ఆయుర్వేదవైద్యగ్రంథ ములలో చెప్పబడియున్నది. సంభోగముచే శ్రమజెందినవారు పగలుకూడ నిద్రపోవచ్చునని కామశాస్త్రకారులందరును వ్రాసి యున్నారు. అట్లు చేయుటవలన ధాతుసామ్యమును, బలమును కలుగును. అవయవములకు పుష్టికలిగి ఆయుర్వృద్ధి కలుగునని చెప్పబడియుండెను.

సంభోగానంతరము పంచదారతో కలిసినపాలును చెరుకు రసముతోగాని, బెల్లముతోగాని, తయారైనభక్ష్యములును చాల ప్రశస్తములైనవని భావప్రకాశకారుడు తెలిపియుండెను.

సురతానంతరమున క్షీణించినధాతువును మరల పుష్టి నొందింపజేయుటకు ఉపాహారపానీయము జీర్ణశక్తి ననుసరించి

మితముగ పుచ్చుకొనుట ముఖ్యావసరము. సంగమముచే బడలికనొందినవారికి అనుపానము నిమిత్తము పాలు అమృతముతో సమానమైనదిగ నుండును. ఈవిషయము అందరకును తెలిసినదే. అందువలననే గర్భాదానపుగదులలో పాలు, పంచదార, చిలకలు, మినపసున్ని, నువ్వుపప్పుతో చేసినవంటకములు ఉంచుదురు. ప్రతిసురతానంతరము కామినీకాముకులు ఉపాహారపానీయములను సేవించుచుండవలయును.

శౌచనమునకు పోవుసమయములో ఒకరి నొకరు చూచుకొనిన మరల ఎప్పటికిని ప్రేమ కలగనంతటివైరాగ్యము సంభవించు ప్రమాదము కలుగును. అందువలన శౌచమునకు పోవునప్పుడు స్త్రీపురుషులు ఒకరి నొకరు తేరిపార చూచుకోకుండా తొలగి వెళ్లిపోవలయునని చెప్పుచున్నారు.

స్త్రీయోనియందు పురుషునకు వీర్యస్ఖలనము అయిన వెంటనే మైథునక్రియ ముగిసినట్లు అనేకులు భావించుచున్నారు. అట్లు తలచుట పొరపాటు. వీర్యపతనము అయిన తరువాతకూడ పురుషునిలింగము కొంచెముసేపు బిఱ్ఱబిగిసియే యుండును. లింగము బిరుసుగానున్నంతసేపు దానిని యోనియందే యుంచవలయును. అందువలన యువతికి విశేషతృప్తి కలుగును. మరియు ఆవిధముగ నుంచటవలన ఆరోగ్యశాస్త్రరీత్యా స్త్రీపురుషులు మంచి ఆరోగ్యవంతు లగుదురు. ఆవిధముగ నుంచుటవలన యోనిలో ఊరినద్రవములను పురుషునిలింగము తనయొక్క చర్మముద్వారా లోనికి పీల్చుకొనును. పురుషావయవము ఈద్రవమును ఎంత అధికముగ పీల్చుకొనునో పురుషునకు అంతఆయువు వృద్ధియగు నని వైద్య

శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అనగా ఈవిధముగ ప్రతిసంభోగానంతరము చేయుచుండినయెడల ముసలితనము త్వరగా రాదని వైద్యశాస్త్రవేత్తల అభిప్రాయము. అంతియేగాక అట్టిద్రవమును పీల్చుకొని పురుషాంగ మింకను క్రొత్త బిగిని, జిగిని పొందగలుగును. పురుషుడు వదలినవీర్యమునుకూడ కాంత యీవిధముగనే గ్రహించును.

రతి అనంతరమున స్త్రీయొక్క దేహములో ప్రవేశించిన వీర్యము యోనియందుమాత్రమే యుండక రక్తముచే గ్రహించబడి శరీరమంతయు ప్రసరించును. ఆవిధముగ జరుగుటవలన ఆమెశరీరములో నూతనచైతన్యము, నూతనశక్తి, నూతనోత్సాహము కలుగును. ఆమెశరీరములో ప్రవేశించిన వీర్యముయొక్క వాసన కొన్నిగడియలు గతించినపిమ్మట ఆమె ఉచ్ఛ్వాసమునందు గోచరించునని ఒక పాశ్చాత్యకామశాస్త్ర వేత్త వ్రాయుచున్నాడు. ఒకస్త్రీ పరపురుషునితో సంభోగము జరిపినట్లు ఆమెశరీరమును వాసనచూసి కనిపెట్టినట్లు గోపీనాథము వెంకటకవి బ్రహ్మానందశతకములో వ్రాసియుండెను.

పురుషుడు విడిచినవీర్యమును స్త్రీయును, స్త్రీయోనిలో ఊరినద్రవమును పురుషుడును పరస్పరము గ్రహించుకొందురు. కనుక అందుకు తగినఅవకాశమును కలిగించుటకు అంగములను, స్ఖలనమయినవెంటనే పరిశుభ్రము చేయక, స్ఖలనానంతరము కూడ మేహనమును కొంచెముసేపు (పది, పదునైదునిమిషములు) యోనిలో నుంచుట ఆరోగ్యదాయక మని శాస్త్రవేత్తల అభిప్రాయము. అందుచే శౌచవిషయములో కొంచెముసేపు ఆలస్యముచేయుట మంచిది. పురుషునివీర్యమును స్త్రీయు,

స్త్రీభగములో ప్రవించిన ద్రవమును పురుషుడును గ్రహించుటలో భేదములు కనబడుచున్నవి. పురుషుడు కొలదిగ మాత్రమే గ్రహించగలుగును. స్త్రీమాత్రము అధికముగ గ్రహించగలుగును. మరియు పురుషుడు త్వరగ గ్రహించగలుగుశక్తి కలిగియున్నాడు. స్త్రీ కొంచెము మెల్లగ గ్రహించగలుగును.

రహస్యాంగములను పరిశుభ్రపరచుకొనినపిమ్మట ధాతువృద్ధిని కలుగజేయుపదార్థములను యిరువురును కలసి భుజించవలయును. ధాతువృద్ధిని కలుగజేయు మాంసపుపదార్థములు, పిండిపదార్థములు, మామిడిపండ్లు, ఎండుమాంసము, పంచదార కలిపిన మాదీఫలముముక్కలు మొదలగునవి దేశాచారమును బట్టి భక్షింపవలయును. "ఇది రుచికరముగ నున్నది; ఇది బాగుగ యున్నది" అని వర్ణించుకొనుచు భుజించుచుండవలయును.

తరువాత మేడమీద పై భాగమునకు, వెన్నెలను ఆనందించుటకు పోయి అక్కడ ఉచితాసనముపై ఇరువురును కలసి కూర్చుండవలయును. అక్కడ ఆనందముతో నిరువురును యిష్టాగోష్ఠి సలుపుకొనవలయును. అప్పుడు యువతి తన ప్రియునిఒడిలో పడుకొని అతనిలో లీనమైనట్లుగ నుండి చంద్రవంకవైపు చూచుచు, నక్షత్రములను పరిశీలించుచు ఇది అరుంధతి, ఇది ధ్రువుడు, ఈనక్షత్రములు సప్తఋషులు అని ప్రియునకు వర్ణించి చెప్పుచుండవలయును.

రతి ప్రారంభదశయందును, అనంతరమును, యువతీయువకులు పూలమాలలు, సుగంధద్రవ్యములు, పానీయములు ఒకరి

కొకరు అందించుకొనుచు సేవించుచు, సరససల్లాపము లాడు కొనుచున్నయెడల విశేషఆనందదాయకముగ నుండును. యువతీ యువకులు తమ ప్రేమభావములను వృద్ధిపొందించు ప్రణయకోపములతో ఒకరినొకరు క్రేగంటిచూపులతో చూచు కొనుచు తృప్తిపడుచుందురు. మరియు హల్లీసకము మొదలగు నాట్యములతోడను, సంగీతములతోను, రాచక్రీడలతోను, ఆనం దించు తమ అనురాగమువలన చిత్రముగా చలించుచున్న చూపు లతో చంద్రమండలమును చూచుచు వినోదించవలయును. యువతీ యువకులు తమ మొట్టమొదటిచూపులలో ఎట్టికోరికలు తమహృదయములలో కలిగెడివో, వియోగము కలిగినప్పుడు మనస్సులలో నెట్టిపరితాపములకు పాలైరో, వానినన్నిటిని ఒకరి కొకరు చెప్పుకొనుచు కొంతసేపు ఆనందముగ కాలక్షేపము చేయవలయును. పిమ్మట ప్రేమపూరితములగు గాఢాలింగన ములు, చుంబనములు జరుపుటవలన మరల వారిలో సంభో గేచ్ఛ క్రమక్రమముగ హెచ్చును.



# గర్భనిరోధము

గర్భనిరోధపద్ధతులను రెండుతెగలుగ విభజింపవచ్చును. తాత్కాలిక గర్భనిరోధవిధానములు ఒక తెగను, శాశ్వత గర్భనిరోధకవిధానములు రెండవ తెగగను నిరూపింపఁబడుచున్నవి.

గర్భనిరోధము ఎందుకు అవసరమో కొంచము ఆలోచిద్దాము. పెండ్లిఅయిన కొంతకాలమువరకు భార్యాభర్తలు సంసారసౌఖ్యము అనుభవించడానికి అవకాశము ఉండడము మంచిది. ప్రథమసంయోగము గర్భధారణకాలము అయినట్టయితే, ప్రథమ సంభోగములోనే గర్భము దాల్చడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. అందుచేత వివాహము అయిన మొదటిరోజులలోనే భార్యాభర్తలు అనుభవించవలసిన సౌఖ్యమును వారినుండి దూరము చేయడానికి ఈగర్భము ఒక కారణము అవుతుంది. అందుచేత పెండ్లిఅయిన కొంతకాలమువరకు గర్భనిరోధము ముఖ్యావసరమనే కొందరు చెప్పుచున్నారు. ఇది తాత్కాలిక గర్భనిరోధము అనబడుచున్నది.

ఈ తాత్కాలిక గర్భనిరోధము యింకను కొందరి స్త్రీల విషయములో ముఖ్యావసర మవుచున్నది. ఒక గర్భానికి మరో గర్భానికి, అనేక కారణాలవల్ల కాలవ్యవధి అవసరమగుచున్నది. స్త్రీ దుర్బలముగను, అనారోగ్యముగను నున్నప్పుడు తాత్కాలిక గర్భనిరోధము ముఖ్యావసర మని వైద్యులు చెప్పుచున్నారు.

పైనచెప్పబడిన కారణములుగాక, యితర కారణముల వలన శాశ్వత గర్భనిరోధము అమలులో పెట్టవలెనని కొందరి విజ్ఞులు సూచిస్తున్నారు.

గర్భముధరించి ప్రసవించువరకు స్త్రీజననేంద్రియములు ప్రతిదినము మార్పుచెందుచునే ఉండును. ఆరీతిగ దినక్రమమున యోనికుహరము మార్పుచెందుతూ, ప్రసవసమయమునకు బాగుగ విచ్చుకొనవలసి ఉంటుంది. ఆలా అభివృద్ధి చెందనప్పుడు "ములుగులు" అనే ఎముక సక్రమముగ విచ్చుకొనక పోవచ్చు. అట్టి సందర్భాలలో శాశ్వతగర్భనిరోధము ముఖ్యావసరము అవుతుంది.

శిశువు గర్భములో పరిణామముచెంది, పెరిగి పెద్దదై యోనిద్వారా బయటకువచ్చు కార్యక్రమము ఉన్నదికదా. ఆరీతిగ శిశువు సక్రమముగ బయటకు వచ్చుటకు అనేకరెట్లు పెద్దదికావలసిన యోనికుహరము కొన్నిప్రకృతిసిద్ధమైన కారణములచే సరిగ విచ్చుకొనకపోవుటచే, యోనిద్వారము యిరుకై, శిశువు బయటకు రావడానికి తగినస్థితిలో లేదని తెలిసినప్పుడు, తల్లి ప్రాణముకక్షించుకోవడము ముఖ్యావసరముగ కనబడుచున్నది.

అనేక వ్యాధులవలన పైన చెప్పబడిన 'ములుగులు' అనే ఎముకలు విచ్చుకొనక శిశువు బయటకురాక బాలింత మరణించును. అట్టి కారణాలను ముందుగానే గ్రహించి శాశ్వత గర్భనిరోధము అవలంబించి తల్లి ప్రాణములను కాపాడుకొనవలసియున్నది.

గర్భనిరోధము అనేక రీతుల చేసుకొనవచ్చునని విజ్ఞులు తెలుపుచున్నారు.

వాత్స్యాయనుడు తెలిపిన గర్భనిరోధవిధానమును చర్చింతము.

సంభోగసమయములో ఇంద్రియము స్ఖలనము అయ్యే ముందు అంటే ఇంద్రియము వేగముగా బయటకు రాబోతున్న సమయములో బొటనవ్రేలుతో వృషణాలనుండి బీజవాహిని పురుషాంగము దగ్గరకలయుచోట గట్టిగా నొక్కమని వాత్స్యాయనుడు చెప్పెను. ఆరీతిగ నొక్కుటవలన ఇంద్రియము పురుషాంగమునుండి యోనిలోనికి ప్రవేశించదని, అందువలన గర్భము రాదని వాత్స్యాయనుని ఉద్దేశ్యము. వాత్స్యాయనుడు యీ విషయము వ్రాయడములో పొరబడలేదనియే చెప్పవలసియున్నది. కాని ఈ విధానము పురుషశరీరమునకు ఆరోగ్యానికి భంగమును కలుగజేయునని చెప్పుచున్నారు. వాత్స్యాయనుడు తెలిపిన యీ విధానమువలన స్త్రీకి గర్భము రాకపోవచ్చు. కాని క్రమముగా పురుషాంగముయొక్క పటుత్వము నాశనమగుచున్నదని తెలుసుకొనవలసియున్నది.

హెబ్రూ అనే తెగలో కూడా యీ గర్భనిరోధము అమలులో ఉండేది. ఈ గర్భనిరోధపద్ధతి పూర్వకాలములో కూడా అమలులో ఉన్నట్లు మనకు కథలద్వారా తెలియుచున్నది. సంయోగానంతరము పురుషాంగాన్ని తిరోగమింపజేయడము. (అనగా పురుషాంగాన్ని స్ఖలనసమయములో బయటకు తీసివేయడము) శుక్రము నేలమీదపడేటట్లు చేయడము అనే పద్ధతి వాడుకలో ఉండేదని తెలియవచ్చుచున్నది.

ఈస్టిండీస్ ద్వీపములో కొన్ని జాతులవారు నల్ల మందును గర్భనిరోధక ఔషధముగా ఉపయోగించెడివారు. ఒక గుండ్రని పదార్థమునకు నల్లమందును బాగుగపట్టించి, ఆ పదార్థాన్ని గర్భముఖకవాటముగా చేసేవారు. ఆరీతిగ గర్భము నిరోధించబడేది.

బహిష్టుకు, బహిష్టుకు మధ్యశోణితము లేనిరోజులలో సంయోగము జరిపితే గర్భమురాదు. ఆరీతిగా కూడా గర్భ నిరోధము చేసుకొనవచ్చు.

ఉత్తమమార్గము:—గర్భధారణను నిరోధించుటకు స్త్రీ పురుషులు ఎదురెదురుగ కూర్చున్నరీతిగ సంభోగక్రియ జరుపుటే ఉత్తమమార్గమని గ్రహించవలయును. ఈపద్ధతిలో వనిత కొంచము వెనుకకు జరుగుచుండుటయేగాక, నడుమును కూడ కదలించుచుండవలయును. ఆవిధముగ చేయుటవలన శుక్లము యోనిమార్గమున ప్రవేశింపక బయటకు జారిపోవును. ఆరీతిగ గర్భనిరోధము చేయవచ్చును.

సంయోగము ప్రత్యేకించు విధానము:—ఈ విధానములో పురుషాంగము యోనికుహరములోనికి ప్రవేశింప జేయబడుతుంది. పురుషాంగమునుండి శుక్రము బయట పడుటకు పూర్వమే, సంపర్కము పూర్తిగాకుండగనే, పురుషాంగమును బయటకు తీసివేయవలయును. సంభోగక్రియ మొదలుపెట్టిన తరువాత, పూర్తిగాకుండానే పురుషాంగమును బయటకు తీసివేయుట సాధ్యముకానిపని.

ఆరీతిగ ఎవరైనా సంపర్కము మధ్యలోనే, మనస్సును ఆపుకొని, పురుషాంగమును బయటకు తీసివేయగలిగిరా, పురు

షాంగముయొక్క ఉద్రుతము తగ్గక విజృంభించే ఉంటుంది. సక్రమముగా శుక్రస్ఖలనము లేకపోయిన పురుషునికి అనేక బాధలు, అనారోగ్యములు సంభవించును. శుక్రము స్రవించు గ్రంధులు క్రమముగా పాడవును. దినక్రమముగా నపుంసకత్వము ఏర్పడుతుంది. మనస్సునకు ఒకవిధమైన వికారము కలుగుతుంది. అదియునుగాక సంభోగకాలములోకొన్ని పురుషాణువులు పురుషాంగమునుంచి బయటకు వచ్చుచుండును. అట్టి పురుషాణువులవల్ల గర్భము ఏర్పడవచ్చును. అందుచే యీ పద్ధతివలన తప్పక గర్భనిరోధము కలుగుతుందనే నిశ్చయము లేదు.

స్ఖలననిరోధము:—సంభోగముచేస్తూ, శుక్రము స్ఖలనమయ్యే సమయములో పురుషాంగమును బయటకు లాగివేసి శుక్రము యోనిలో పడకుండాచేయడము.

ఆరీతిగ చెయ్యడానికి పురుషుడు సంభోగేచ్ఛను ఆపుకోగలడా! కాని అట్టిచర్య సామాన్యముగా సాధ్యముకాదు. అందుచే ఆపద్ధతి మంచిదికాదనియేతోచుచున్నది. ఏలనన భగరంధ్రమున సౌఖ్యముగ సంభోగముజరుగుచున్నప్పుడు; కామకేళి విలాసములును, బుజ్జగింపులును యువతీయువకుల మధ్యజరుగుచున్నప్పుడు, అట్టి కార్యము అసాధ్యమనియే చెప్పవలసియున్నది. లింగము తన కోరికను నిర్వర్తించుకొనక ప్రశాంతముగ యుండగలుగునా. సంభోగసమయమున రాపిడి మూలమున కలుగు స్పర్శసౌఖ్యమును అనుభవించు ఆశ అధికమగుచుండునేగాని, నిలువరింపసాధ్యమా. అయినను అట్టి సమయమున ఇంద్రియస్ఖలనమును, శ్రోణితము జారుటయు

జరుగకనే, పురుషాంగమునుండి ఒకవిధమైన ద్రవము జారుచుం డును. గర్భము దాల్చుటకు ఆద్రవమొక్కటియే చాలును. కాన యీ పద్ధతివలన గర్భనిరోధము కలుగునని నిశ్చయింప వీలులేదు.

పూర్వకాలమున అమెరికాదేశములో గర్భనిరోధము అమలులో ఉండేది. ఏరోజులలో సంభోగముచేసిన స్త్రీకి గర్భము వస్తుందో కనిపెట్టి, ఆరోజులలో సంభోగము మాను కునేవారు. బహిష్టుకు, బహిష్టుకు మధ్యకాలాన్ని మూడు భాగాలుగాచేసి, మొదటిభాగము, మూడవభాగము నిరపాయ కరమగు కాలములనిన్ని, ఆకాలములో సంభోగముచేసినప్పటికి, గర్భమురాదని తెలుసుకొని, సంపర్కక్రియలు జరుపుకొనే వారు. గర్భధారణకాలమైన రెండవభాగములో సంపర్కమును వదిలేవారు.

సముద్రపు ఉప్పునీటితో యోనిని శుభ్రపరచుకొనిన యెడల సంతాననిరోధము కలుగుతుందని పూర్వకాలములో గ్రీకుదేశస్థులు కనిపెట్టిరి. వినిగర్ అనే పులుపు పదార్థములు కలిసిన జలముతో యోనిని శుభ్రపరచుకొనినచో గర్భధార ణము జరగదని వారి సలహా. ఈరెండుపద్ధతులు సక్రమమైనవి గనే యున్నవి. సముద్రపు ఉప్పులో ఉండు సోడియము రసాయనక పదార్థము. శుక్రములోఉండే పురుష జీవాణువులను బలహీనమునచేసి గర్భము రానీయదు. అదేవిధముగా పులుపు వస్తువులలోవుండే ఆమ్లత్వము కూడా పురుష జీవాణువులను సంహరిస్తుంది. నవీనశాస్త్రజ్ఞులు కూడా యీపద్ధతులే సక్రమ మైనవని చెప్పుచున్నారు.

# రతివిశేషములు

రతులు రాగవత్తు ఆహార్యరాగము, కృత్రిమరాగము, వ్యవహితరాగము, పోటారతము, ఖలరతము, యంత్రితరతము అని విశేషముగ చెప్పబడెను.

యువతీయువకులు మొట్టమొదట ఒకరి నొకరు చూచుకొని; ఒకరి నొకరు ప్రేమించుకొని, అధిక ప్రయత్నముమీద కలసినను, చాలకాలము వియోగము పొంది మరల కలుసుకొనినప్పుడును, ప్రణయకలహములవలన ఎడబాటును పొంది మరల కలుసుకొనినప్పుడును జరుగురతి 'రాగవత్తు' అనబడును. ఇందు యువతీయువకులు అంతఃపూర్వమే ఒకరినొకరు ప్రేమించుకొని అనురాగమును బాగుగ అభివృద్ధిచేసుకొని యుండుటవలన వారివారి ఇష్టానుసారముగ తృప్తితీరువరకు రతిక్రీడలు సలుపుకొందురు.

అంతవరకు కంటిచూపులతోమాత్రమే ఒకరి నొకరు ప్రేమించుకొనుచు, విశేషపరిచయము లేనికామినీకాముకులు చూపులతోమాత్రమే పొందురతము 'ఆహార్యరాగ' మనబడును. పురుషుడు ఇట్టిఆహార్యరాగములో చతుష్షష్టికళలను ఉపయోగించి తనప్రేమను యువతికి తెలియజేయుచుండవలయును. ఇట్టిప్రేమ యువకుడు కేవలము కామముకొరకే గాక ఆస్త్రీమూలమున ధనమును సంపాదించుటకో, లేదా ఏయితరకార్యములు నెరవేర్చుకొనుటకో అయియుండును. ఇది నిజముగు

ప్రేమకాదు. అట్టి యువకుడు అంతకుపూర్వమే వేరొకయువ తిని ప్రేమించియుండును. ఆస్త్రీకూడ వేరొకపురుషుని ప్రేమించి యుండును. అట్టి స్త్రీపురుషులు ఏవో తమ యితరకార్యము లను నెరవేర్చుకొనుటకుమాత్రమే ఒకరి నొకరు ప్రేమించుకొని రతికార్యమును చేయుచుందురు. అందువలన నిట్టిది కృత్రిమరాగ మనబడును. ఇట్టి ప్రేమ నీచమైనది. సత్పురుషులు ఇట్టిప్రేమను అవలంబింపరు. ఇందు నిజమైనప్రేమ యుండదు గనుక శాస్త్ర ములో చెప్పబడిన సమస్తకములైన ఆలింగనములను దేశ కాలపాత్రానుసారములనుబట్టి ఆచరించవచ్చును.

పురుషుడు తనమనస్సును తాను అంతకుపూర్వమే ప్రేమించిన స్త్రీయందే యుంచి, రతిని మొదలుపెట్టినది లగా యితు చివరవరకు అట్టిఅభిప్రాయముతోనే వ్యవహరించినచో 'వ్యవహితరాగ' మనబడును. ఇందు స్త్రీకూడ అదేవిధముగ ప్రవర్తించవలయును. సంభోగసుఖమందును కపటప్రేమయే ప్రద ర్శింపబడును గనుక పైన తెలిపినవిధముగనే, యీగ్రంథములో తెలుపబడిన యోగములనన్నిటిని ఆచరించిచూడవలయును.

నీచులైన పరిచారికలందుగాని, అట్టి ఇతరస్త్రీలయందు గాని ఆకాస్తకాలము ప్రేమను నిలిపి రతిచేసినయెడల 'పోటా రత' మనబడును. పోటారతమునందు స్త్రీపురుషు లిరువురును తాత్కాలికప్రేమను మాత్రమే కలిగియుందురు. అట్టిస్త్రీలతో సంభోగము జరుపునప్పుడు ఆలింగనములు మొదలగు క్రియలు జరుపరాదు. ఒక్కరతిమాత్రమే చేయవలయును.

వేశ్యలుగాని, దాసీస్త్రీలుగాని తమతృప్తి తీరువరకు రతిచేయగలిగిన మగవారు లభించనప్పుడు, విశేషబలముగ సన్న

పురుషుని పిలిచి వానిచే రతిచేయించుకొందురు. ఇట్టిది 'ఖలరత' మనబడును.

ఆవిధముగనే కామోద్రేకముతో నున్న పల్లెటూరి యువతులు, సుందరముగ నుండుపట్టణవాసులైన యువకులను చూచి తృప్తి కలుగువరకు వారితో చేయురతమునకుకూడ 'ఖలరత' మనిపేరు.

విశేషపరిచయము కలిగియుండి, ఒకరి నొకరు బాగుగ ప్రేమించుకొనుచున్న స్త్రీపురుషులు జరుపుకొను సంభోగము 'అయంత్రితరత' మనబడును.

ఒకపురుషుని ప్రేమను సంపాదించుకొనినయువతి, ఆపురుషుడు వేరొకయువతినిగురించి తనతో చెప్పినను, ఆమెపేరు చెప్పినను, కలలో ఆమెనుగురించి కలవరించినను, అతడు అపచారముచేసినను ఎంతమాత్రము సహించక వెంటనే కలహించవలయును.

అట్టిసమయములందు యువతులు కలహించి ఏడ్పు ప్రారంభించుటయు, ఆవేదనపడుటయు, తలవెంట్రుకలను చిందరవందర గావించుకొనుటయు, తల మొత్తుకొనుటయు, నేలపై పడిపోవుటయు, అలంకారములు ఊడదీసి నేలమీద పారవేయుటయు మొదలగుచేష్టలు చేయవలయును. అట్టిసమయములో నాయకుడు ఉచితరీతిని లాలించి, ప్రేమ ఉట్టిపడునట్లుగ మాట్లాడి, బ్రతిమాలి, బుజ్జగించి, ఒప్పించి, సమాధానపరచి మరల ఎట్టులో శయనముమీదకు చేర్చవలయును. ఈవిధముగ పురుషుడు ప్రేమ యుట్టిపడునట్లు మాట్లాడుచున్నప్పుడు, అతనిమాటలను విశ్వసించనట్లుగ నటించుచు కోపమును వృద్ధిపరచి, అగనిజుట్టు

పట్టుకొని, ముఖమును పైకెత్తి, తనకాలితో అతనిపీపుమీదను, తొడలుమీదను, శిరముమీదను, వక్షస్థలముమీదను నెమ్మదిగ తన్నవలయును. మరియు కోపమును ఇంకను వృద్ధిచేసుకొని బయటకు పోవుచున్నట్లు గుమ్మమువరకు బోవలయును. మరల తిరిగివచ్చి నేలపై కూర్చొని కంటకిమింటికి ఏకధారగ ఏడ్చుటకు ప్రారంభించవలయును. ఎంతకోపమువచ్చినను స్త్రీ గుమ్మముదాటి బయటకు పోరాదు. పొరుగిండ్లకు తరుచు వెళ్లకూడదు. అట్టి విషయములు మంచివికావు. పురుషుని కాలితో తన్నుట దోషమే యైనను కామకేళీవిలాసములో ప్రేమాస్పదముతో చేయబడును గనుక ప్రేమచిహ్నమే యగునుగాని దోష యుక్తము కాదని పెద్దలు చెప్పుచున్నారు. అట్టిసమయములో తన బిగిసరిని వదలక పురుషునిచే బ్రతిమాలించుకొనబడి యుక్తి యుక్తముగ ప్రసన్నురాలగుటకు ప్రయత్నించవలయును. ప్రసన్నురాలైనను వికటముగనే మాట్లాడుచు, అతనిని శ్రమ పెట్టుచు చివరకు బాగుగ ప్రసన్నురాలై సంభోగమునందు అపేక్షకలిగినట్లు భావములు సూచించుచు పురుషునిచే కౌగలింప బడవలయును.

వేశ్యయు, అన్యస్త్రీయు కలహించువిధానములను తెలుపు చున్నాను. స్త్రీ, తనగృహమందే యుండి, పైన తెలుపబడిన కారణములవలననే పూర్వము చెప్పబడినవిధముగ కలహించ వలయును. పిదప తనమన్సునకు అమితకష్టము తోచినట్లుగ నటించుచు ప్రియునిదగ్గరకు చేరవలయును. అప్పుడు పురుషునకు సహాయముగా నున్న పీఠమర్దుడు, విదూషకుడు, విటుడు అను మధ్యవర్తులవలన బ్రతిమాలింపబడి వారితో కలసి ప్రియుని

గృహమునకు బోవలయును. ప్రణయకలహములు ఈవిధముగ జరుపవలయు నని వాత్స్యాయనులవారు కామసూత్రములలో తెలిపిరి.

బాభ్రవ్యునిచే తెలుపబడిన యీపాంచాలీచతుష్షష్టిని యువకుడు కోమలాంగులయందు ప్రయోగించి తన అభీష్టమును పొందగలుగుచున్నాడు. ఈచతుష్షష్టివిధానమును గ్రహించక, ఇతరశాస్త్రములు ఎన్నిచదివినను పురుషుడు వివేకముగ ప్రవర్తించలేడు. ఇతరశాస్త్రములను చదువకపోయినను ఈ శాస్త్రమును బాగుగ చదివి విషయములను గ్రహించినయెడల స్త్రీలచే ప్రేమింపబడి యిహలోకసౌఖ్యమును పొందగలుగు చున్నాడు. ఈచతుష్షష్టివిద్యను 'నందిని' యనికూడ పిలుచు చుందురు.

శాస్త్రవేత్తలచేతను, సమస్తజనులచేతను వేశ్యకాంతల చేతను గౌరవింపబడుచున్న ఈచతుష్షష్టిని గ్రహించినవాడు వివేకముగ ప్రవర్తించగలుగును. ఈనందినీవిద్య సుభగ, సిద్ధి, సుభగంకరణి, నారీప్రియ యని వివిధనామములతో ప్రాచీనార్యులచేత కామశాస్త్రగ్రంథములలో వ్రాయబడినది. ఈచతుష్షష్టిని అభ్యసించినపురుషుడు సమస్తస్త్రీజనముచే గౌరవింపబడి వారి ఆదరాభిమానములను, ప్రేమను సులభముగ పొంద గలుగును.

---

# సంభోగము అవసరమా!

కామము అనగా మన్మథోద్దీపనము. స్త్రీమీద పురుషునకును, పురుషునిమీద స్త్రీకిని గల సహజప్రేమయే కామము అట్టి కామస్వరూపమే 'మైథున' మనబడును.

"ఆహార సధర్మణోహి కామః":—అని వాత్స్యాయనులవారి కామసూత్రములలో చెప్పబడియున్నది. అనగా శరీర పోషణకు ఆహారము ఎంతముఖ్యమో, మైథునముకూడ అంత ముఖ్యమైనది యని వాత్స్యాయనులవారు తెలిపియున్నారు. ఆహారనిద్రామైథునములు సర్వప్రాణికోటికిని స్వాభావికములైనవి. అనగా శరీరము ఎంతకాలము ఆహారమును తీసుకొనునో అంత కాలము మైథునమునుకూడ కోరుచుండును. అందువలన ప్రాణికోటికి మైథునక్రియ ముఖ్యావసరమైనదిగనే కనబడుచున్నది. ఎవడు రేతస్సును విడుచుచున్నాడో వాడు శరీరదారుఢ్యమును పొందగలుగునని ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడియున్నది.

"శరీరేజాయతే నిత్యం దేహిన స్సురత స్పృహా":— అని శాస్త్రములో చెప్పబడియున్నది. అనగా దేహధారులకు నిత్యము సురతవాంఛ కలుగుచునేయుండు నని భావము. అందువలననే కామమును మనపూర్వులు పురుషార్థములలో చేర్చిరి. అనగా కామసౌఖ్యమును పురుషుడు తప్పక పొందవలయు నని

వారి నిర్ణయము. అందువలన కామము ఫలభాగమగు పురుషార్థమని చెప్పినను యొప్పే యగునుకాని తప్పు కాదు.

శరీరధారులకు పంచకర్మేంద్రియము లనబడు వాక్కు, హస్తము, పాదము, గుదము, రహస్యాంగము అను వానితో కర్మలను నిర్వర్తించుట ధర్మము. వాక్కు అనగా మాట్లాడుట. హస్తముతో దైవవ్రతములు చేయుట, పుచ్చుకొనుట యనునవి ఆచరింపవలయును. పాదములతో నడచుట యనుకర్మను చేయవలయును. గుదముతో మలమును విడువవలయును. మర్మాంగముతో సంభోగకృత్యములు సలుపవలయును.

వాగ్భటాచార్యుడు తన 'అష్టాంగహృదయ' మను సూత్రములలో "స్త్రీసంభోగమువలన జ్ఞాపకశక్తి, బుద్ధిబలము, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి యగుననియు, తన్మూలమున శరీరబలమును, తేజస్సును లభించుననియు తెలిపియుండెను. భావప్రకాశకారుడుకూడ స్త్రీసంభోగమువలన ఆయుర్వృద్ధి యగుననియు, ముసలితనము త్వరగ రాదనియు, బుద్ధి వికసించుననియు విశదీకరించియుండెను.

సంభోగమును మానుటవలన శరీరములో మేహము సంభవించును. 'అవ్యవాయా న్మేహమేధోవృద్ధిః శిథిలతాతనోః' అని శాస్త్రమునందు చెప్పబడియున్నది. అనగా సంభోగమును వదలుటవలన బుద్ధి వికసించదు, సరికదా! అవయవములు క్రమముగ బలహీనములగును. మరియు ప్రపంచము అవిచ్ఛిన్నముగ

సాగుటకు సంతతి ముఖ్యముకదా? అట్టి సంతతికి కామమేకదా ప్రధానము. అందుచే కామమును వదలిన ఈజగత్తే లేదు. అందువలననే మనపూర్వులు కామమును పురుషార్థములలో నొకటిగ చేర్చిరి.

కాని బ్రహ్మచర్యము మంచి దని మనశాస్త్రములలో చెప్పబడియున్నది. బ్రహ్మచర్యమువలన వీర్యరక్షణము కలుగును. దానివలన ఆయువు వృద్ధిపొందును. కాని బ్రహ్మచర్యము అనగా సంపర్కమును పూర్తిగ వదల మని కాదు.

నైష్ఠికబ్రహ్మచర్యము అందరికిని సాధ్యమైనది కాదు. ఇనుపకచ్చడములు గట్టుకొనిన మునిపుంగవులే స్త్రీలను గాంచి తమనిష్ఠలను పరిత్యజించినటుల పురాణములలో చెప్పబడియుండ లేదా? నైష్ఠికబ్రహ్మచర్యము అసాధ్యము. అట్టిది అనేకజన్మలలో అనుసరించిన సత్ప్రవర్తనునుబట్టి కోటికి ఒకనికి లభించును. అందులకు విపరీతమైనశరీరావస్థ పడవలయును.

సాధారణపరిస్థితులలో సంభోగమును ఆపివేయుట వలన అనేకవిధములుగ ఆరోగ్యము చెడిపోవునని విద్యావంతుల అభిప్రాయము. సంభోగమును వదలుటవలన తత్సంబంధమగుఆలోచన మనస్సులో ఎల్లప్పుడును వేధించుచునే యుండును. సంభోగముకంటె మానసికవిచారమే నాశనకారి. మానసికవిచారమువలన ఎంతటి బలశాలియైనను కొలదికాలముననే చిక్కి శల్యమగును. సంభోగ నిరోధమువలన క్రమముగ నపుంసకత్వముగూడ సంభవించును.

సంభోగమును చాలకాలము మానుటవలన కొందరికి మతి చెడును. ఇదియే మదపిచ్చి యనబడును. సంభోగములేనిచో సంతోషము ఉండదు; దానివలన కోపము వృద్ధియగును. శరీరావయవములు క్రమముగ పటుత్వము తప్పును. సంభోగము చాలకాలము మానినయెడల సంభోగశక్తికూడ క్రమముగ నశించును. మనస్సున నిరుత్సాహము ప్రారంభమై, అనేకరోగములకు దారితీయును. ఇంద్రియనష్టము మొదలగువ్యాధు లేర్పడును. సంభోగమే వదలిన ప్రపంచవిషయములయందే రుచి నశించును.

వీర్యమును స్తంభింపజేయుటవలన నీరై పడిపోవుననియు, మూత్రనాళములు వికసింపవనియు, వరిబీజము, తలనొప్పి, రొమ్ము నొప్పి మొదలగువ్యాధులు సంభవించుననియు, మూత్రము జారీగా పడదనియు వైద్యశాస్త్రములలో చెప్పబడియున్నది. మరియు శుక్రము నాపుటచేయుటవలన వృషణములలో శూలయు, మూత్రము బంధింపబడుటయు మొదలగురోగములు కూడ సంభవించును. మలము, మూత్రము, శుక్రము మొదలగు శరీరవేగములు పదమూడు కలవనియు, వానిని ఆపుచేయుట తగదనియు మహర్షులు వ్రాసియున్నారు.

అపానవాయువు, మూత్రము, మలము, తుమ్ము, దాహము, ఆకలి, నిద్ర, దగ్గు, శ్వాస, ఆవులింతలు, కన్నీరు, డోకు, శుక్రము-ఈపదమూటిని ఆపుచేయుటవలన శరీరారోగ్యము నశించునని గ్రంథాంతరములలో చెప్పబడియున్నది.

అట్లని మైథునవిషయములో అమితముగసంచరింపరాదు. అత్యంతరతిమూలముననే విచిత్రవీర్యుడు రోగముచే బాధ పడెనని పురాణములు చెప్పుచున్నవి. అత్యంతరతిమూలముననే అగ్నివర్ణుడు క్షయవ్యాధిపాలయ్యెను. అతిసంభోగమువలన శూల, దగ్గు, ఉష్ణము, ఒగర్పు, పాండురోగము, బలహీనము మొదలగునవి సంభవించును. సంభోగమును మానుట ఎంతటి అనారోగ్యమో, అతిజారత్వముకూడ అంతటి అనారోగ్య దాయకమనియే గ్రహించవలయును. సంభోగమును మాని వేయుటగాని, అతిగ ఆదరించుటగాని కూడదు. మితముగ నుండవలయును.



# వరణవిధానము

పురుషుడు చతుష్షష్టికళలను అభ్యసించి నిపుణుడై, విశేషలోకజ్ఞానమును కలిగియున్నను సంప్రయోగము అనునది లేనియెడల వానిలోకజ్ఞానము నిష్ప్రయోజనమగును. అందు వలన సంప్రయోగము పొందుటకు మార్గములను అన్వేషింప వలయును. ఇదియే 'ఆవాప' మనబడును. ఇట్టి ఆవాపమునందు కన్య ప్రధానపాత్రధారురాలు. అందువలన ఆకన్య ఎట్టిలక్షణ ములు కలిగియుండవలయునో గ్రహించవలయును. కన్య స్వజాతికి చెందినదై యుండవలయును. త్రికరణశుద్ధిగ ఎవ్వరిని ప్రేమించనిదిగ నుండి, శాస్త్రయుక్తముగ వివాహము చేసుకొన బడినదై యుండవలయును. అట్టికన్యను వివాహముచేసుకొనుట వలన ధర్మమును పాటించినట్లగును. తన్మూలమున సత్సంతానము లభించును. మరియు ధర్మముతో కూడుకొనినకామమును పొందవచ్చును. వంశాభివృద్ధి కలుగును. ఆవిధముగ నిహపర లోకములలో సౌఖ్యమును పొందవచ్చును.

అందువలన కన్య ఉత్తమవంశసంజాతయై యుండవలయు నని పెద్దలు నిర్ణయించిరి. మాతాపిత లిరువురు సజీవులై యున్న కన్యను వివాహముచేసుకొనుట మంచిది. కన్య తనకంటెను అధమము మూడుసంవత్సరములైనను చిన్నదిగ నుండవలయు నని శాస్త్రములలో చెప్పబడియున్నది. ఈవిషయమును ప్రపం చమునందలి అన్నిజాతులవారును అంగీకరించిరి. వైద్యశాస్త్ర వేత్తలుకూడ కన్య వరునికంటె చిన్నదిగ నుండవలయుననియు,

ఆవిధముగ నుండుట ఆరోగ్యదాయకమనియు చెప్పుచున్నారు. కన్య చక్కనిరూపసంపదయు, సదసద్వివేకసంపన్నతయునుకలదియై యుండవలయును. మరియు ఆకర్ణాంతంబులగు నేత్రములును విశాలఫాలభాగమును, తగినకర్ణద్వయంబును, చెండులవలెనుండు చన్నులును, తళతళలాడు పలువరుసయు, తుమ్మెదలబోలు నెరి కురులును, తగినపాదవృను, పాదవృనకు తగినశరీరసౌష్ఠవమును, అరటిస్తంబములబోలు తొడలును, సన్నని నడుమును కలిగి యుండవలయును. మంచిశరీరారోగ్యము కలదై యుండవల యును. ఇట్టిలక్షణములను గలకన్యనుమాత్రమే వివాహము చేసికొనవలయునని శాస్త్రకారులు తెలుపుచున్నారు.

ఎట్టిస్త్రీని వివాహము చేసికొనుటవలన తనజీవితము ధన్యత చెందు నని తోచునో, ఎట్టిస్త్రీని పరిణయమాడుటవలన యశస్సు లభించి ఇహపరలోకసౌఖ్యములకు సాధనభూతమగునో అట్టిస్త్రీనిమాత్రమే వివాహము చేసికొనవలయునని ఘోటక ముఖుడు తెలిపియుండెను.

కన్యను సంపాదించుటలో రెండువిధానములు కలవనిచెప్ప బడుచున్నది. అందు మొదటిది పౌరుషయుక్తముగ సంపాదించు టయు, రెండవది దైవవిధానముగను నున్నవి. పైన తెలుపబడిన రూపలక్షణాదిగుణములుగలకన్యను యోచించి యువతీయువకుల బంధుమిత్రాదులు ప్రయత్నించి వివాహముచేయుట 'పౌరుష విధాన' మనబడును. అట్టికన్యకొరకు బంధుమిత్రాదులు ప్రయ త్నము సలుపుచున్నప్పుడు, ఆకన్యకొరకు ఇతరులు ప్రయత్నము చేయుచున్నయెడల ఆవరునియందు గలదోషముల నన్నిటిని ఆకన్యయొక్క తల్లిదండ్రులకు నితరులవలన తెలియజేయవల

యును. అంతియేగాక తనయందు గల మంచిలక్షణములు, విద్య, వంశము, ధనము మొదలగువానిని ఆకన్యతల్లిదండ్రులకు ఎరుకపరుపవలయును. ఈవిధముగ కన్యను సంపాదించుట 'పౌరుషమార్గ' మనబడును.

శకునములు, శుభసూచనలు, గ్రహబలము, లగ్నబలము, అదృష్టము మొదలగునవి యువకునకు, యువకుని మిత్రులు గ్రహించి ఎప్పటికప్పుడు తెలుపుచుండవలయును. మరియు ముందు కలుగబోవు ధనలాభమును గురించియు, వైవాహిక శుభసూచనలను గురించియు నాయకునకు తెలుపుచుండవలయును.

అదేవిధముగ కొందరు పెద్దమనుష్యులుగాని, జ్యోతిష్కులుగాని కన్యయొక్క తల్లిదండ్రులయొద్దకు పోయి వారితో వరుని చాకచక్యమును గురించియు, ఐశ్వర్యమును గురించియు నచ్చచెప్పవలయును. శకునములు, శుభసూచకములను తెలుపుచుండవలయును. ఇట్టి శుభశకునములు కలుగుచుండుటవలన ఆవరునకు కన్య నిచ్చి వివాహముచేయుట శుభకర మని వారికి బోధించుచుండవలయును.

కన్యను వరించుటలో కేవలము సామాన్యమగు అభిప్రాయముతో మాత్రమే వరించవలయును గాని యితర అభిప్రాయములతో వరించరాదనియు, కన్య నిచ్చుటలోకూడ తల్లితండ్రులును ఇట్టి అభిప్రాయముతో మాత్రమే యియ్యవలయు ననియు ఘోటకముఖుడు చెప్పియుండెను.

కన్యను చూచి వరించునప్పుడు శకునములను చూచుట మంచిది. అందుచే అట్టి శకునవిధానమును తెలుపుచున్నాను. కన్యను చూచుటకు వెళ్లుసమయమున ఆకన్యక నిద్రపోవుచున్నను, ఏడ్చుచున్నను, ఇంటిలోనుండి బయటకు పోవుచున్నను శుభకరము కాదు. అట్టికన్యను వివాహముచేసికొనుట వలన కష్టములు సంభవించును. మరియు అప్రశస్తమైనపేరు గలకన్యనుకూడ వరించరాదనియే శాస్త్రమునందు చెప్పబడియున్నది. రహస్యముగ దాచబడినను, అంతకుపూర్వమే యితరులకు వివాహము చేయుటకై వాగ్దానముచేయబడినను, చెడు లక్షణములు కలిగియున్నను కపిలవర్ణము గలకన్యను వివాహము చేసికొనరాదని శాస్త్రములయందు చెప్పబడియున్నది. మరియు శరీరముమీద బొల్లి యున్నను, యువకులతో కలసి తిరుగుచున్నను, నడుము వంగియున్నను, కాళ్లుగాని పాదములుగాని వంకరగ నున్నను, వికృతమైనముఖము కలిగియున్నను, అంతకుపూర్వమే యితరపురుషులతో సంబంధము కలిగియున్నను, రజస్వలయైయున్నను, మూగ కలిగియున్నను, బాల్యము నుండియు పరిచయముగ నున్నను, తనకు సమానమగువయస్సు గలదైయున్నను, కాళ్లను పాదములను ఎల్లప్పుడును చెమట పట్టుచున్నను, అట్టికన్యను వివాహము చేసికొనరాదని పెద్దల యొక్క అభిప్రాయము. కనుక పైన చెప్పబడినలక్షణముల నన్నిటిని బాగుగ పరిశీలించి వివాహము చేసికొనవలయును. తొందరపడినచో కష్టములే సంభవించును గాని సౌఖ్యదాయకముగ నుండదు.

మరియు నక్షత్రముల పేర్లు గలవారిని, నదుల పేర్లు గల వారిని, వృక్షముల పేర్లుగలవారిని 'ల' అను అక్షరము 'ర' అను అక్షరము పేరుయొక్క చివరి అక్షరమునకు ముందున్న పేర్లు గలవారిని వరించరాదని శాస్త్రముయొక్క అభిప్రాయము.

ఏకన్య చూచుసరికి నేత్రానందకరముగనుండి మనస్సునకు ఉల్లాసమును కలిగించునో అట్టికన్యనుమాత్రమే వివాహము చేసికొనవలయును. అందుకు వ్యతిరేకముగ నుండుయువతులను పరిణయమాడరాదని శాస్త్రకారులు వ్రాసిరి. అందుకు విరుద్ధముగ ప్రవర్తించినయెడల కష్టములే సంభవించునుగాని సుఖము కలుగదు. కనుక కన్యను వివాహము చేసికొనుటకై చూచుటకు వచ్చినసమయములో కన్యను సర్వాలంకారభూషితు రాలిగ నొనర్చి చూపించుట శుభకరము.

కన్య ఇతరులకు వివాహమగుచున్న సమయములలో, తానును పెండ్లికూతురువలె అలంకరించుకొని చెలులతోపాటు ఆటలాడుకొనుచు తిరుగుచుండవలయును. యజ్ఞయాగాదుల యందును, వివాహాదిమహోత్సవములు జరుగుచున్న తావు లందును, సభలయందును కన్య బాగుగ అలంకరించుకొని తిరుగుచుండవలయును. ఇట్టిది ధర్మయుక్తమేకాని వేరుకాదని పెద్దలయొక్క యభిప్రాయము. కన్యను చూచుటకు వచ్చిన పెద్దలను వరుని బంధుమిత్రాదిజనమును మంగళకరమగు ద్రవ్యములతోను, తూర్యనినాదములతోను ఎదురువెళ్లి ఆహ్వా నించి తీసికొనివచ్చి ఉచితాసనములపై కూర్చుండబెట్టి ఆనంద ముట్టిపడుచున్నట్లుగ పలుకరించి సత్కరించవలయును. తరువాత

కన్యను చీనిచీనాంబరములతోను, వివిధాభరణములతోను అలంకరించి, ఏదోవంకతో వారియెదుట ఒకక్షణకాలము నడ మాడునట్లు చేయవలయును. వివాహము స్థిరమగువరకు వరుని పక్షమున అరుదెంచినపెద్దలకు స్థిరముగ వాగ్దానము చేయక 'అంతయు దైవాధీన'మని పలుకుచుండవలయును. లేదా మా పెద్దలతో ఆలోచించి చెప్పుతా నని చెప్పుచు వాగ్దానము చేయక తప్పించుకొనుచుండవలయును. మంగళస్నానసమయములో వరుని పెద్దలు తొందరపడి సిద్ధము చేయకూడదు. నెమ్మదిగ ప్రతి విషయము జరుగునని కాలయాపన చేయుచుండవలయును.

బ్రహ్మ, ప్రజాపత్య, ఆర్ష, దైవతము లనబడు శాస్త్రోక్త మగువివాహవిధానములలో దేనినైన నొకదాని నవలంబించి శాస్త్రమునందు చెప్పబడినవిధముగ యథావిధి నతిక్రమించక వివాహము చేసికొనవలయును. వివాహమును చేసికొనుటలో దేశాచారమును పాటించవలయు నని పెద్దలయొక్క అభి ప్రాయము.

కలహము, క్రీడ, వివాహము, స్నేహము మొదలగునవి తమతో సమానమైనవారితోమాత్రమే చేయవలయునేగాని తక్కినవారితో చేయరాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. కన్య వద్ద నిలువబడినప్పుడు వరుడు సేవకునివలె కనిపించినయెడల అట్టి కన్యను వివాహము చేసుకొనరాదు. అట్టిసంబంధము ఇతర కారణములచే గొప్పదైనను విడువవలయునని పెద్దలు చెప్పు చున్నారు. ఆవిధముగనే కన్యను వివాహము చేసికొనినపిమ్మట తనబంధువులును, తానును కన్యయొక్క బంధుమిత్రాదులతోను

కన్యతోను ప్రగల్భములుగ మాటలాడుచు వారిపై తనకు ఏదో అధికార మున్నట్లు నటించును. అట్టిసంబంధముకూడ మంచిదికాదనియు, ఈసంబంధము పూర్వము చెప్పబడిన సంబంధముకంటెను నీచమైన దనియు భావింపవలయును. ఏసంబంధము వలన వధూవరులకును, వధూవరుల బంధుమిత్రాదులకును సౌఖ్యమును, సంతోషమును కలిగి గౌరవములు జరుగునో ఆసంబంధము ఉత్తమ మైనదని పెద్దలయొక్క అభిప్రాయము.

మంచిసంబంధమును చేసికొనినపిమ్మట, ధనహీనుడై జ్ఞాతులకు లొంగినను లొంగవచ్చునుగాని, బుద్ధిమంతుల నిందలకు పాత్రమైన హీనసంబంధమునకు అంగీకరింపక రా దని వాత్స్యాయనుని సూత్రములలో చెప్పబడియున్నది.

---

# స్త్రీలను వశీకరణ చేసుకొనువిధానము

ఇదివరలో తెలుపబడినవిధముగ యువతిని సంపాదించిన పిదప అనగా శాస్త్రోక్తముగ వివాహముచేసికొనిన పిదప యువకుడు ఆయువతికి తనయందు విశేషనమ్మకమును, అభిమానమును, ప్రేమయు, అనురాగమును కలుగునట్లు చేయవలయును. లేనిచో సంభోగము విశేష సంతోషదాయకముగ నుండదు. అందుచే అట్టివిధానములను మనము తెలుసుకొనవలయును. ఇట్టివిధానమును వాత్స్యాయనుడు విస్రంభణాధ్యాయములో వివరముగ తెలిపియుండెను.

వివాహసమయములో ప్రథమపరిచయభాగ్యమును పొందినదంపతులు వివాహానంతరము మూడురాత్రులు నేల మీద పరుండవలయును. చాతుర్థికహోమము పూర్తియగువరకు బ్రహ్మచర్యమును పాటించవలయును. ఉప్పును, కారమును లేని ఆహారమును తీసికొనవలయును. ఆరీతిగ ఏడుదినములు మంగళకరమైన మేళతాళములతోను, నృత్యగీతాదులతోను గడిపి, ఏడవదినమున మంగళస్నానములు చేయవలయును. ఈ ఏడుదినములును నూతనదంపతులు ఒకేపాత్రయందు భుజించవలయును. అనంతరమున వివాహమహోత్సవమునకు వచ్చినవారిని ఉచితరీతిని సత్కరించి పంపివేయవలయును.

తరువాత వివాహముచేసికొనినస్త్రీని విస్రంభణము చేసుకొనవలయును. విస్రంభణము అనగా విశేషచనువు చేసుకొని,

తనయందు అనురాగమును కలిగియుండునటులు చేయుట యని భావము.

స్త్రీలలో సాధారణముగ రెండురకములవా రున్నట్లు కనబడుచున్నవి. పురుషుడు కోరినవెంటనే సంభోగమునకు అంగీకరించువారు ఒకరకముగను, అడిగినవెంటనే అంగీకరించక కొంచెము బిగిసరి, బెట్టుసరిచూపి తక్కులాడుచు తరువాత అంగీకరించువారు మరొకరకముగను నున్నారు.

ఈ రెండురకములైన స్త్రీలయందును విస్రంభణవిధానమును అవలంబింపవలసిన అవసరము ముఖ్య మనియే వాత్స్యాయనులవారు తెలిపిరి. అడిగినవెంటనే సంభోగమునకు అంగీకరించినయువతిని రతికొరకు విస్రంభింపజేయవలసిన అవసరము లేదు. రెండవరకమునకు చెందినయువతులకు అనుమానమును, సిగ్గును పోగొట్టుటకు విస్రంభణవిధానమును అవలంబించవలయును. కనుక యువకులెల్లరును విస్రంభణవిధానరహస్యములను ముఖ్యముగ తెలిసికొనవలసిన అవసరము కలదు.

పైన చెప్పబడిన పదిదినములలోను రాత్రిసమయములలో యువతి శయనమందిరములో ఒంటరిగా నున్నప్పుడు యువకుడు నారీరత్నముదగ్గరకు మెల్లగచేరి యుక్తాయుక్తముగను, మృదుమధురముగను సంభాషణ ప్రారంభింపవలయును. తరువాత ఇంకను దగ్గరగ చేరి చేతితో వీపుమీదను, శిరస్సుమీదను తడుముచుండవలయును.

ముందుగ ఇట్టివిస్రంభణవిధానములను అవలంబించి సుందరికి తనపై అనురాగమును కలిగించుటకు ప్రయత్నము చేయునియెడల యువతి 'ఉత్తను పట్టి మోటుమనిషివలె

సున్నా'డనియు, అట్టి అవివేకితో తనకు సంపర్కము కలిగినది గదా యనియు విచారించుటకు మొదలుపెట్టును. చివరకు ప్రాణము విసిగి పురుషుని పరాభవించుటకు మొదలుపెట్టును. తనపురుషుడు నపుంసకుడేమో యని ఆలోచించును. కనుక స్త్రీలకు ఉల్లాసము కలిగించుటకు విస్రంభణవిధానమును అవలంబించుట ముఖ్యావసరమని బాభ్రవీయులు చెప్పిరి. రతికి ఉపక్రమించుసమయములో యువకుడు ఎట్టికృత్యమునైనను యువతికి ఇష్టములేనిదే బలాత్కరించి చేయరాదని కామకళోపాధ్యాయుల పాఠము.

స్త్రీలు సహజముగ సుకుమారశరీరులు. పుష్పములవంటి వారు. వారిహృదయములు అంతకంటెను మృదుతరమైనవి. అందుచే మనము పుష్పములను ఎంత మృదువుగ వాడుకొందుమో స్త్రీలనుకూడ అదేవిధముగ వాడుకొనవలయునని భావము. వారిహృదయములు, భావములు అంతకంటెను మృదువైనవిగ నుండును. కనుక స్త్రీలతో ఏవిధముగ సంచరించవలయునో, వారి నేవిధముగ పరిచయము చేసికొనవలయునో యువకుడు తెలిసికొనవలయును. మొత్తముమీద స్త్రీలవిషయములో మిక్కిలి మృదువుగ ప్రవర్తించినయెడల వారు సులభముగ వశ్యులగుదురు. ఎట్టి అవసరసమయములయందైనను బలవంతముచేయరాదు. బలాత్కారముగ ప్రయత్నించినయెడల సంయోగమునకు విముఖు లగుదురు. కన్యలవిషయములో ఇంకను జాగ్రత్తగ సంచరించవలయును.

అందువలననే అందుకు కావలసినయుపాయములను వాత్స్యాయనులవారు బోధించియుండిరి. మొదట ఏదో ఒక

నెపము పెట్టుకొని ప్రియురాలివద్దరకు చేరవలయును. ఏదో ఉపాయము నాలోచించి క్రమముగ మాటలసందర్భములోకి దింపవలయును. ఆవిధముగ సంభాషణలోకి దింపి ఆలస్యము చేయకుండ ఆమె అనుకూలముగ నున్నసమయమును గుర్తించి నెమ్మదిగ ఆలింగనము చేసుకొనవలయును. అట్టి ఆలింగనము గట్టిగా చేయరాదు. బొడ్డునకు పైభాగమునందే ఆలింగనము చేసుకొనవలయును. పూర్వము విశేషపరిచయము లేనిస్త్రీలను చీకటిలో ఆలింగనము చేసుకొనవలయును. పరిచయముగల స్త్రీలను దీపపువెలుతురులోకూడ కౌగలించుకొనవచ్చును.

అట్టి ఆలింగనమువలన ఆమెముఖమునందు చిఱునవ్వు ప్రారంభమగును. అదియే ఆమె అంగీకారమును తెలుపు సూచన. నాయకుడు అట్టిభావమును గుర్తించి తననోటియందలి తాంబూలమును ఆమెనోటికి అందీయవలయును. అందుకు ఆమె యిష్టపడనియెడల ప్రేమవాక్యములు పలుకుచు, బుజ్జగించుచు, ఆమెహృదయమునకు విశేషసంతోషము కలుగునట్లు మాట్లాడుచు, ఎట్టులో అంగీకరించునట్లు చేయవలయును. చివరకు పాదములమీద పడియైనను అంగీకరింపజేయవలయును. సహజముగ స్త్రీలు మెత్తనిస్వభావము కలవారు. ఇది వారి సహజలక్షణము. ప్రారంభములో ఎంతవిముఖముగ నున్నను, క్రమముగ చివరకు ప్రతిపనిని వారిచే అతి సులభముగ చేయింపవచ్చును. కాని అట్టిప్రయత్నములలో పురుషుడు చాల మృదువుగ ప్రవర్తించవలయును. ఆవిధముగ తాంబూలమును నోటికి అందించుసమయములో చప్పుడుచేయకస్పర్శసౌఖ్యమును పొందుటకుమాత్రము ముద్దుపెట్టుకొనవలయును. ఆవిధముగ

ముద్దుపెట్టుకొనునప్పుడు జవ్వనిఅంగీకారమును సూచించుచు, ముగ్ధత్వమును వహించియున్నయెడల పురుషుడు మెల్లగ ఆమెనుమాటలాడించుటకు ప్రయత్నము సలుపవలయును. ఆవిధముగ మాటలాడించునప్పుడు ఏదో ఒకరహస్యవిషయము తనకు పూర్వమే తెలిసియున్నటుల చెప్పుచు పలుకరించవలయును. ఆరీతిగ పలుకరించినప్పుడు అతనిమాటలకు బదులుచెప్పక యున్నయెడల, చాలనెమ్మదిగ మరల మాటలాడించుటకు ప్రయత్నము చేయవలయును. అప్పటికిని పలుకనిచో కొంచెము బలవంతము చేయవచ్చును.

యువతితో సంభాషణచేయునప్పుడు ఆమెకు అంతకుముందుగ పరిచితురాలైన యువతీయువకులయొక్క పూర్వజీవితములను తెలిసియున్న ఒకచెలికత్తెను, పురుషుడు ఏదైనను ఒకవిషయము చెప్పుటకు ప్రారంభించవలయును. అట్టివిషయము చెలికత్తెకు చెప్పుచున్నట్లుగ నటించుచు, ఒకకంటితో ప్రియురాలిని, ఒకకంటితో చెలికత్తెను చూచుచుండవలయును. ఆ విషయమును తలవంచుకొని వినుచు యువతి చిఱునవ్వు ముఖమున తాండవింపజేయును. చెలికత్తె చమత్కారముగ మధ్య మధ్య, ఆపురుషుడు చెప్పుచున్నవిషయమునుగురించి పరిహాసముగ మాటలాడుచుండవలయును. అవసరమైనచో చెలికత్తె పురుషునితో, నవ్వుచు కలహింపవలయును. అట్టిసమయములో చెలికత్తె యువకునితో, యువతి ఈవిధముగ పలికెను, ఆవిధముగ పలికెను అని అసత్యపువిషయములను పరిహాసమునకు కల్పించి చెప్పవలయును. తరువాత యువతి ఏరీతిగ సమాధానము చెప్పుటకు మొదలుపెట్టునో యని కొంచెముసేపు చూడ

వలయును. ఈరీతిగ నీవు చెప్పలేదా? అని చెలికత్తె మరల ప్రశ్నించినప్పుడు, నేను ఆవిధముగ అన లేదని వినబడీ వినబడ నట్లు అతిమెల్లగ యువతి చెప్పవలయును. ఆవిధముగ చెప్పుచు పురుషునిపై క్రీగంటిచూపులను విసరుచుండవలయును. ఇట్టి సంభాషణవలన యువతికి యువకునితో కొంతపరిచయము లభించు నని భావము. ఇట్టిసంభాషణావిధానమే 'ఆలాపన' యనబడును.

ఈరీతిగ ఆలింగనము, తాంబూలచర్వణము, చుంబనము ఆలింగనాదులవలన పురుషునిపరిచయమును పొందినయువతి, తన ప్రియుని రంజింపజేయుటకు తాంబూలమును, సుగంధ ద్రవ్యములను అతనికి అందీయవలయును. అట్టి పరిచయము వలన పూర్వముకంటె కొంచెము దగ్గరగ నిలువబడి యుండును. అట్టిసమయములో పురుషుడు యువతిని శయ్యపై కూర్చుండ నియోగించి, ఆమెకు స్పర్శసుఖమును కలుగజేయు టకు చనుమొనలను పిసుకుటకు ప్రారంభించవలయును. అందుకు ఆయువతీరత్నము సిగ్గువలనగాని, చక్కిలిగింతలవలనగాని, ఆటంకపరచుచున్నయెడల "నీవు నన్ను ఆలింగనము చేసికొనిన యెడల నిక నావిధముగ చేయను" అని పలుకుచు, ఆమెచే కౌగి లించుకొనబడవలయును. తరువాత తానును ఆమెను కౌగలించు కొని పిదప ఆమె కటిప్రదేశమును అనగా బొడ్డునకు క్రిందుగా నుండుప్రదేశమును, పిఱుదులను చేతితో బాగుగ స్పర్శ సుఖము కలుగునట్లు తడుమవలయును. ఆవిధముగ ఆమెకు క్రమముగ సిగ్గువదలునట్లు చేసి, తనతొడలపై కూర్చుండబెట్టు కొనవలయును. పిదప ఇంకను అధికముగ ప్రేరేపణచేయుచు

రతికి పురికొల్పవలయును. అందుల కామె అడ్డుపెట్టుచున్న, కొంచెము కోపము చెందినట్లుగ నటించుచు భయపెట్టుచుండ వలయును.

బాగుగ పరిచయముకలిగినపిమ్మటకూడ సంభోగము చేయుటకు యువతి యింకను అంగీకరింపనిచో యావతితో పరిహాసముగ "నావక్షస్థలముమీదను, ముఖముమీదను, నేనే దంతక్షతములను, నఖక్షతములను చేసుకొని, నీవు చేసితివని నీ చెలికత్తెతో చెప్పుదును చూడు" మని భయపెట్టుచు, మాటల సందర్భములో పెట్టి మచ్చికతో వశ్యురాలినిగ చేసుకొన వలయును.

ఇది మొదటిరాత్రి అవలంబింపవలసినవిధానము. తరువాత రెండవరాత్రియందును, మూడవరాత్రియందును ఇంకను బాగుగ చనువుచేసుకొని శరీరమునంతయు తడుముచు, ఆలింగనము, చుంబనము, నఖక్షతము, దంతక్షతము, చేయుచున్నయెడల యువతి ఆనందపరవశురాలై, కామోద్రేకమును జెంది, తనంత తానే రతిక్రియలు సలుపమని ప్రేరేపణచేయుటకు మొదలు పెట్టును.

నాయికను వశ్యురాలిని చేసుకొనునప్పుడు పురుషుడు హస్తయోజనవిధానమునుకూడ అవలంబింపవలయును. హస్తయోజనము చేయువిధానమును తెలుపుచున్నాను. ఇదివరలో చెప్పబడినవిధముగ ముందుగ నడుమునకు పైభాగములో నుండుశరీరమును స్పర్శసౌఖ్యము కలుగునట్లుగ పిసుకుచు, కుచములను రెండుచేతులతోను అదిమిపట్టి మర్దించుచు, మెల్ల మెల్లగ చేతిని తొడలమీదకు పోనిచ్చుచు తొడలను ఆర

చేతితో రాయుచుండవలయును. పిదప ఊరుమూలలలోకూడ సంవాహనము చేయుచు అందు చుంబనము, నఖక్షతములను చేయుటకు ప్రయత్నించవలయును. అందుకు ఆమె అంగీకరించనిచో "ఇంకను సిగ్గు ఎందులకు" అనుచు ఆమెసిగ్గును మాటలచే బోగొట్టుచు, చేతినిమాత్రము అక్కడే యుంచి యింకను పూర్వముకంటెను గట్టిగ నొక్కిపట్టుచు, చేతిని మదనమందిరము పైకి బోనిచ్చి హాయిగ స్పర్శసౌఖ్యము కలుగునట్లు తడుముచు చీరముడిని విడదీసి, చీరను ఒక ప్రక్కకుతొలగించి, ఏవోమాటల నోడవలోపెట్టి తొడలమూలలో పిసుకుచు, గట్టిగ నొక్కిపట్టుచుండవలయును. కాని తొందరపడి రతిక్రియకు మొదలు పెట్టరాదు. ఆమూడురాత్రులయందును వ్రతభంగము చేయరాదు గనుక, ఏదో వట్టిచేష్టలతోమాత్రమే కాలమును గడుపవలయును. చాతుర్థికహోమము ముగిసినపిమ్మట రతిక్రియలలో కూడ ఆమెను ఆనందపరవశురాలినిగ చేయవచ్చును. కాని మొదటి మూడురాత్రులయందును, వ్రతభంగమునుమాత్రము చేయరాదు. వ్రతదీక్షలో యున్నప్పుడు తన ప్రేమాతిశయములను, కోరికలను, తనఅభిప్రాయములను ఆమెకు తెలియజేయవచ్చును. ఆమెకు గలసందేహములను పోగొట్టవచ్చును. ఈవిధముగ తనకు లభించుయువతిని చెదరగొట్టక, తాను తత్తరపడక బిత్తరి చిత్తమునకు ఉల్లాసముకలుగునట్లు సంచరించుచు నెమ్మదిగ సంభోగమునకుకూడ అంగీకరించునట్లు చేసికొనవలయును.

అనగా స్త్రీలకు మొదట బాగుగ నమ్మకమును కలిగించి ఓర్పులో స్వాధీనము చేసికొనవలయును. ఆవిధముగ చేయుట వలన ఆమెకు ఆపురుషునియందు స్థిరమైన ప్రేమాతిశయములు

కలుగును. ఆమెను నమ్మించువిధానములో విశేషఅనుకూలతగ ప్రవర్తించుచు, తనసహజగాంభీర్యమును వదలరాదు. విశేష మెత్తననముగ నున్నయెడల, స్త్రీలు పురుషులను చులకనభావముతో చూతురు. అట్లని విశేషప్రతికూలభావముతో మెలగుచున్న, అట్టిపురుషునియందు విరక్తిభావమును పొందుదురు. కనుక విశేషచనువును కలుగజేయక, ప్రతికూలముగను నుండక మధ్యరకముగ నున్నయెడల స్త్రీని సులభముగ అనుకూలురాలినిగ చేసికొనవచ్చును.

ఈపైన చెప్పబడిన విస్రంభణవిధానము, స్త్రీలకు అనురాగమును వృద్ధిచేయుటకు ఉపయోగపడుచున్నది. అనగా పైన చెప్పబడినవిధానములన్నియు అనురాగమును వృద్ధిపరచుటకుమాత్రమే ఉపయోగపడుచున్నవి. కనుక ఈవిస్రంభణావిధానములను స్త్రీలయందు ప్రయోగించినయెడల స్త్రీలచే ప్రేమింపబడువాడును, గౌరవింపబడువాడును, పూజింపబడువాడును అగును. పూర్తిగ అక్షతయోనులగు (సంభోగ మెరుగని) కన్యలు గర్భాదానపుగదిలో బిడియముచే సంభోగాదికార్యకలాపములకు అంగీకరింపక పేచీపెట్టుట చూచుచున్నాము. కనుక పురుషుడు తత్తరపాటు నొందక, స్త్రీలు చంచలహృదయులని గ్రహించి, వారిమనోవికారములను గ్రహించి సమయము గుర్తించి స్వాధీనపరచుకొనవలయునేగాని, విసిగి వేసారి ఊరకపోనీయరాదు. ఒకవేళ ఉపేక్షచేసినయెడల తనహృదయమును గ్రహించలేని అవివేకునిగ భావించి, పురుషుని విరక్తిభావముతో చూచుటకు మొదలుపెట్టును. స్త్రీలతో మోటుతనముగ రతిక్రియలు జరుపుటకు ప్రయత్నింపరాదు. అవిధముగ చేయుట

వలన కన్య కంగారుపడి, అసలు అట్టికార్యమునకే తావీయదు. పైగా అతనియందు ద్వేషభావమును పొందును. అట్టి ద్వేష భావము దినక్రమమున అభివృద్ధియై పరపురుషసంగమాభిలాషకు కూడ దారితీయును. కనుక పురుషులు స్త్రీలను స్వాధీనముచేసు కొనుటలో విశేషఓర్పును, కార్యదీక్షను చూపవలయును.

ఈశాస్త్రమును బాగుగ చదివినపురుషుడు కామప్రపంచ ములో నేవిధముగ సంచరించవలయునో గ్రహించి, ఎట్టి స్త్రీనైనను కామకళారంగములో ఆనందడోలికల నూగించి, లాలించి, తేలించగలుగును.

వాత్స్యాయనులవారు లోకోపకారార్థము చిరస్థాయిగ రచియించిన ఈశాస్త్రనిధిని మనము పిత్రార్జితముగ అనుభవించు చున్నాము. ఈశాస్త్రనిధివలన వారు మనకెల్లరకును స్మరణీ యులుగనే యున్నారు. వారికీర్తి ఈశాస్త్రరచనవలన చిర స్థాయిగ నున్నది.

నూతన దంపతులెల్లరును ఈగ్రంథమును చదివి సుఖ మును పొందుదురుగాక యని కోరుచున్నాను.

వాత్స్యాయన కామసూత్రములు

సమాప్తము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.— 1995

సకలశుభఫల

# అదృష్టదీపిక

రచయిత: దామరాజు శివరామయ్య

ప్రతివారికి బోధపడునట్లు వ్రాయబడినది

శరీరధారులకు కష్టములు కల్గును. అట్టి కష్టములు బాధించినప్పుడు తమ భవిష్యత్తు ఎట్లున్నదో తెలుసుకొనుటకు యీ గ్రంథము మిక్కిలి ఉపయోగమైనది. ఇందు సుమారు 200 విషయములవరకు వ్రాయబడినవి. ఇందలి విషయములు అనేక శాస్త్రగ్రంథములనుండి వ్రాయబడినవి. గోచారఫలితములు తెలిసికొనువిధానము, గృహవాస్తు, ప్రశ్నఫలములు చెప్పుట, తారాబలచంద్రబల వివరము, గ్రహశాంతులు సమస్త శాంతి విధానములు, ప్రయాణమునకు ఉపయుక్త తిథి, వార, నక్షత్రాదులు తెలిసికొనుట, శకునఫలములు, స్వప్నఫలములు, పంచపక్షిప్రశ్న, శ్రీరామ ప్రశ్న, కోర్టు వ్యవహారములు, ఆరోగ్యము, వివాహము, ఉద్యోగము, ఆయుర్దాయము, మొదలగు సమస్తవిషయములు తెలిసికొనుద్దేశముతో ప్రతివారికి సులభముగ బోధపడునట్లు వ్రాయబడియున్నది.

ఈ గ్రంథము ప్రతి గృహమునందును యుండుటవలన ఎంతో ఉపయోగముకలదు. తప్పక చదువవలసిన గ్రంథము.

వలయువారు:—

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

# మెస్మరిజం

అను

## (అదృష్టరాజము)

### సమ్మోహనవిద్య - ఆత్మశక్తిప్రభావము

### మెస్మరిజం - హిప్నాటిజం - స్పిరిట్యువలిజం

ఇతరుల మనస్సునందున్న విషయములను వారినడుగకనే తెలుసుకొని చెప్పుట **(THOUGHT - READING.)**

ఇంద్రజాల, మహేంద్రజాలాది విద్యలు - వశీకరణయోగములు - భూతభవిష్యద్వర్తమానములు తెలుసుకొనుట-దివ్యజ్ఞానము - ఆత్మశక్తి సంపాదించువిధానములు - యోగాభ్యాసము - మనపూర్వాచారములందలి మర్మములు మొదలగు అనేక విషయములు కలవు.

ఈ విద్య నభ్యసించిన వారికి అసాధ్యమైనదని ఏదియు నుండదు. మన మహర్షులందరు యీవిద్యను ముఖ్యముగ అవలంబించి దివ్యశక్తిసంపన్నులుగ నుండెడివారు.

పూర్వము భోజుడు మొదలగు మహారాజుల కాలములో యీవిద్య విశేషవ్యాప్తియం దుండెడిది.

అట్టి మహాపవిత్రమై, పరమరహస్యమగు యీవిద్యకు "మెస్మరిజం" అని ఇంగ్లీషు పేరు పొందుట వాడుకలోనున్నది. యీగ్రంథమున తెలుపబడెను.

అభ్యసనావిధానములు మిక్కిలి సులభము.

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

కలయువారు:—

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

జ్యోతిషవిశారద వద్దాది వీర్రాజు సిద్ధాంతిగారిచే
రచింపబడిన యితర జ్యోతిషగ్రంథములు:—

# 1. పంచపక్షి కేరళీ ప్రశ్నశాస్త్రము

ఇది పంచపక్షులచే చెప్పబడిన ప్రశ్నశాస్త్రము

ప్రశ్నశాస్త్రములలో యింతటి గ్రంథము వేరొకటి దొరకదు.

మొదట ప్రశ్న ఏమిటో తెలుసుకొనుటకును పిమ్మట ప్రశ్నఫలితములు తెలుపు విధానములు తెలుసుకొనుటకును మిక్కిలి సులభమార్గములు యిందు విపులముగ కలవు.

# 2. పుట్టుమచ్చలశాస్త్రము

ప్రతివారి శరీరముమీద ఎక్కడనైన నొకచోట పుట్టుమచ్చలుండి తీరును. భగవన్నిర్మితమగు యీ పుట్టుమచ్చలు నిరర్థకములు కావు.

మీ శరీరము మీద నుండు పుట్టుమచ్చల ఫలితములను తెలుసుకొన దలచితిరా! యీ పుస్తకమునే చదువుడు.

మీ జీవితములో ఏయే సంవత్సరములలో ఏయే ఫలితములు కలుగునో యీ శాస్త్రమునందు చెప్పబడియున్నది.

# 3. హస్తసాముద్రికము

రచయిత: పూర్వకవి "పండితారాధ్యశరభయ్య"

హస్తసాముద్రిక శాస్త్రమంతయు చక్కని పద్యములలో మిక్కిలి తేలికభాషలో వ్రాయబడినది.

ఈ పద్యములు చదువుటకు ఎంతో యింపుగ నుండుటయు సులభమైనదిగా నున్నది. చదివినపద్యమే మరల చదువవలయునని కోరిక కలుగుచుండును.

ఇట్టి పద్యగ్రంథములు చాల అరుదుగ నున్నవి.

తాటియాకుల గ్రంథమునుండి వ్రాయబడి అచ్చొత్తింపబడెను.

# సంఖ్యాశాస్త్రము

## (NUMEROLOGY IN TELUGU)

జ్యోతిష గ్రంథము

రచయిత: దామరాజు శివరామయ్య

ఇది ఒక అపూర్వ గ్రంథము. ఇట్టిది యిదివరలో తెలుగుభాషలో వెలువడి యుండలేదు. ఒకటి లగాయితు తొమ్మిదివరకుగల సంఖ్యలనుబట్టిమాత్రమే "భూతభవిష్యద్వర్తమానములను" సులభముగ తెలిసికొను పద్ధతులు యీపుస్తకములో వివరింపబడినవి.

ఈగ్రంథమునుబట్టి భవిష్యత్తును తెలుసుకొనుటకు జ్యోతిషశాస్త్రము - గ్రహములు - రాశులు - నక్షత్రము తెలిసికొనవలసిన అవసరము ఎంతమాత్రము లేదు. కాని సంఖ్యాశాస్త్రమునకును, జ్యోతిషశాస్త్రమునకును గల సంబంధము వివరముగ తెలుపబడెను

జాతకము లేకపోయినప్పటికిని ఏదో ఒక సంఖ్యను చెప్పమని ఆసంఖ్యనుబట్టిగాని భవిష్యత్తును ఏయేసంవత్సరములలో ఏయేమాసములలో, ఏయేదినములలో, ఏయేఫలితములు కలుగునో సమస్తము పూసగ్రుచ్చినట్లు తెలిసికొను విధానములును-విద్య, కళత్రము-ఉద్యోగము-సంతానము-ఆరోగ్యము. ఆయుర్దాయము-భూ, గృహ ప్రాప్తి-కోర్టువ్యవహారపు చిక్కులు-వ్యాపారము-సముద్రప్రయాణము-వాహనము-స్త్రీమూలకధనలాభము-లాటరీఫలితములు-అధికారము-కీర్తి, తీర్థయాత్రలు-యోగదాయకముగనుండు సంవత్సరములు మొదలగు సమస్తవిషయములు సులభముగ తెలిసికొనవచ్చును
ప్రతివారికి మిక్కిలి ఉపయోగమైనది.

